శ్రీ

మహాకవి దండికృతమ్

# దశకుమార చరితమ్

పూర్వపీఠికామాత్రమ్

ఆంధ్రానువాద టీకా సహితమ్





పరిష్కర్త :
డా. పాటిబండ మాధవశర్మ

టీకా కర్తలు :
యస్. జి. రామానుజాచార్యులు, ఎం. ఏ.
శలాక రఘునాథ శర్మ, ఎం. ఏ.



ప్రకాశకులు :
శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు
హైదరాబాదు-27

# విన్నపము

సంస్కృత భాషా సాహిత్యముల యధ్యయనము యొక్క విలువను, ఆవశ్యకమును ప్రజలు, ప్రభుత్వము, విద్యాధికారులు, విద్యార్థులు ఇప్పుడిప్పుడు గుర్తించు చున్నారు. ఆ భాష యందలి కావ్యములను, నాటకము లను చదివి యానందింపవలెనని పలువురు ఉత్సాహపడు చున్నారు. అయినను కావ్య నాటకములు స్వయముగా చదువుకొని యర్థము చేసికొని యానందించుటకు పలువురకు అవకాశము లభింపదు. అట్టివారికి ఉత్తమ సంస్కృత నాటకములను ఆంధ్రలిపిలో, ఆంధ్రానువాద, వ్యాఖ్యానములతో అచ్చువేసి అందజేయుట ఉచితము, అవుసరము అని తోచి మేము ఆ కార్యమునకు పూనుకొంటిమి.

సంస్కృత కావ్యములందలి కొన్ని సర్గములను గూడ సంస్కృత సాహిత్యాభిమానులైన యాంధ్ర పాఠకులకు అందుబాటులోనికి దెచ్చుటకును గొంత ప్రయత్నము చేయుచున్నాము. పదవిభాగ, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్యములతో పాటు కొంత వ్యాఖ్యా నము కూడ చేర్చి రఘువంశాది కావ్యములందలి సర్గములను ప్రకటింప వలెనని పూనుకొంటిమి.

పంచతంత్రము, దశకుమార చరిత్రము, హర్షచరిత్రము, కాదంబరీ మున్నగు గద్య గ్రంథములను ఆంధ్రానువాద సహితముగా ప్రచురించుటకు పూనుకొని యున్నాము.

విశ్వవిద్యాలయము నిర్వహించు పరీక్షలకు చదువుకొను విద్యార్థుల ప్రయోజనములను గూడ దృష్టియందుంచుకొని ఈ ప్రచురణములు సిద్ధము చేయబడుచున్నవి. వీవిని అధ్యాపకులు, సంస్కృత భాషా సాహిత్యాభిమానులైన యాంధ్ర రసజ్ఞులు ఆదరింతురనియు, మా యుద్యమమును ప్రోత్సహింతురనియు ఆశించుచున్నాము.

మా ప్రయత్నముయొక్క సాఫల్యమునకు ఆంధ్ర రసజ్ఞులే ప్రమాణము.

—ప్రకాశకులు

# పీఠిక

"చతుర్ముఖ ముఖాంభోజ
వనహంసవధూ ర్మమ
మానసే రమతాం నిత్యం
సర్వ శుక్లా సరస్వతీ"

అని ఆచార్య దండి కావ్యాదర్శ ప్రారంభమున రచించిన మంగళా చరణశ్లోకమును అధిక్షేపించుచు విజ్జికయను కవయిత్రి యీ క్రింది శ్లోకమును జెప్పినదట-

"నీలోత్పలదళశ్యామాం
విజ్జికాం మా మజానతా
వృథైవ దండినా ప్రోక్తా
సర్వశుక్లా సరస్వతీ"

నల్లకలువ రేకులవలె శ్యామవర్ణముగలిగిన విజ్జికయను నన్నెఱుగమిచే సరస్వతి సర్వశుక్లయని దండిచే వ్యర్థముగా చెప్పబడినది- తాను సరస్వతి యపరావతారమని భావించిన విజ్జిక తాను నల్లనిదైయుండగా సరస్వతి తెల్లనిదని దండి చెప్పుట వ్యర్థమని పలికినది. విజ్జిక రెండవ పులకేశి కుమారుడైన చంద్రాదిత్యునిభార్య. ఆమె కౌముదీ మహోత్సవము అను నాటకము రచించినది. ఈ విజ్జికకాలము క్రీ.శ. 660 ప్రాంతముగా నిర్ణయింపబడినది. కనుక ఈమెచే అధిక్షేపింపబడిన దండి అప్పటివాడో, కొంచెము వెనుకవాడో అయియుండవలెను.

దండి అవంతీ సుందరీ కథయందు తాను భారవి ముమ్మనుమడైనట్లు చెప్పకొని యున్నాడు. క్రీ.శ. 580 ప్రాంతముల పాలించిన

దుర్వినీతుడనురాజు భారవికృత కిరాతార్జునీయ కావ్యమునందలి 15 వ సర్గమునకు వ్యాఖ్య రచించెనట. కనుక భారవి 590 కి కొంతపూర్వమే జీవించి యుండవలయును. భారవి క్రీ. శ. 550 ప్రాంతముల జీవించి యుండునని భావించినచో ఆయనకు మూడవతరమువాడైన దండి తరమునకు 30 సంవత్సరములచొప్పున 90 సంవత్సరముల అనంతరము- అనగా క్రీ. శ. 640 ప్రాంతముల జీవించి యుండవచ్చును.

దండి కౌశికగోత్రజుడైన బ్రాహ్మణుడు. ఆయన పూర్వీకులు గుజరాతునందలి ఆనందపురమున నివసించు చుండిరి. భారవి తండ్రి యైన నారాయణస్వామి గుజరాతునుండి బీరారునందలి అచల (ఎలిచ) పురమునకు వలసపోయెను. సింహవిష్ణువు అను పల్లవరాజు ఆహ్వానముపై భారవి కంచికిపోయి ఆ రాజునకు ఆస్థానకవి యయ్యెను. భారవి అసలు పేరు దామోదరుడు. సూర్యునివలె ప్రకాశించు మేధాశక్తిగలవాడగుటచే ఆయనకు భారవియను లక్షణనామధేయము కలిగెను. భారవి కుమారుడు మహారథుడు. ఆతని కుమారుడు వీరదత్తుడు. వీరదత్తునకు గౌరియను భార్యయందు జన్మించినవాడు దండిమహాకవి

భారవి యన్న పేరువలెనే దండియన్నది లక్షణ నామధేయమే యందురు. దశకుమారచరిత్ర ప్రారంభమునందలి "బ్రహ్మాండచ్ఛత్ర దండః"- ఇత్యాది మంగళాచరణ శ్లోకమున దండశబ్దము పెక్కుపర్యాయములు ప్రయోగింపబడి యున్నది. దండశబ్ద ప్రియుడగుటచే దండి యను లక్షణనామధేయము కలిగినది. అసలు పేరు తెలియరాదు. మూడు నాల్గు తరములుగా దక్షిణదేశమందే ఆయన పూర్వులు స్థిరపడియుండినందున దండి పూర్తిగా దాక్షిణాత్యుడేయని చెప్పవలసియున్నది. ఈయన కాశ్రయమిచ్చిన కాంచీనగరప్రభువు శత్రుపరాజితుడై యడవులు పట్టగా దండియు కొంతకాలము అరణ్యవాసము చేసినట్లు తెలియుచున్నది. ఈ సంఘటన క్రీ. శ. 655లో జరిగినట్లు చరిత్రకారుల యభిప్రాయము. కనుక దండి క్రీ. శ. 640-55 ప్రాంతముల కంచిలో వర్ధిల్లిన దాక్షిణాత్య విద్వత్కవి యనుట నిశ్చయము.

3

## దండి గ్రంథములు

"త్రయోఽగ్నయ స్త్రయో వేదాః
త్రయో దేవా స్త్రయో గుణాః
త్రయో దండి ప్రబంధాశ్చ
త్రిషు లోకేషు విశ్రుతాః"

అను ఆభాణకమునుబట్టి దండి రచించినగ్రంథములు మూడు అని విదిత మగుచున్నది. కావ్యాదర్శమను అలంకారశాస్త్రము, దశకుమారచరిత్ర మను గద్యప్రబంధము దండి గ్రంథములుగా సర్వులు అంగీకరించి యున్నారు. మూడవగ్రంథము అవంతి సుందరీకథ యను గద్యగ్రంథ మని పలువుర యభిప్రాయము. ఇందు దండి వంశచరిత్ర వర్ణనము కలదు. ఛందోవిచితి యను గ్రంథము దండికృతమనియు, అదియే యాయన మూడవగ్రంథమనియు కొందరందురు దండి కొంతకాలము కుష్ఠరోగపీడితుడై యుండి, ముప్పదిరెండు మందాక్రాంతలను శివస్తుతి రూపమున రచించి రోగవిముక్తుడయ్యెనని చెప్పుచు కొందరొక శ్లోక మును చూపుచున్నారు-

"ఇతి విరచిత మేత చ్చారుచంద్రార్ధ మౌలేః
లలితపద ముదారం దండినా పండితేన
స్తవన మవనకామే నాత్మనోఽనామయాఖ్యం
భవతి విగతరోగో జంతు రేతజ్జపేన".

అవంతి సుందరీకథయే దండి మూడవకృతియని పలువురు విద్వాంసుల యభిప్రాయము. ఈ యవంతి సుందరికథ దశకుమారచరిత్రమునందు కూడ కలదు గనుక అదే కథనువర్ణించు ఈ మూడవగ్రంథము ప్రశస్తి కెక్కి యుండకపోవచ్చును.

# దశకుమార చరితము

సంస్కృత గద్య గ్రంథములలో సుబంధుని వాసవదత్త ప్రప్రథమముగా పరిగణింపబడుచున్నది. దండి దశకుమార చరిత్రము, బాణుని హర్షచరిత్ర, కాదంబరి ఇంచుమించు సమకాలముననే వెలువడి నట్లు పండితులు అభిప్రాయపడుచున్నారు. సుబంధుడు, బాణుడు తమ గ్రంథములందలి వస్తువును బృహత్కథనుండియే గ్రహించియుండిరి. దశకుమారచరిత్రమునందలి వస్తువు దండిచే స్వయముగా కల్పింపబడి నదే అయియుండునని విద్వాంసుల యభిప్రాయము.

సంస్కృతమునందలి కథాకావ్యములలో దశకుమార చరిత్రము ప్రముఖస్థానము నలంకరించుచున్నది.

> "అపాదః పదసంతానో గద్య మాఖ్యాయికా కథా
> ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రాఖ్యాయికా కిల
> నాయకేనైవ వాచ్యాన్యా నాయకే నేతరేణవా
> స్వగుణావిష్క్రియాదోషో నాత్ర భూతార్థశంసినః
> అపిత్వనియమో దృష్టః తత్రాప్యన్యైరుదీరణాత్
> అన్యో వక్తా స్వయంవేతి కీదృగ్వా భేదలక్షణమ్.
> ... ... ...
> తత్కథాఖ్యాయికేత్యేకా సంజ్ఞాద్వయాంకితా
> అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యానజాతయః"

పాదబద్ధమైనది పద్యము. పాదబంధరహితమైన పదసముదాయము గద్యము. ఆఖ్యాయిక, కథ యని గద్యకావ్యములు రెండువిధములు. ఆఖ్యాయికయందలి వస్తువు నాయకునిచేతనే చెప్పబడవలెను. కథయందలి వస్తువును నాయకుడుగాని ఇతరుడుగాని చెప్పవచ్చును. గతించిన వృత్తాంతమును చెప్పుచుండుటవల్ల నాయకునకు స్వగుణకథన

దోషము కలుగదు. నాయకభిన్నులైన వ్యక్తులుగూడ కథావస్తువు చెప్పు చుండుటవలన నాయకుడే చెప్పవలెనన్న నియమముకూడ ఆఖ్యాయికా రచనమున భంగము చేయబడుచుండుట కలదు. వక్త నాయకుడా అన్యుడా యనునది ఏపాటి భేదకలక్షణము ? కనుక కథ ఆఖ్యాయి కయు ఒక్కటియే. పేర్లుమాత్రమే భిన్నములు. ఆ మిగిలిన ఆఖ్యానజాతు లన్నియు ఇందే అంతర్భవించును. ఇది కథాఖ్యాయికలను గురించి దండి యభిప్రాయము. బాణుడు తన కథను, తనమిత్రుడైన హర్షుని కథను వర్ణించిన హర్షచరిత్ర ఆఖ్యాయికయనియు, ఆతని కాదంబరీ చరిత్ర కథయనియు పండితులందరు. దండి దృష్టిలో ఈ భేదము లేదు.

దశకుమార చరిత్రమున రాజవాహనుడు నాయకుడు, మంత్రికుమా రులు ఉపనాయకులు. ఇందలి కథలు నాయక ఉపనాయకులేచెప్పుట తర చుగా కనబడును. కనుక ఇది ఆఖ్యాయిక యనవచ్చును. దండి మత మున కథయు నగును. గుణాఢ్యుని బృహత్కథవలె నిదియు పెక్కు కథల కూడలి. శృంగార వీరాద్భుతములు ప్రధాన రసములు. సర్వ కథలయందును అద్భుత సంఘటనలు అడుగడుగునను సంభవించును. కనుక పఠిత యుత్కంఠతో పఠించి యానందించును.

సుబంధుని వాసవదత్తయందు కథ తక్కువ. శ్లేషాద్యలంకార భూయిష్ఠమైన రచనా విశేషమునకే అందు ప్రాధాన్యము. బాణుని కాదంబర్యాదులందు కథ కొంత యున్నను వర్ణనకు, అలంకారములకు అందు ప్రాధాన్యము దశకుమారచరిత్రమున కథకే సర్వప్రాధాన్యము. అందువల్ల వర్ణనలు చాలతక్కువ. అలంకారములు తక్కువ. కథా గమ నము అవిచ్ఛిన్నముగా సాగిపోవుచుండును.

## దండి గద్యశైలి

గద్యము చూర్ణము, వృత్తగంధి, ఉత్కలికాప్రాయము అని ముఖ్యముగా మూడు తెఱగుల విభజింపబడినది. అసమస్తములయిన లలిత పదములతో కూర్పబడిన గద్యము చూర్ణము-

"ఏతస్మిన్నేవ క్షణే వన్యో వారణః కశ్చి దదృశ్యత. తం విలోక్య భీతా సా బాలకం నిపాత్య ప్రాద్రవత్. అహం సమీపలతాగుల్మే ప్రవిశ్య పరీక్షమాణోఽ తిష్ఠమ్."

అటనట పద్యభాగములు గోచరించు గద్యము వృత్తగంధి. "కామపాలస్య వల్లభా" 'నందినీ మణిభద్రస్య'- ఇవి శ్లోక పాదములు. "భూవల్లభ భవదీయం, మనోరథఫల మివ సమృద్ధ లావణ్యం, తారుణ్యం నుతమిత్రో"- ఇందు ఆర్యావృత్త పాదములు గలవు. "సహచరమేతస్య నూనమ్ తస్య" ఇదియు ఆర్యాపాదమే. ఇట్టి పద్యపాదములుగల గద్యము వృత్తగంధి.

దీర్ఘసమాస భూయిష్ఠమైన గద్యము ఉత్కలికాప్రాయము. 'ఓజస్సమాస భూయస్త్వ మేతద్గద్యస్య జీవితం' అని దండి సమాస భూయస్త్వరూపమైన ఓజస్సు గద్యమునకు ప్రాణమని చెప్పెను. ఇట్టి రచన అదాక్షిణాత్యులకు- ముఖ్యముగా గౌడులకు ప్రియము. దాక్షిణాత్యుడైన దండి ఉత్కలికాప్రాయగద్యమును అంతగా అభిమానింపలేదు.

"తతః కదాచిన్నానావిధ మహాయుధ నైపుణ్య రచితా గణ్యా జన్యా రాజన్యమౌళిపాలి నిహిత నిశిత సాయకో మగధ నాయకో మాలవేశ్వరం ప్రత్యగ్ర సంగ్రామ ఘస్మరం సముత్కట మానసారం మానసారం ప్రతి సహేలం న్యక్కృత జలనిధి ఘోషాహం కారేణ భేరీభాంకారేణ హరికా కర్ణనాక్రాంత భయచండి మానం...."

ఇట్టి గద్యము దశకుమారచరిత్రమున కడుస్వల్పము. కథా కథన ప్రవణుడైన దండి కథా రసాస్వాదనమున పఠితకు అవరోధము

కల్పించు సమాస భూయిష్ఠరచన చేయనొల్లక ప్రసాదమాధుర్య గుణ భరితమైన చూర్ణమునే అతిశయముగా నాదరించెను.

"దండినః పదలాలిత్యం, భారవే రర్థ గౌరవమ్
ఉపమా కాళిదాసస్య, మాఘే సంతి త్రయో గుణాః"

అను ఆభాణకము కలదు. ఇతరుల మాట యెట్లున్నను దండివిషయ మున చెప్పబడిన పదలాలిత్యము మాత్రము సత్యకథనమే.

## దండి పాండిత్యము

దండి యెంతటి కవియో అంతటి పండితుడు. ఆయన రచించిన కావ్యాదర్శమను నలంకారగ్రంథమే ఆయన సాహిత్యశాస్త్ర పాండిత్యమునకు నిదర్శనము. దశకుమారచరిత్రమున ఆయన యెడ నెడ రాజనీతి, కామశాస్త్రము, చౌర్యము, దురోదరము, వేశ్యాలక్షణములు, కిరాత లక్షణములు, పెక్కు సాంఘికాచారములు వర్ణించెను. ఇందువల్ల ఆయన బహువిషయ పరిజ్ఞానము, లోకజ్ఞత వెల్లడియగుచున్నవి.

"కవిర్దండీ కవిర్దండీ" అని సాక్షాత్సరస్వతీదేవియే కాళిదాసుతో పలికెనని యీ క్రింది యాభాణకము చాటుచున్నది.

"కవిర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పండితః
త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః"

దండి మహాకవి జన్మించిన యనంతరమే కవి శబ్దమునకు బహువచన రూపము ఏర్పడినదని చమత్కరించు ఈ క్రింది శ్లోకము దండి సాహిత్య ప్రియుల యభిమానము నెంతగా చూఱగొనెనో వ్యక్తము చేయుచున్నది.

"జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యభిధాఽభవత్
కవీ ఇతి తతో వ్యాసే కవయ స్త్వయి దండిని"

లోకమున వాల్మీకి జన్మింపగా "కవి" అనుమాట పుట్టెను. తరువాత వ్యాసుడు జన్మింపగా "కవీ" అనుమాట (ద్వివచనము) పుట్టెను. ఓ దండీ! నీవు జన్మింపగా "కవయః" అనుమాట (బహువచనము) పుట్టెను. వాల్మీకి వ్యాసుల తరువాత పేర్కొనదగిన కవి దండియేయని దీని యభిప్రాయము.

ఇతి శివమ్

అక్టోబర్, 1972

పాటిబండ మాధవశర్మ

శ్రీరస్తు

# దశకుమారచరితమ్

## పూర్వపీఠికా

### కుమారోత్పత్తిర్నామ ప్రథమోచ్ఛ్వాసః

బ్రహ్మాణ్డచ్ఛత్రదణ్డః, శతధృతిభవనామ్భోరుహో నాలదణ్డః,
క్షోణీనౌకూపదణ్డః, క్షరదమరసరిత్పట్టికాకేతుదణ్డః,
జ్యోతిశ్చక్రాక్షదణ్డః, త్రిభువనవిజయస్తమ్భదండోఽఙ్ఘ్రిదణ్డః,
శ్రేయస్త్రైవిక్రమస్తే వితరతు విబుధద్వేషిణాం కాలదణ్డః.

అస్తి సమస్తనగరీనికషాయమాణా, శశ్వదగణ్యపణ్య విస్తారితమణిగణాదివస్తుజాత వ్యాఖ్యాతరత్నాకర మాహాత్మ్యా, మగధదేశ

---

శ్రీః

# దశకుమారచరితము

### కుమారోత్పత్తి యను ప్రథమోచ్ఛ్వాసము.

"బ్రహ్మాండమను గొడుగునకు కామయు, బ్రహ్మ జన్మ స్థానమైన తమ్మికి నాళమును, భూమి యనెడు నావకు తెఱచాప కంబమును, జారుచున్న యాకాశగంగ యనెడు పట్టుగుడ్డకు జెండాకఱ్ఱయు, నక్షత్ర చక్రమునకు ఇరుసు కొయ్యయు, త్రిభువనముయొక్క విజయమునకు స్తంభపు గఱ్ఱయు, దేవ శత్రువులకు కాలదండమును నగు త్రివిక్రముని యంఘ్రిదండము నీకు శ్రేయము నొసంగుగాక!"

సర్వ నగరములకు గీటురాయియై, ఎల్లప్పుడు లెక్కకు మిక్కిలియగు అంగళ్ళయందు నిండారియుండు మణి సమూహము మున్నగు వస్తు సముదాయముచే ప్రకటింపబడిన రత్నాకరుని మాహాత్మ్యము గలదియై, మగధదేశమునకు

శేఖరీభూతా, పుష్పపురీ నామ నగరీ. తత్ర వీరభట పటల సలిలోత్తుఙ్గ
తురఙ్గ తరఙ్గ కుఞ్జరమకర భీషణ సకలరిపుగణ కటకజలనిధి మథనే
మన్దరాయమాణసముద్దణ్డభుజదణ్డమణ్డనః, పురన్దరపురాఙ్గణ వనవిహరణ
పరాయణ తరుణగణికాజన గీయమానయా ఽతిమానయా శరదిన్దు
కున్ద ఘనసార నీహార హార మృణాళ మరాళ సురగజ నీర క్షీర గిరి
శాట్టహాస కైలాస కాశ నీకాశ మూర్త్యా రచితదిగన్తరాలపూర్త్యా
ఽభిత స్సురభితః, స్వర్లోకశిఖరోరురుచిరరత్నరత్నాకరవేలామేఖలావల
యిత ధరణీరమణీసౌభాగ్యభోగభాగ్యవాన్, అనవరతయాగ దక్షిణా
రక్షితశిష్ట విశిష్టవిద్యాసంభారభాసుర భూసురనికరః, విరచితారాతిసంతా
పేన ప్రతాపేన సతతతులితవియన్మధ్యహంసో, రాజహంసో నామ.

---

శిరోభూషణమైన పుష్పపురి యను నగరి కలదు. అందు వీరభటుల సమూహ
మనెడు జలముచే, ఎత్తయిన తరంగములనెడు తురంగములచే, ఏనుగులనెడి
మొసళ్ళచే భయంకరములగు సకల శత్రువుల సమూహముల నగరములనెడి
సముద్రములను మథించుటయందు మందర పర్వతమగు దృఢమైన భుజదండమే
అలంకారముగా గలవాడును, దేవేంద్రుని పట్టణమైన అమరావతి ముంగిటి
నందనవనమున విహరించుట యందాసక్తలయిన పడుచు పడుపుటాండ్రచే
గానము చేయబడుచున్నదియు, అతి విస్తారమైనదియు, శరచ్చంద్రుడు, మొల్ల
పూవు, పచ్చ కప్పురము, మంచు, ముత్యపుసరము, తమ్మితూడు, హంస, ఐరా
వతము, నీరు, పాలు, శివుని నవ్వు, వెండికొండ, తెల్లు మున్నగువాని వంటి
రూపము గలదియు, దిక్కులనడిమి ప్రదేశము నిండినదియునగు కీర్తిచేత అంత
టను మనోహరుడును, మేరు పర్వత శిఖరములవలె పెద్దవి, మెఱయునవియైన
రత్నములుగల రత్నాకరుని వేల యనెడు మొలనూలుచే చుట్టబడిన భూమి
యనెడు రమణియొక్క ప్రేమను అనుభవించు అదృష్టము గలవాడును, ఎడ
తెగని యాగ దక్షిణలచే పోషింపబడిన శిష్టులై విశిష్టములయిన విద్యలయొక్క
సమృద్ధిచే శోభిల్లు బ్రాహ్మణ సముదాయము గలవాడును, చేయబడిన శత్రు సంతా
పముగల ప్రతాపముచే నెల్లప్పుడును మధ్యందిన సూర్యుని బోలువాడును, గొప్ప

ఘనదర్ప కన్దర్పసౌన్దర్య సోదర్య హృద్య నిరవద్య రూపో భూపో బభూవ.

తస్య వసుమతీ నామ సుమతి ర్లీలావతీకులశేఖరమణీ రమణీ బభూవ-రోషరూక్షేణ నిటలాక్షేణ భస్మీకృతచేతనే మకరకేతనే తదా భయేనానవద్యా వనితేతి మత్వా తస్యాః రోలమ్బావళీ కేశజాలం, ప్రేమాకరో రజనీకరో విజితారవిన్దం వదనం, జయధ్వజాయమానో మీనో జాయాయుతో ఽక్షియుగళం, సకలసైనికాగ్రవీరో మలయసమీరో నిశ్వాసః, పథికహృద్దలనః కరవాలః ప్రవాళ శ్చాధరబిమ్బం, విజయశఙ్ఖో లావణ్యధరాబన్ధురా కన్ధరా, పూర్ణకుమ్భౌ చక్రవాకానుకారౌ పయోధరౌ, జ్యాయమానే మార్దవాసమానే బిసలతే బాహూ, ఈష దుత్ఫుల్లలీలావతంసకహ్లారకోరకో గఙ్గావర్తసనాభి ర్నాభిః, దూరీకృతయోగిమనోరథ శ్చైత్రరథో ఽతిఘనం జఘనం, జయస్తమ్భూతే

---

గర్వముగల మన్మథుని యందమునకు దోబుట్టువగు హృదయంగమమైన నిర్మలమైన రూపము గలవాడునునైన రాజహంసుడను రాజు గలడు.

అతనికి బుద్ధిమతియు, నారీకుల శిరోమణియునైన వసుమతి యను సతి కలదు. కోపోద్రిక్తుడైన నిటలాక్షునిచే మదనుడు దగ్ధచేతనుడు కాగా భయముచే ఈ వనిత నిర్దోష గదా యని తలంచి యామెకు (వసుమతికి) తుమ్మెదల బారు కేశపాశముగను, ప్రేమఖనియైన చంద్రుడు కమలమును దెగడు ముఖముగను, విజయధ్వజమైన మీనము పత్నీ సహితమై నేత్రయుగళముగను, సకల సైనికులలో మేటి యగు సమీరుడు నిశ్వాసముగను, విరహుల హృదయములను భేదించు కరవాలమైన ప్రవాళము అధర బింబముగను, విజయశంఖము లావణ్యభారముచే నతిశయిల్లు కంఠరముగను, పూర్ణకుంభములు చక్రవాకముల ననుకరించు స్తన యుగళముగను, అల్లెత్రాడగుచున్న సాటిలేని మెత్తదనముగల తామర తూండ్లు బాహువులుగను, ఇంచుక వికసించి విలాసాభరణమైన కలువమొగ్గ గంగానది యందలి సుడిని బోలు నాభిగను, దూరము చేయబడిన యోగుల కోరికలుగల విజయశీలమైన రథము అతిఘనమైన జఘనముగను, విష్ణుము

# దశకుమార చరితము

సంస్కృత గద్య గ్రంథములలో సుబంధుని వాసవదత్త ప్రప్రథమముగా పరిగణింపబడుచున్నది. దండి దశకుమార చరిత్రము, బాణుని హర్షచరిత్ర, కాదంబరి ఇంచుమించు సమకాలముననే వెలువడి నట్లు పండితులు అభిప్రాయపడుచున్నారు. సుబంధుడు, బాణుడు తమ గ్రంథములందలి వస్తువును బృహత్కథనుండియే గ్రహించియుండిరి. దశకుమారచరిత్రమునందలి వస్తువు దండిచే స్వయముగా కల్పింపబడి నదే అయియుండునని విద్వాంసుల యభిప్రాయము.

సంస్కృతమునందలి కథాకావ్యములలో దశకుమార చరిత్రము ప్రముఖస్థానము నలంకరించుచున్నది.

"అపాదః పదసంతానో గద్య మాఖ్యాయికా కథా
ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రాఖ్యాయికా కిల
నాయకేనైవ వాచ్యాన్యా నాయకే నేతరేణవా
స్వగుణావిష్క్రియాదోషో నాత్ర భూతార్థశంసినః
అపిత్వనియమో దృష్టః తత్రాన్యైరుదీరణాత్
అన్యో వక్తా స్వయంవేతి కీదృగ్వా భేదలక్షణమ్.
... ... ...
తత్కథాఖ్యాయికేత్యేకా సంజ్ఞాద్వయాంకితా
అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యానజాతయః"

పాదబద్ధమైనది పద్యము. పాదబంధరహితమైన పదసముదాయము గద్యము. ఆఖ్యాయిక, కథ యని గద్యకావ్యములు రెండువిధములు. ఆఖ్యాయికయందలి వస్తువు నాయకునిచేతనే చెప్పబడవలెను. కథయందలి వస్తువును నాయకుడుగాని ఇతరుడుగాని చెప్పవచ్చును. గతించిన వృత్తాంతమును చెప్పుచుండుటవల్ల నాయకునకు స్వగుణకథన

దోషము కలుగదు. నాయకభిన్నులైన వ్యక్తులుగూడ కథావస్తువు చెప్పు చుండుటవలన నాయకుడే చెప్పవలెనన్న నియమముకూడ ఆఖ్యాయికా రచనమున భంగము చేయబడుచుండుట కలదు. వక్త నాయకుడా అన్యుడా యనునది ఏపాటి భేదకలక్షణము ? కనుక కథ ఆఖ్యాయికయు ఒక్కటియే. పేర్లుమాత్రమే భిన్నములు. ఆ మిగిలిన ఆఖ్యానజాతు లన్నియు ఇందే అంతర్భవించును. ఇది కథాఖ్యాయికలను గురించి దండి యభిప్రాయము. బాణుడు తన కథను, తనమిత్రుడైన హర్షుని కథను వర్ణించిన హర్షచరిత్ర ఆఖ్యాయికయనియు, అతని కాదంబరీ చరిత్ర కథయనియు పండితులందరు. దండి దృష్టిలో ఈ భేదము లేదు.

దశకుమార చరిత్రమున రాజవాహనుడు నాయకుడు, మంత్రికుమారులు ఉపనాయకులు. ఇందలి కథలు నాయక ఉపనాయకులేచెప్పుట తరచుగా కనబడును. కనుక ఇది ఆఖ్యాయిక యనవచ్చును. దండి మతమున కథయు నగును. గుణాఢ్యుని బృహత్కథవలె నిదియు పెక్కు కథల కూడలి. శృంగార వీరాద్భుతములు ప్రధాన రసములు. సర్వ కథలయందును అద్భుత సంఘటనలు అడుగడుగునను సంభవించును. కనుక పఠిత యుత్కంఠతో పఠించి యానందించును.

సుబంధుని వాసవదత్తయందు కథ తక్కువ. శ్లేషాద్యలంకార భూయిష్ఠమైన రచనా విశేషమునకే అందు ప్రాధాన్యము. బాణుని కాదంబర్యాదులందు కథ కొంత యున్నను వర్ణనకు, అలంకారములకు అందు ప్రాధాన్యము దశకుమారచరిత్రమున కథకే సర్వప్రాధాన్యము. అందువల్ల వర్ణనలు చాలతక్కువ. అలంకారములు తక్కువ. కథా గమనము అవిచ్ఛిన్నముగా సాగిపోవుచుండును.

## దండి గద్యశైలి

గద్యము చూర్ణము, వృత్తగంధి, ఉత్కలికాప్రాయము అని ముఖ్యముగా మూడు తెఱగుల విభజింపబడినది. అసమస్తములయిన లలిత పదములతో కూర్పబడిన గద్యము చూర్ణము-

"ఏతస్మిన్నేవ క్షణే వన్యో వారణః కశ్చి దదృశ్యత. తం విలోక్య భీతా సా బాలకం నిపాత్య ప్రాద్రవత్. అహం సమీపలతాగుల్మే ప్రవిశ్య పరీక్షమాణోఽ తిష్ఠమ్."

అటనట పద్యభాగములు గోచరించు గద్యము వృత్తగంధి. "కామపాలస్య వల్లభా" 'నందినీ మణిభద్రస్య'- ఇవి శ్లోక పాదములు. "భూవల్లభ భవదీయం, మనోరథఫల మివ సమృద్ధ లావణ్యం, తారుణ్యం సుతమిత్రో"- ఇందు ఆర్యావృత్త పాదములు గలవు. "సహచరమేతస్య నూనమ్ తస్య" ఇదియు ఆర్యాపాదమే. ఇట్టి పద్యపాదములుగల గద్యము వృత్తగంధి.

దీర్ఘసమాస భూయిష్ఠమైన గద్యము ఉత్కలికాప్రాయము. 'ఓజస్సమాస భూయస్త్వ మేతద్గద్యస్య జీవితం' అని దండి సమాస భూయస్త్వరూపమైన ఓజస్సు గద్యమునకు ప్రాణమని చెప్పెను. ఇట్టి రచన అదాక్షిణాత్యులకు- ముఖ్యముగా గౌడులకు ప్రియము. దాక్షిణాత్యుడైన దండి ఉత్కలికాప్రాయగద్యమును అంతగా అభిమానింపలేదు.

"తతః కదాచిన్నానావిధ మహాయుధ నైపుణ్య రచితాగణ్య జన్య రాజన్యమౌళిపాలి నిహిత నిశిత సాయకో మగధనాయకో మాలవేశ్వరం ప్రత్యగ్ర సంగ్రామ ఘస్మరం సముత్కట మానసారం మానసారం ప్రతి సహేలం న్యక్కృత జలనిధి ఘోషాహం కారేణ భేరీభాంకారేణ హఠికా కర్ణనాక్రాంత భయచండి మానం...."

ఇట్టి గద్యము దశకుమారచరిత్రమున కడుస్వల్పము. కథాకథన ప్రవణుడైన దండి కథా రసాస్వాదనమున పఠితకు అవరోధము.

కల్పించు సమాస భూయిష్ఠరచన చేయనొల్లక ప్రసాదమాధుర్య గుణ భరితమైన చూర్ణమునే అతిశయముగా నాదరించెను.

"దండినః పదలాలిత్యం, భారవే రర్థ గౌరవమ్
ఉపమా కాళిదాసస్య, మాఘే సంతి త్రయో గుణాః"

అను ఆభాణకము కలదు. ఇతరుల మాట యెట్లున్నను దండివిషయ మున చెప్పబడిన పదలాలిత్యము మాత్రము సత్యకథనమే.

## దండి పాండిత్యము

దండి యెంతటి కవియో అంతటి పండితుడు. ఆయన రచించిన కావ్యాదర్శమను నలంకారగ్రంథమే ఆయన సాహిత్యశాస్త్ర పాండిత్యమునకు నిదర్శనము. దశకుమారచరిత్రమున ఆయన యెడ నెడ రాజనీతి, కామశాస్త్రము, చౌర్యము, దురోదరమం, వేశ్యాలక్షణములు, కిరాత లక్షణములు, పెక్కు సాంఘికాచారములు వర్ణించెను. ఇందువల్ల ఆయన బహువిషయ పరిజ్ఞానము, లోకజ్ఞత వెల్లడియగుచున్నవి.

"కవిర్దండీ కవిర్దండీ" అని సాక్షా త్సరస్వతీదేవియే కాళిదాసుతో పలికెనని యీ క్రింది యాభాణకము చాటుచున్నది.

"కవిర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పండితః
త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః"

దండి మహాకవి జన్మించిన యనంతరమే కవి శబ్దమునకు బహువచన రూపము ఏర్పడినదని చమత్కరించు ఈ క్రింది శ్లోకము దండి సాహిత్య ప్రియుల యభిమానము నెంతగా చూఱగొనెనో వ్యక్తము చేయుచున్నది.

"జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యభిధాఽభవత్
కవీ ఇతి తతో వ్యాసే కవయ స్త్వయి దండిని"

లోకమున వాల్మీకి జన్మింపగా "కవి" అనుమాట పుట్టెను. తరువాత వ్యాసుడు జన్మింపగా "కవీ" అనుమాట (ద్వివచనము) పుట్టెను. ఓ దండీ! నీవు జన్మింపగా "కవయః" అనుమాట (బహువచనము) పుట్టెను. వాల్మీకి వ్యాసుల తరువాత పేర్కొనదగిన కవి దండియేయని దీని యభిప్రాయము.

ఇతి శివమ్

అక్టోబర్, 1972

పాటిబండ మాధవశర్మ

శ్రీరస్తు

# దశకుమారచరితమ్

## పూర్వపీఠికా

### కుమారోత్పత్తి ర్నామ ప్రథమోచ్ఛ్వాసః

బ్రహ్మాణ్డచ్ఛత్రదణ్డః, శతధృతిభవనామ్భోరుహో నాలదణ్డః,
క్షోణీనౌకూపదణ్డః, క్షరదమరసరిత్పట్టికాకేతుదణ్డః,
జ్యోతిశ్చక్రాక్షదణ్డ, స్త్రిభువనవిజయ స్తమ్భదండో ఽంఘ్రిదణ్డః,
శ్రేయ స్త్రైవిక్రమ స్తే వితరతు విబుధద్వేషిణాం కాలదణ్డః.

అస్తి సమస్తనగరీనికషాయమాణా, శశ్వదగణ్యపణ్య విస్తారితమణిగణాదివస్తుజాత వ్యాఖ్యాతరత్నాకర మాహాత్మ్యా, మగధదేశ

---

శ్రీః

# దశకుమారచరితము

### కుమారోత్పత్తి యను ప్రథమోచ్ఛ్వాసము.

"బ్రహ్మాండమను గొడుగునకు కామయు, బ్రహ్మ జన్మ స్థానమైన తమ్మికి నాళమును, భూమి యనెడు నావకు తెఱచాప కంబమును, జారుచున్న యాకాశగంగ యనెడు పట్టుగుడ్డకు జెండాకఱ్ఱయు, నక్షత్ర చక్రమునకు ఇరుసు కొయ్యయు, త్రిభువనముయొక్క విజయమునకు స్తంభపు గఱ్ఱయు, దేవ శత్రువులకు కాలదండమును నగు త్రివిక్రముని యంఘ్రిదండము నీకు శ్రేయము నొసంగుగాక !"

సర్వ నగరములకు గీటురాయియై, ఎల్లప్పుడు లెక్కకు మిక్కిలియగు అంగళ్ళయందు నిండారియుండు మణి సమూహము మున్నగు వస్తు సముదాయముచే ప్రకటింపబడిన రత్నాకరుని మాహాత్మ్యము గలదియై, మగధదేశమునకు

శేఖరీభూతా, పుష్పపురీ నామ నగరీ. తత్ర వీరభట పటల సలిలోత్తుఙ్గ తురఙ్గ తరఙ్గ కుఞ్జరమకర భీషణ సకలరిపుగణ కటకజలనిధి మథనే మన్దరాయమాణసముద్దణ్డభుజదణ్డమణ్డనః, పురన్దరపురాఙ్గణ వనవిహరణ పరాయణ తరుణగణికాజన గీయమానయా ఽతిమానయా శరదిన్దు కున్ద ఘనసార నీహార హార మృణాళ మరాళ సురగజ నీర క్షీర గిరి శాట్టహాస కైలాస కాశ నీకాశ మూర్త్యా రచితదిగన్తరాలపూర్త్యా ఽభిత స్ఫురకీర్త్యా, స్వర్లోకశిఖరోరురుచిరరత్నరత్నాకరవేలామేఖలావల యిత ధరణీరమణీసౌభాగ్యభోగభాగ్యవాన్, అనవరతయాగ దక్షిణా రక్షితశిష్ట విశిష్టవిద్యాసంభారభాసుర భూసురనికరః, విరచితారాతిసంతా పేన ప్రతాపేన సతతతులితవియన్మధ్యహంసో, రాజహంసో నామ.

---

శిరోభూషణమైన పుష్పపురి యను నగరి కలదు. అందు వీరభటుల సమూహ మనెడు జలముచే, ఎత్తయిన తరంగములనెడు తురంగములచే, ఏనుగులనెడి మొసళ్ళచే భయంకరములగు సకల శత్రువుల సమూహముల నగరములనెడి సముద్రములను మథించుటయందు మందర పర్వతమగు దృఢమైన భుజదండమే అలంకారముగా గలవాడును, దేవేంద్రుని పట్టణమైన యమరావతి ముంగిటి నందనవనమున విహరించుట యందాసక్తలయిన పడుచు పడుపుటాండ్రచే గానము చేయబడుచున్నదియు, అతి విస్తారమైనదియు, శరచ్చంద్రుడు, మొల్ల పూవు, పచ్చ కప్పురము, మంచు, ముత్తెపుసరము, తమ్మితూడు, హంస, ఐరావతము, నీరు, పాలు, శివుని నవ్వు, వెండికొండ, తెల్లి మున్నగువాని వంటి రూపము గలదియు, దిక్కులనడిమి ప్రదేశము నిండినదియునగు కీర్తిచేత అంతటను మనోహరుడును, మేరు పర్వత శిఖరములవలె పెద్దవి, మెఱయునవియైన రత్నములుగల రత్నాకరుని వేల యనెడు మొలనూలుచే చుట్టబడిన భూమి యనెడు రమణియొక్క ప్రేమను అనుభవించు అదృష్టము గలవాడును, ఎడ తెగని యాగ దక్షిణలచే పోషింపబడిన శిష్టులై విశిష్టములయిన విద్యలయొక్క సమృద్ధిచే శోభిల్లు బ్రాహ్మణ సముదాయము గలవాడును, చేయబడిన శత్రు సంతాపముగల ప్రతాపముచే నెల్లప్పుడును మధ్యందిన సూర్యుని బోలువాడును, గొప్ప

ఘనదర్ప కన్దర్పసౌన్దర్య సోదర్య హృద్య నిరవద్య రూపో భూపో బభూవ.

తస్య వసుమతీ నామ సుమతి ర్లీలావతీకులశేఖరమణీ రమణీ బభూవ-రోషరూక్షేణ నిటలాక్షేణ భస్మీకృతచేతనే మకరకేతనే తదా భయేనానవద్యా వనితేతి మత్వా తస్యాః రోలమ్బావళీ కేశజాలం, ప్రేమాకరో రజనీకరో విజితారవిన్దం వదనం, జయధ్వజాయమానో మీనో జాయాయుతో ఒక్షియుగళం, సకలసైనికాగ్రవీరో మలయ సమీరో నిశ్వాసః, పథికహృద్దలనః కరవాలః ప్రవాల శ్చాధరబిమ్బం, విజయశఙ్ఖో లావణ్యధరాబన్ధురా కన్ధరా, పూర్ణకుమ్భౌ చక్రవాకాను కారౌ పయోధరౌ, జ్యాయమానే మార్దవాసమానే బిసలతే బాహూ, ఈష దుత్ఫుల్లలీలావతంసకల్హారకోరకో గఙ్గావర్తసనాభి ర్నాభిః, దూరీకృత యోగిమనోరథ శ్చైత్రరథో ఒతిఘనం జఘనం, జయస్తమ్భాతే

---

గర్వముగల మన్మథుని యందమునకు దోబుట్టువగు హృదయంగమమైన నిర్మల మైన రూపము గలవాడునునైన రాజహంసుడను రాజు గలడు

అతనికి బుద్ధిమతియు, నారీకుల శిరోమణియునైన వసుమతి యను సతి కలదు. కోపోద్రిక్తుడైన నిటలాక్షునిచే మదనుడు దగ్ధచేతనుడు కాగా భయముచే ఈ వనిత నిర్దోష గదా యని తలంచి యామెకు (వసుమతికి) తుమ్మెదల బారు కేశపాశముగను, ప్రేమఖనియైన చంద్రుడు కమలమును దెగడు ముఖముగను, విజయధ్వజమైన మీనము పత్నీ సహితమై నేత్రయుగళముగను, సకల సైనికులలో మేటి యగు సమీరుడు నిశ్వాసముగను, విరహుల హృదయములను భేదించు కరవాలమైన ప్రవాళము అధర బింబముగను, విజయశంఖము లావణ్య భారముచే నతిశయిల్లు కంఠముగను, పూర్ణకుంభములు చక్రవాకముల ననుక రించు స్తన యుగళముగను, అల్లెత్రాడగుచున్న సాటిలేని మెత్తదనముగల తామర తూండ్లు బాహువులుగను, ఇంచుక వికసించి విలాసా భరణమైన కలువ మొగ్గ గంగానది యందలి సుడిని బోలు నాభిగను, దూరము చేయబడిన యోగుల కోరికలుగల విజయశీలమైన రథము అతిఘనమైన జఘనముగను, విఘ్నము

సౌన్దర్యభూతే విఘ్నితయతిజనారమ్భే రమ్భే చోరుయుగళ, మాతపత్ర సహస్రపత్త్రం పాదద్వయ, మస్త్రభృతాని ప్రసూనాని తానీతరా ణ్యఙ్గాని సమభూవ న్నివ విజితామరపురే పుష్పపురే నివసతా సాఽనన్త భోగ లాలితా వసుమతీ వసుమతీవ మగధరాజేన యథాసుఖ మన్వభావి.

తస్య రాజ్ఞః పరమవిధేయా ధర్మపాల పద్మోద్భవ సితవర్మ నామధేయా ధీరధిషణావధీరితవిబుధాచార్యకార్య సాహిత్యాః కులా మాత్యా స్త్రయో ఽభూవన్. తేషాం సిత వర్మణః సుమతిసత్యవర్మాణౌ, ధర్మపాలస్య సుమన్త్రి సుమిత్ర కామపాలాః, పద్మోద్భవస్య సుశ్రుత రత్నోద్భవా వితి తనయా స్సమభూవన్.

తేషు ధర్మశీల స్సత్యవర్మా సంసారాసారతాం బుద్ధ్వా తీర్ద యాత్రాభిలాషీ దేశాన్తర మగమత్. విటనటవారనారీ పరాయణో

---

గావింపబడిన యతిజనుల ప్రారంభములుగల (రంభా) అరటి బోదెలు తొడల జంటగను, గొడుగైన కమలము పాదముల జంటగను, అస్త్రములయిన పుష్ప ములు ఆయా యితరాంగములుగను ఐనవా యన్నట్లున్న ఆ వసుమతి అమరా వతిని మించు పుష్పపురమున నివసించు మగధ రాజగు రాజహంసునిచే అంతములేని భోగములచే సంతోషపెట్టబడినదై .(ఆదిశేషుని పడగలందు సుఖించుచున్న) వసుమతివలె యథేష్టముగా అనుభవింపబడెను

ఆ రాజునకు మిగుల విధేయులును, దృఢమైన ప్రజ్ఞచే తిరస్కరింపబడిన బృహస్పతిచే గూడ పర్యాలోచింపదగిన కార్య సౌకర్యము గల వారునునగు ధర్మ పాలుడు, పద్మోద్భవుడు, సితవర్మయను ముగ్గురు కులామాత్యులు గలరు. వారిలో సితవర్మకు సుమతి సత్యవర్మలు, ధర్మపాలునకు సుమంత్ర సుమిత్ర కామపాలులు, పద్మోద్భవునకు సుశ్రుత రత్నోద్భవులు అను పుత్రులు జన్మించిరి.

వారిలో ధర్మశీలుడగు సత్యవర్మ సంసారముయొక్క నిస్సారతను గ్రహించి తీర్థయాత్రలం దభిలాషగలవాడై దేశాంతరమున కేగెను. విటనట వేశ్యాలోలుడై దుర్వినీతుడైన కామపాలుడు తండ్రియొక్కయు, అన్నయొక్కయు

దుర్వినీతః కామపాలో జనకాగ్రజన్మనో శ్శాసన మతిక్రమ్య భువం బభ్రామ. రత్నోద్భవో౽పి వాణిజ్యనిపుణతయా పారావారతరణ మకరోత్. ఇతరే మన్త్రిసూనవః పురన్దరపురాతిథిషు పితృషు యథా పూర్వ మన్వతిష్ఠన్.

తతః కదాచి న్నానావిధమహాయుధనై పుణ్యరచితాగణ్యజన్య రాజన్యమౌలిపాలి నిహితనిశితసాయకో మగధనాయకో మాలవేశ్వరం ప్రత్యగ్రసంగ్రామఘస్మరం సముత్కటమానసారం మానసారం ప్రతి సహేలం న్యక్కృతజలనిధి ఘోషాహంకారేణ భేరీభాంకారేణ హఠికా కర్ణనాక్రాన్తభయచణ్డిమానం దిగ్దన్తావలవలయం విఘూర్ణయన్ నిజ భరనమన్మేదినీభరణాయమాన భుజగరాజమస్తకబలేన చతురఙ్గబలేన సంయుతః సంగ్రామాభిలాషేణ రోషేణ మహతా ౽౽విష్టో నిర్యయౌ. మాలవనాథో ౽ప్యనేకానేకపయూథసనాథో విగ్రహ స్సవిగ్రహ ఇవ

---

ఆజ్ఞను ఉల్లంఘించి దేశములవెంట దిరుగసాగెను. రత్నోద్భవుడుగూడ వాణిజ్యమందలి నేర్పుచేత సముద్రమును దాటి పోయెను తక్కిన మంత్రి కుమారులు తమ తండ్రులు అమరపురమునకు అతిథులు కాగా (మరణింపగా) పంగాచారమునే యనుష్ఠించుచుండిరి.

అనంతరము ఒకప్పుడు వివిధములయిన యాయుధములను ప్రయోగించుట యందలి నేర్పుతో చేయబడిన లెక్కలేని యుద్ధములందు రాజశ్రేష్ఠుల మస్త కములందు ఉంపబడిన కఱకుటమ్ములుగల మగధనాయకుడు (రాజహంసుడు) నిత్య నూతనములయిన యుద్ధములందు (శత్రు) భక్షకుడై, మిక్కిలియైన యభి మాన బలముగల మాలవనాథుడగు మానసారునిపై సవిలాసముగా, తిరస్కరింపబడిన సాగర ఘోషా విజృంభణముగల భేరీ భాంకారముతో బలవంతముగా వినబడుటచే ఆక్రమించిన భయతీవ్రత గల దిగ్గజ సమూహమును కంపింపజేయుచు, తన బరువుచే క్రుంగుచున్న భూమిని మోయుటచే పీడితమైన యాదిశేషుని పడగల బలముగల చతురంగ బలముతో గూడినవాడై, యుద్ధము నందభిలాషగల గొప్పరోషముచే ఆవిష్టుడై బయలు వెడలెను. మాలవనాథు డును పెక్కు గజ సమూహములతో గూడినవాడై, మూర్తిమంత మైన్న, యుద్ధమా

సాగ్రహో ఽభిముఖీభూయ భూయో నిర్జగామ. తయో రథ రథ తురగఖుర క్షుణ్ణక్షోణీసముద్భూతే కరిఘటాకటప్రవన్మదధారాధౌత మూలే నవపల్లవవరణాగతదివ్యకన్యాజన జవనికాపటమణ్డల ఇవ విస్తృతవ్యాకులే ధూళీపటలే దివిషదధ్వని ధిక్కృతాన్యధ్వని పటహధ్వాన బధిరితాశేషదిగన్తరాలం శస్త్రాశస్త్రి హస్తాహస్తి పరస్పరాభిహత సైన్యం జన్య మజని మగధరాజః ప్రక్షీణసకలసైన్యమణ్డలం మాలవరాజం జీవగ్రాహ మభిగృహ్య దయాళుతయా పున రపి స్వరాజ్యే ప్రతిష్ఠాపయామాస. తత స్స రత్నాకరమేఖలా మనన్య శాసనాం శాసన్ననపత్యతయా నారాయణం సకలలోకకారణం నిరన్తర మర్చయామాస.

అథ కదాచి త్తదగ్రమహిషీ దేవీ దేవేన కల్పవల్లీ ఫల మాధేహీతి ప్రభాతసమయే సుస్వప్న మబలా ఽఽలోకితవతీ. సా తతో

యన్నట్లు క్రుద్ధుడై, యెదురై బయలుదేరెను. అంత నియ్యిరువురకు రథముల చేతను, గుఱ్ఱపు గిట్టలచేతను త్రొక్కబడిన భూమినుండి పుట్టినదియు, ఏనుగు గుంపుల చెక్కిళ్ళనుండి కారుచున్న మద ధారలచే కడుగబడిన మూలము గలదియు, క్రొత్త ప్రియులను వరింప వచ్చిన యప్సరఃకాంతలకు తెరగుడ్డవలె నున్నదియునగు ధూళీపటలము ఆకాశప్రదేశము నావరింపగా, ఆకాశమునందణచివేయబడిన యన్య ధ్వనులుగల ఢక్కా ధ్వనిచే చెవిటిదిగా చేయబడిన సమస్త దిగంతరాలము గలదియు, శస్త్రాశస్త్రి, హస్తాహస్తి (పెనగులాటలందు) పరస్పరము చంపుకొనబడిన సైన్యము గలదియునైన యుద్ధము జరిగెను. మగధ రాజు నశించిన సర్వసైన్య సముదాయముగల మాలవరాజును ప్రాణములతో బట్టుకొనియు దయాళుత్వముచే మరల అతనిని స్వరాజ్యమునందే ప్రతిష్ఠించెను. అంతట నాతడు రత్నములతో గూడిన సముద్రమే మొలనూలుగా గలదియు, ఇతరుల యొక్క శాసనములేనిదియునగు భూమిని శాసించుచు, సంతాన హీనతచే సకల లోకకర్తయగు నారాయణుని నిరంతరము అర్చించుచుండెను.

అంత నొకప్పుడా రాజు పట్టపురాణియైన భార్య భగవంతుడైన నారాయణునిచే "కల్పవృక్ష ఫలమును పొందుము" అని ప్రభాతసమయమున మంచి స్వప్నము గాంచినదయ్యెను అనంతరమామె ప్రియుని మనోరథఫలమునకు

దయితమనోరథపుష్పఫలం గర్భ మధత్త. రాజా సంపన్నైక్కతా ఖణ్డల స్సుహృన్నృపమణ్డలం సమాహూయ నిజసంపన్మనోరథానురూపం దేవ్యా స్సీమన్తోత్సవం వ ధత్త.

ఏకదా హితై స్సుహృన్మన్త్రిపురోహితైః సభాయాం సింహాసనాసీనో గుణై రహీనో లలాటన్యస్తాఞ్జలినా ద్వారపాలేన వ్యజ్ఞాపి- 'దేవ ! దేవసందర్శనలాలసమానసః కోఽపి దేవేన విశేషార్చనార్హో యతి ర్ద్వారదేశ మధ్యాస్తే' ఇతి. తదనుజ్ఞాతేన తేన స సంయమీ నృపసమీప మనాయి. భూపతి రాయా న్తం తం విలోక్య సమ్యగ్ జ్ఞాత్వా తదీయగూఢచారభావో నిఖిల మనుచరనికరం విసృజ్య మ న్త్రిజనసమేతః ప్రణత మేనం సమన్దహాస మభాషత. 'నను తాపస ! దేశం సాపదేశం భ్రమన్ భవాం స్తత్రతత్ర భవదభిజ్ఞాతం కథయ, త్వితి. తేనాభాషి భూభ్రమణబలినా ప్రాఞ్జలినా ! 'దేవ ! శిరసి దేవ స్యాజ్ఞా మాదా

---

పుష్పము వంటిదైన గర్భను ధరించెను. ఐశ్వర్యముచే తిరస్కరింపబడిన దేవేంద్రుడుగల యా రాజు మిత్రులయిన రాజుల సమూహమును ఆహ్వానించి తన సంపదకు, కోరికకు దగిన తెఱంగున రాణికి సీమంతోత్సవము జరిపెను.

ఒకనాడు హితులైన మిత్ర మంత్రి పురోహితులతో గూడి సభయందు సింహాసనాసీనుడై యుండి గుణసంపన్నుడైన యా రాజహంసుడు లలాటము నందుంచబడిన యంజలిగల ద్వార పాలకునిచే నిట్లు విన్నవింపబడెను —"దేవా ! దేవర దర్శింప గుతూహలపడు మనస్సు గలవాడై యెవడో దేవరచే విశేష పూజ కర్హుడైన యతి ద్వారదేశము నందున్నాడు". ఆ రాజుచే ననుజ్ఞాతుడైన యా ద్వారపాలకునిచే ఆ సంయమి రాజ సమీపమునకు గొనిరాబడెను వచ్చుచున్న యాతనింగాంచి, చక్కగా గ్రహింపబడిన యాతని గూఢచార భావము గలవాడై రాజు అనుచరులందరను బంపివైచి, మంత్రి జన సమేతుడై, తనకు ప్రణమిల్లిన యాతనితో మందహాస పూర్వకముగా నిట్లు భాషించెను— "ఓయీ తాపసుడా ! మిషతో దేశమున సంచరించుచు అచ్చటచ్చట నీచే దెలిసికొనబడిన దానిని చెప్పుదువు గాక." దేశ సంచారదక్షుడు, ప్రాంజలియైన యాతనిచే నిట్లు

యైనం నిర్దోషం వేషం స్వీకృత్య మాలవేన్ద్ర నగరం ప్రవిశ్య తత్ర
గూఢతరం వర్తమాన స్తస్య రాజ్ఞ స్సమస్త ముదన్తజాతం విదిత్వా
ప్రత్యాగమమ్. మానీ మానసార స్స్వసైనికాయుష్మత్త్వాన్తరాయే
సంపరాయే భవతః పరాభవ మనుభూయ వైలక్ష్యలక్ష్యహృదయో వీత
దయో మహాకాలనివాసినం కాలీవిలాసిన మనశ్వరం మహేశ్వరం
సమారాధ్య తపః ప్రభావసంతుష్టా దస్మా దేకవీరారాతిఘ్నీం భయదాం
గదాం లబ్ధ్వా ఽఽత్మాన మప్రతిభటం మన్యమానో భవన్త మభి
యోద్ధు ముద్యుక్తః. తతః పరం దేవః ప్రమాణ' మితి.

తదాలోచ్య నిశ్చితకృత్యై రమాత్యై రాజా విజ్ఞాపితోఽభూత్:
'దేవ! నిరుపాయేన దైవసహాయేన యోద్ధు మరాతి రాయాతి. తస్మా
దస్మాకం యుద్ధం సాంప్రత మసాంప్రతం. సహసా దుర్గసంశ్రయః
క్రియతా' మితి. తై ర్బహుధా విజ్ఞాపితో ఽప్యఖర్వేణ గర్వేణ

---

పలుకబడెను—"దేవా! దేవర యానతి శిరసావహించి నిష్కలంకమైన యీ
వేషము దాల్చి మాలవరాజు నగరము ప్రవేశించి, అందు మిక్కిలి రహస్యముగా
ప్రవర్తించుచు ఆ రాజు యొక్క సమస్తమైన వృత్తాంతమును దెలిసికొని తిరిగి
వచ్చితిని. అభిమానవంతుడైన మానసారుడు తన సైనికుల యాయుష్మత్త్వము
నకు భంగము గలిగించు సమరమున తమవలన పరాభవము ననుభవించి, దైన్య
మునకు గురియైన హృదయము గలవాడై, దయమాలి, మహాకాళ నివాసియు,
కాళీప్రియుడును, నాశరహితుడును నగు మహేశ్వరుని ఆరాధించి, తపఃప్రభావ
ముచే సంతుష్టుడైన ఆ దేవునివలన ఏకవీరుడైన శత్రువును సంహరించు
భయంకరమైన గదను సంపాదించి, తన్ను ఎదురులేని వానినిగా దలంచుచు,
తమ్మెదిరించుటకు సిద్ధపడి యున్నాడు. అటుపైన దేవర ప్రమాణము".

దానిని విచారించి నిశ్చయింపబడిన రాజకార్యముగల మంత్రులచే రాజు
ఇట్లు విజ్ఞాపితుడయ్యెను—"దేవా! శత్రువు తిరుగులేని దైవ సహాయముతో
వచ్చుచున్నాడు. అందువల్ల మన కిప్పుడు సమరము మేలు కాదు. వెంటనే
బలిష్ఠమైన కోట నాశ్రయింతురు గాక!" వారిచే పలు తెఱగుల విన్నవింపబడిన

విరాజమానో రాజా తద్వాక్య మకృత్య మి త్యనాదృత్య ప్రతియోద్ధు మనా బభూవ. శితికణ్ఠ దత్తశక్తిసారో మానసారో యోద్ధుమనసా మగ్రీభూయ సామగ్రీ సమేతో ఒక్లేశం మగధదేశం ప్రవివేశ. తదా తదాకర్ణ్య మన్త్రిణో భూమహేన్ద్రం మగధేన్ద్రం కథంచి దనునీయ రిపుభి రసాధ్యే విన్ధ్యాటవీమధ్యే ఒవరోధా న్మూలబలరక్షితా న్నివే శయామాసుః.

రాజహంస స్తు ప్రశ స్తవీతదైన్యసైన్యసమేత స్తీవ్రగత్యా నిర్గత్యాధికరుషం ద్విషం రురోధ. పరస్పరబద్ధవైరయో రేతయో శ్శూరయో స్తదాలోకనకుతూహలాగత గగనచరాశ్చర్యకారిణి రణే వర్ధమానే జయాకాఙ్క్షీ మాలవ దేశరక్షీ వివిధాయుధస్థైర్యచర్యాశ్చిత సమరతులితామరేశ్వరస్య మగధేశ్వరస్య తస్యోపరి త్రిపురారాతిదత్తాం

---

వాడయ్యె మొక్కవోని గర్వముచే ప్రకాశించుచున్న యా రాజు వారి వాక్యము అకృత్యమని నిరాదరించి, ఎదిర్చి పోరదలచిన వాడయ్యెను. పరమేశ్వరునిచే నొసంగబడిన శక్తి యొక్క బలముగల మానసారుడు యుద్ధమాడ గోరినవారిలో అగ్రేసరుడై యుద్ధ సామగ్రితో అశ్రమముగా మగధదేశము ప్రవేశించెను, అప్పుడది విని మంత్రులు భూలోక దేవేంద్రుడైన మగధరాజును ఎట్లో ఒప్పించి, శత్రువుల కసాధ్యమైన వింధ్యారణ్య మధ్యమున అంతఃపుర జనమును మూలబల రక్షితముగా విడియించిరి,

రాజహంసుడు మాత్రము ప్రశస్తము, దైన్య రహితమునైన సైన్యముతో గూడి త్వరిత గతితో బయలుదేరి మిక్కిలి రోషించిన శత్రువును అడ్డగించెను. పరస్పరము దృఢమైన శత్రుత్వముగల యా శూరు లిరువురకు వారిని చూచు కుతూహలముతో వచ్చిన గగన చరులకు ఆశ్చర్యము గలిగించునట్టి యుద్ధము పెరుగుచుండగా, జయము గోరిన మాలవ దేశాధీశుడు వివిధములైన యాయుధములను గట్టిగా ప్రయోగించు నేర్పు గలిగి సమరమున నమరేంద్ర సమానుడగు ఆ మగధేశ్వరునిపై త్రిపురవైరి యగు నీశ్వరునిచే నొసంగబడిన

గదాం ప్రాహిణోత్. నిశితశరనికరశకలీకృతాఽపి సా పశుపతి శాస
నస్యా వన్ధ్యతయా సూతం నిహత్య రథస్థం రాజానం మూర్ఛిత
మకార్షీత్. తతో వీతప్రగ్రహా అక్షతవిగ్రహా వాహాః రథ మాదాయ
దైవగత్యాఽన్తఃపురశరణ్యం మహారణ్యం ప్రావిశన్. మాలవ
నాథో జయలక్ష్మీసనాథో మగధరాజ్యం ప్రాజ్యం సమాక్రమ్య పుష్ప
పుర మధ్యతిష్ఠత్.

తత్ర హేతితతిహతిశ్రాంతాః అమాత్యా దైవగత్యా ఽనుత్క్రా
న్తజీవితా నిశాన్తవాతలబ్ధసంజ్ఞాః కథంచి దాశ్వస్య రాజానం సమంతా
దన్వీక్ష్యానవలోకితవన్తో దైన్యవన్తో దేవీ మవాపుః. వసుమతీ తుతేభ్యో
నిఖిలసైన్యక్షతిం రాజ్ఞో ఽదృశ్యత్వం చాకర్ణ్యోద్విగ్నా శోకసాగరమగ్నా
రమణానుగమనే మతిం వ్యధత్త. 'కల్యాణి! భూరమణమరణ మని
శ్చితం. కించ దైవజ్ఞకథితో మథితోద్ధతారాతి స్సార్వభౌమో ఽభిరామో

---

గదను ప్రయోగించెను. పదునైన బాణముల సమూహములచే ముక్కలు చేయ
బడినదయ్యు, పరమేశ్వరుని శాసనము వ్యర్థము కానందువల్ల ఆ గద సారథిని
చంపి రథమందున్న రాజును మూర్ఛితుని గావించెను. అంతట కళ్లెములు వదలి
నవి, గాయపడిన శరీరములు గలవియైన యశ్వములు రథమును దీసికొని విధివశ
మున అంతఃపుర స్త్రీలకు ఆశ్రయమైన మహారణ్యము ప్రవేశించెను. జయ
లక్ష్మితో గూడినవాడై మాలవనాథుడు సమృద్ధమగు మగధ రాజ్యమును ఆక్ర
మించి పుష్పపురము నధిష్ఠించెను.

అచ్చట ఆయుధ సముదాయముయొక్క దెబ్బలచే నొచ్చియు దైవ వశ
మున ప్రాణములు కోల్పోని మంత్రులు వేకువ గాలులచే తెలివివచ్చి ఎట్లో ఊర
డిల్లి రాజుకొఱకు కెల్లెడల వెదకియు కనుగొనజాలనివారై విషణ్ణులై రాజ్ఞికడ
కరిగిరి. వసుమతియును సర్వసైన్యముయొక్క నాశనమును, రాజు కానరామియు
వారివలన విని కలతజెంది శోక సాగరమున మునిగి పతి ననుగమించుటయందు
కృత నిశ్చయురాలయ్యెను. "కల్యాణీ! రాజు మరణము అనిశ్చితము. మఱి
యును మర్దింపబడిన ప్రబల శత్రువులు గలవాడు, సార్వభౌముడు, సుందరుడు,

భవితా కుసుమాకరః కుమార స్త్వదుదరే వసతి. తస్మా దద్య తవ మరణ మనుచిత' మితి భాషితాభాషితై రమాత్యపురోహితై రనునీయమానయా తయా క్షణం క్షణహీనయా తూష్ణీ మస్థాయి. అథార్ధరాత్రే నిద్రానిమీలితనేత్రే పరిజనే విజనే శోకపారావార మపార ముత్తర్తుమశక్నువతీ సేనానివేశదేశం నిశ్శబ్దలేశం శనై రతిక్రమ్య యస్మిన్రథస్య సంసక్తతయా తదానయనపలాయనశ్రాంతా గన్తు మక్షమాః క్ష్మాపతిరథ్యాః పథ్యాకులాః పూర్వ మతిష్ఠన్, తస్య నికటవటతరోశ్శాఖాయాం మృతి రేఖాయా మివ క్వచి దుత్తరీయార్ధేన బన్ధనం మృతిసాధనం విరచ్య మర్తుకామా వాఙ్మాధురీవిరసీకృతకలకణ్ఠా సాశ్రుకణ్ఠా వ్యలపత్: 'లావణ్యోపమితపుష్పసాయక ! భూనాయక ! భవానేవ మమ భావి న్యపి జన్మని వల్లభో భవ' త్వితి.

---

సుకుమారుడు. కాగలడని దైవజ్ఞులచే జెప్పబడిన కుమారుడు నీ గర్భమునందు గలడు. అంమవల్ల ఇప్పుడు నీ మరణము ఉచితము గాదు" అని సాదరముగా బలికిన మంత్రి పురోహితులచే నోదార్పబడినదైన యామె యుత్సాహరహితయై ముహూర్తము ఊరకయుండెను. అంతట పరిజనము నిద్రాముద్రిత నేత్రము కాగా నిర్జనమైన యర్ధరాత్రమున అపారమైన శోకసాగరమును దాట నశక్తురాలై శబ్దలేశమును లేని సేనా నివేశ ప్రదేశమును మెల్లగా దాటి, దేనియందు రథము తగుల్కొనుటచే దానిని లాగుట యందు పింగుల నలసిపోయి నడుచుటకు అసమర్థములైన రాజు రథాశ్వములు మార్గమున కలతపడి పూర్వము ఆగి యుండెనో, చేరువనే యున్న ఆ వటవృక్షముయొక్క శాఖయందు మరణరేఖ యందువలె నొక్కెడ ఉత్తరీయార్ధముచే మరణ సాధనమైన యురిత్రాటిని ఏర్పరచి, మరణింపగోరినదై వచో మాధుర్యముచే దిరస్కరింపబడిన కోకిలములు గలదై అశ్రుపూర్ణ కంఠముతో నిట్లని విలపించెను—"సౌందర్యమున మదనుని బోలినవాడా ! నేలతేడా ! రాబోవు జన్మమునందును నీవే నాకు భర్త వగుదువు గాక."

తదాకర్ణ్య నీహారకరకిరణనికర సంపర్కలబ్ధావబోధో మాగధో ఽగాధరుధిరవిరక్షరణనష్టచేష్టో దేవీవాక్య మివ నిశ్చన్వాన స్తన్వానః ప్రియవచనాని శనై స్తా మాహ్వాయత్. సా ససంభ్రమ మాగత్యామన్దహృదయానన్దసంఫుల్ల వదనారవిందా త ముపోషితాభ్యా మివానిమిషితాభ్యాం లోచనాభ్యాం సంప్రాశ్య వికస్వరేణ స్వరేణ పురోహితామాత్యజన ముచ్చై రాహూయ తేభ్య స్త మదర్శయత్. రాజా నిటలతటచుమ్బిత నిజచరణామ్బుజైః ప్రశంసితదైవ మాహాత్మ్యై రమాత్యై రభాణి: 'దేవ! రథ్యచయ స్సారథపగమ్యే రథం రభసా దరణ్య మనయ' దితి. 'తత్ర నిహతసైనికగ్రామే సంగ్రామే మాలవపతినాఽఽరాధితపురారాతినా ప్రహితయా గదయా దయాహీనేన తాడితో మూర్ఛా మాగత్యాత్ర నిశా స్తపవనేన బోధితో ఽభవ' మితి మహీపతి రకథయత్. తతో విరచితమహేన మన్త్రినివ

---

చంద్రకిరణ సముదాయముల స్పర్శచే తెలివొంది, ఎడతెగక రక్తము చాలసేపు స్రవించుటచే చేష్టలుడిగియున్న మగధరాజు అది విని రాణి పలుకుగా నిశ్చయించుచు, ప్రియ వచనములు పలుకుచు మెల్లగా నామెను చేర బిలిచెను. ఆమెయు వేగముగా వచ్చి అతిశయమైన హృదయానందముచే చక్కగా విప్పారిన ముఖారవిందము గలదై ఉపవసించినవా యన్నట్లు రెప్పపాటులేని కన్నులతో ఆతనిని గ్రోలి. (తనివిదీర చూచి) విప్పారిన కంఠస్వరముతో పురోహితామాత్య జనమును బిగ్గరగా బిలిచి, వారి కాతనిని జూపెను. ఫాలతలములచే స్పృశింపబడిన తన పాదకమలములు గలవారై ప్రశంసింపబడిన దైవమహిమ గల యమాత్యులచే నిట్లు పలుకబడెను— "దేవా! సారథి మరణించినంత రథాశ్వములు రథమును వేగముగా నరణ్యమున కీడ్చుకొని పోయినవి" రాజును ఇట్లనెను—"అచ్చటి సమరమున సైనిక సమూహము మరణింపగా, ఆరాధింపబడిన పురవైరి గలవాడును, దయా రహితుడును నైన మాలవరాజుచే ప్రయోగింపబడిన గదచే తాడితుడనై మూర్ఛనొంది ఇచ్చటి ప్రభాత మారుతముచే తెలివొందిన వాడనైతిని". అంతట పొందబడిన యానందముగల మంత్రి బృందముచే కూర్పబడిన దైవానుకూల్యముగల కాలమున శిబిరమునకు గొనిరాబడి

హేన విరచితదైవానుకూల్యేన కాలేన శిబిర మానీయా పనీతాశేషశల్యో వికసితనిజాననారవిన్దో రాజా సహసా విరోపితవ్రణో ఽకారి.

విరోధిదైవధిక్కృత పురుషకారో దైన్యవ్యాప్తాకారో మగధాధిపతి రధికాధి రమాత్యసంపత్త్యా మృదుభాషితయా తయా వసుమత్యా మత్యా చ కలితయా సమబోధి ''దేవ! సకలస్య భూపాలకులస్య మధ్యే తేజస్వీ వరిష్ఠో గరిష్ఠో భవా నద్య విన్ధ్యవనమధ్యం నివసతీతి, జలబుద్బుదసమానా విరాజమానా సంప త్తటిల్లతేవ సహసై వోదయతి నశ్యతిచ. తన్నిఖిలం దైవాయత్తమే వావధార్యం కార్యమ్. కించ పురా హరిశ్చన్ద్ర రామచన్ద్రముఖ్యా మహీంద్రా ఐశ్వర్యోపమితమహేంద్రా దైవతన్త్రం దుఃఖయన్త్రం సమ్య గనుభూయ పశ్చా దనేకకాలం నిజరాజ్య మకుర్వన్. తద్వదేవ భవాన్ భవిష్యతి. కంచన కాలం విరచితదైవసమాధి ర్గలితాధి స్తిష్ఠతు భవా'' నితి

---

తొలగింపబడిన బాణపు ములుకులు గలవాడై, వికసించిన కమలమువంటి ముఖము గల రాజు వెంటనే మాన్పబడిన గాయములు గలవాడుగా చేయబడెను.

విపరీత విధిచే దిరస్కరింపబడిన పురుషకారము గలవాడు, దైన్యముతో నిండిన యాకారము గలవాడు, మిక్కిలి దిగులొందిన వాడునగు మగధనాయకుడు మంత్రుల సమ్మతిగలది, మతిగలది, మృదుభాషిణియైన యా వసుమతీదేవిచే నిట్లు బోధింపబడెను—"దేవా! సర్వమైన రాజ లోకములోపల తేజస్వి, శ్రేష్ఠుడు, గరిష్ఠుడునైన నీవు ఇప్పుడు వింధ్యాటవీ మధ్యమున నివసించుచున్నావనగా, నీటి బుడగతో సాటియై యొప్పు సంపద మెఱుపు తీగవలె అంతలో పొడమి యంతలో నడగుచున్నది. కనుక సర్వకార్యమును దైవాధీనమే యని నిశ్చయింపదగును. మఱియును పూర్వము హరిశ్చంద్రుడు, రామచంద్రుడు మున్నగు భూమీశ్వరులు—ఐశ్వర్యమున దేవేంద్రుని బోలినవారు — దైవాధీనమైన దుఃఖబాధను చక్కగా ననుభవించి తరువాత చిరకాలము తమ రాజ్యము నేలికొనిరి. నీవును అట్లే కాగలవు కనుక కొంతకాలము దైవధ్యాన మవలంబించి, చింత విడిచి యుందువుగాక."

తత స్సకలసైన్యసమన్వితో రాజహంస స్తపోవిభ్రాజమానం వామదేవనామానం తపోధనం నిజాభిలాషావాప్తిసాధనం జగామ. తం ప్రణమ్య తేన కృతాతిథ్య స్తస్మై కథితకథ్య స్తదాశ్రమే దూరీకృత శ్రమే కంచనకాల ముషిత్వా నిజ రాజ్యాభిలాషీ మితభాషీ సోమకులావతంసో రాజహంసో ముని మభాషత 'భగవన్! మానసారః ప్రబలేన దైవబలేన మాం నిర్జిత్య మద్భోజ్యం రాజ్య మనుభవతి. త దహ ముగ్రం తప స్తప్త్వా త మరాతి మున్మూలయిషా మి లోకశరణ్యేన భవత్కారుణ్యేనేతి నియమవ న్తం భవ న్తం ప్రాప్నువ' మితి. తత స్త్రికాలజ్ఞ స్తపోధనో రాజాన మవోచత్: ''సఖే శరీర కార్శ్య కారిణా తపసాఽలం; వసుమతీగర్భస్థ స్సకలరిపుకుల మర్దనో రాజ నన్దనో నూనం సంభవిష్యతి; కంచన కాలం తూష్ణీమా స్వే'' తి గగన చారిణ్యాఽపి వాణ్యా సత్య మేత దితి తద్దైవావోచి. స రాజాఽపి మునివాక్య మఙ్గీకృత్యాతిష్ఠత్.

---

అంతట సకలసేనా సమేతుడై రాజహంసుడు తన యభిలాష ఫలించుటకు సాధనము కాగలవాడు, తపస్సుచే ప్రకాశించుచున్నవాడునగు వామదేవుడను పేరుగల తపోధనుని కడకేగెను. ఆయనకు ప్రణమిల్లి, ఆయనచే నాతిథ్యము పొంది, ఆయనకు విన్నవింపవలసిన దానిని విన్నవించి, శ్రమ రహితమైన ఆయన యాశ్రమమున గొంతకాలము వసించి, తన రాజ్యము నందభిలాష గలవాడై మితభాషియు, చంద్రవంశాలంకారుడును నగు రాజహంసు డా మునితో నిట్లనెను— "పూజ్యుడా! ప్రబలమైన దైవబలముచే నన్ను జయించి మానసారుడు నే ననుభవింపవలసిన రాజ్యమును తానసుభవించుచున్నాడు. అందువల్ల నేనును ఉగ్రమైన తపస్సు కావించి యా శత్రువును లోక శరణ్యమైన నీ కారుణ్యముచే నిర్మూలింపగలనని నియమవంతుడైన వైన నిన్ను ఆశ్రయించితిని". అంతట త్రికాలజ్ఞుడైన యా తపోధనుడు రాజుతో నిట్లనెను—"సఖుడా! దేహమును కృశింపజేయు తపస్సు వలదు. వసుమతీదేవి గర్భమున సకల శత్రుజన మర్దనుడగు రాజకుమారుడు నిశ్చయముగా జన్మింపగలడు. కొంచెము కాలము ఊరకుండుము". అప్పుడే యాకాశవాణిచే గూడ "ఇది సత్యము" అని పలుకబడెను. రాజహంసుడును ముని వాక్యము నంగీకరించియుండెను.

తత స్సంపూర్ణ గర్భదివసా వసుమతీ సుముహూర్తే సకలలక్షణ లక్షితం సుత మసూత. బ్రహ్మవర్చసేన తులితవేధసం పురోధసం పురస్కృత్య కృత్యవి న్మహీపతిః కుమారం సుకుమారం జాత సంస్కారేణ బాలాలంకారేణ చ విరాజమానం రాజవాహననామానం వ్యధత్త. తస్మి న్నేవ కాలే సుమతి సుమన్త్ర సుమిత్ర సుశ్రు తానాం మన్త్రిణాం ప్రమతి మిత్రగుప్త మన్త్రగుప్త విశ్రుతాఖ్యా మహాభిఖ్యా స్సూనవో నవోద్యదిన్దురుచయ శ్చిరాయుష స్సమజా యన్త. రాజవాహనో మన్త్రి పుత్రై రాత్మమిత్రై స్సహ బాలకేళీ రనుభవ న్నవర్ధత.

అథ కదాచి దేకేన తాపసేన రసేన రాజలక్షణవిరాజితం కంచి న్నయనానన్దకరం సుకుమారం కుమారం రాజ్ఞే సమర్ప్యావోచి.— భూవల్లభ! కుశసమిదానయనాయ వనం గతేన మయా కాచి దశరణ్యా

---

పిదప నిండిన గర్భదివసములు గల వసుమతీదేవి శుభ ముహూర్తము నందు సమస్త రాజలక్షణములచే లక్షితుడైన పుత్రుని గనెను. బ్రహ్మవర్చస్సు చేత బ్రహ్మసమానుడైన పురోహితుని పురస్కరించుకొని కృత్యము నెరిగిన మహారాజు జాతకర్మాది సంస్కారము చేతను, బాలోచితమైన అలంకారము చేతను, విరాజిల్లు సుకుమారుడగు కుమారుని రాజవాహనుడను పేరుగల వాని నిగా ఒనర్చెను. ఆ సమయమునందే సుమతి, సుమంత్ర, సుమిత్ర, సుశ్రుతు లను మంత్రులకు ప్రమతి, మిత్రగుప్త, మంత్రగుప్త, విశ్రుతులను పేర్లు గలిగి ప్రఖ్యాతులైన పుత్రులు నవోదయ చంద్రకాంతిగలవారై, చిరాయుష్యము గల వారై జన్మించిరి. రాజవాహనుడు ఆత్మమిత్రులగు మంత్రికుమారులతో పాటు బాల్యక్రీడలు ననుభవించుచు వర్ధిల్లుచుండెను.

అనంతరము అనురాగముగల ఒకానొక తాపసి రాజలక్షణములచే ప్రకా శించుచు నేత్రానందము గల్గించు సుకుమారుడగు కుమారుని రాజునకు సమర్పించి యిట్లు పలికెను—"ఓ మహారాజా! కుశలను, సమిధలను తెచ్చుటకై అడవిని చేరిన నాకు దిక్కులేక, స్పష్టపడు దైన్యముగల్గి కన్నీరుగార్చు ఒక యువతి కన

వ్య క్తకార్పణ్యా ఒక్ర ముఞ్చ్రసీ యువతీ విలోకితా. నిర్జనే వనే కిం నిమిత్తం రుద్యతే త్వయేతి పృష్టా సా కరరుహై రశ్రూణి ప్రమృజ్య సగద్గదం మా మవోచత్.

''మునే ! లావణ్యజితపుష్పసాయకే మిథిలానాయకే కీర్తి వ్యాపృతసుధర్మణి నిజసుహృదో మగధరాజస్య సీమన్తినీ సీమన్త మహోత్సవాయ పుత్త్రదారసమన్వితే పుష్పపుర ముపేత్య కంచన కాల మధివసతి, సమారాధితగిరీశో మాలవాధీశో మగధరాజం యోద్ధు మభ్యగాత్. తత్ర ప్రఖ్యాతయో రేతయో రసంఖ్యే సంఖ్యే వర్ధమానే సుహృత్సాహాయ్యకం కుర్వాణో నిజబలేఽసతి విదేహే విదేహేశ్వరో ప్రహారవర్మా జయవతా రిపుణా ఽభిగృహ్య కారుణ్యేన పుణ్యేన విసృష్టో హతావశేషేణ శూన్యేన సైన్యేన సహ స్వపురగమన మకరోత్. తతో వనమార్గేణ దుర్గేణ గచ్ఛ న్నధికబలేన శబరబలేన

---

బడెను. "ఈ నిర్జనమైన యడవిలో నే కారణమున నేడుచు చుంటివని" యడుగ బడినదై యామె గోళ్ళతో కన్నీళ్ళను తుడిచికొని సగద్గదముగా నాతో నిట్లు పలికెను—

"ఓ మహర్షీ ! లావణ్యముచే జయింపబడిన మన్మథుడు గలవాడును, కీర్తిచే విస్తరింపబడిన దేవసభ గలవాడును ఐన మిథిలాధిపతి (ప్రహారవర్మ) తన మిత్రుడగు మగధరాజుయొక్క ధర్మపత్ని సీమంత మహోత్సవము నకై పుత్రదార సహితుడై పుష్పపురమును చేరి కొంతకాలము వసించెను. ఆ సమయమున ఆరాధింపబడిన శంకరుడుగల మాలవాధిపతి యుద్ధముచేయుటకై మగధరాజుపై కేగెను. అచట ప్రఖ్యాతులైన వీరిరువురకు జరిగిన గొప్ప యుద్ధమునందు మిత్రునకు సహాయము చేయుచున్న విదేహరాజైన ప్రహారవర్మ తన బలము నశింపగా, జయము పొందిన శత్రువుచేత చిక్కి, కారుణ్య వశమున, పుణ్యవశమున విడువబడినవాడై, చావగా మిగిలిన శూన్యమగు సైన్యముతో పాటు తన పురమునకు వెళ్లుచుండెను. అంతట దుర్గమమైన వనమార్గమున పోవుచు గొప్ప బలము గల శబర సైన్యముచే వేగముగ ముట్టడింపబడినవాడై

రభసా దభిహన్యమానో మూలబలాభిరక్షితావరోధః పలాయిష్ట. తదీయార్భకయో ర్యమలయో ర్ధాత్రీభావేన పరికల్పితా ఽహం మద్దుహితాఽపి తీవ్రగతిం భూపతి మనుగన్తు మక్షమే అభూవ. తత్ర వివృతవదనః కోఽపి రూపీ కోప ఇవ వ్యాఘ్రో మాం వ్యాఘ్రాతు మాగతవాన్. భీతాఽహ ముదగ్రపాణిః స్ఖలన్తీ పర్యపతమ్. మదీయ పాణిభ్రష్టో బాలకః కస్యాపి కపిలాశవస్య క్రోడ మభ్యలీయత. తచ్ఛవాకర్షిణో ఽమర్షిణో వ్యాఘ్రస్య ప్రాణాన్ బాణో బాణాసనయన్త్రముక్తో ఽపాహరత్. విలోలాలకో బాలకోఽపి శబరై రాదాయ కుత్రచి దపానీయత. కుమార మపర ముద్వహన్తీ మద్దుహితా కుత్ర గతా న జానే. సాహం మోహం గతా కేనాపి దయాలునా గోపాలేన స్వకుటీర మావేశ్య విరోపితవ్రణా ఽభవమ్, తత స్స్వస్థీభూయ భూయః క్ష్మాభర్తు రన్తిక ముపతిష్ఠాసు రసహాయతయా దుహితు

---

మూలబలముచే రక్షింపబడిన అంతఃపుర స్త్రీజనము గల ప్రహారవర్మ పలాయితుడై పోయెను. కవలలైన యాతని పిల్లలకు దాదిగా నియమింపబడిన నేను, నా కూతురును వేగముగ వెళ్లు మహారాజును అనుసరించుటకు అశక్యంబైతిమి. అచట రూపము ధరించిన కోపమా యన్నట్లున్న ఒక వ్యాఘ్రము నన్ను మ్రింగవచ్చెను. భయపడిన నేను చేతిని పైకెత్తి తొట్రుపాటుగలదాననై పడిపోయితిని. నా చేతినుండి జారిన బాలకుడు ఒక కపిల గోశవము మాటున జేరెను. ఆ శవమును లాగుచు క్రోధము గల్గిన వ్యాఘ్రము యొక్క ప్రాణములను ధనుస్సునుండి వెలువడిన ఒక బాణము అపహరించెను కదలాడు ముంగురులుగల బాలకుడు బోయవాండ్రచే గ్రహింపబడి ఎచ్చటికో తీసికొనిపోబడెను. మరియొక కుమారుని గొనివచ్చు నా కూతురు ఎటకేగెనో నాకు తెలియదు. అట్టి నేను మూర్ఛ పొందిన దాననై యుండి, ఎవడో ఒక దయగల గోపాలకునిచేత తన గృహమునకు తీసికొనపోబడి మాన్పబడిన గాయములు గలదాననైతిని. పిదప స్వస్థత బొంది, మరల రాజుగారి సమీపమునకు బయలుదేరిన దాననై అసహాయురాలి నగుటచేతను పుత్రికజాడ తెలియకపోవుట చేతను వ్యాకులత జెందుచుంటిని"–

రనభిజ్ఞాతతయా చ వ్యాకులీభవామి''— ఇత్యభిదధానా 'ఏకాకిన్యపి స్వామినం గమిష్యా' మీతి సా తదైవ నిరగాత్.

అహ మపి భవన్మిత్రస్య విదేహనాథస్య విపన్నిమిత్తం విషాద మనుభవన్ తదన్వయాఙ్కురం కుమార మన్వేష్యం స్తదైకం చణ్డికామన్దిరం సున్దరం ప్రాగామ్. తత్ర సంతత మేవంవిధ విజయ సిద్ధయే కుమారం దేవతోపహారం కరిష్య న్తః కిరాతాః 'మహీరుహ శాఖావలమ్బిత మేన మసిలతయా వా, సైకతతలే ఖననినిక్షిప్త చరణం లక్షీకృత్య శితశరనికరేణ వా, అనేకచరణైః పలాయమానం కుక్కురబాలకై ర్వా దంశయిత్వా సంహనిష్యామ' ఇతి భాషమాణా మయా సమభ్యభాష్య న్త 'ననుకిరాతా! స్తమోఘోరప్రచారే కాంతారే స్ఖలితపథః స్థవిరభూసురోఽహం. మమ పుత్త్రకం క్వచి చ్ఛాయా యాం నిక్షిప్య మార్గాన్వేషణాయ కించి దన్తర మగచ్ఛమ్. స కుత్ర

---

అని పలుకుచు "ఒంటరిదాననై నను ప్రభువును చేరగలను"—అని ఆమె అప్పుడే బయలు దేరి పోయెను.

నేను కూడ మీ మిత్రుడయిన విదేహరాజునకు కల్గిన ఆపద కారణ ముగా దుఃఖము ననుభవించుచు, ఆతని వంశాంకురమైన కుమారుని అన్వే షించుచు, అప్పుడొక సుందరమగు కాళికాలయమును చేరితిని. అచ్చట ఎల్ల ప్పుడు ఇటువంటి జయము సిద్ధించుటకై కుమారుని దేవతోపహారముగా చేయు చున్న బోయవాండ్రు "వృక్షశాఖకు వ్రేలాడు ఇతనిని ఖడ్గలతచేత ఖండితమా, ఇసుక తిన్నెలో త్రవ్వి పూడ్చిన చరణములు గలవానినిగా జేసి గురిపెట్టి వాడి బాణ సమూహముచే త్రుంపుదమా, అనేక పాదములతో పరుగులెత్తు కుక్క పిల్లలచేత కఱపించి చంపుదమా" యని పల్కుచుండగా నేనువారితో నిట్లంటిని. "ఓ బోయలారా! చీకటిచే భయంకర సంచారముగల అరణ్యమునందు త్రోవ తప్పిన ముసలి బ్రాహ్మణుడను. నేను నా చిన్నకుమారుని ఒకచో నీడలోనుంచి, మార్గాన్వేషణ నిమిత్తమై కొంతదవ్వున కరిగితిని. వాడు ఎచట కేగెను? ఎవనిచే తీసికొని పోబడెను? ఎంత వెదకినను కనబడుటలేదు. ఆతని ముఖమును చూడ

గతః? కేన వా గృహీతః? పరీక్ష్యాపి న వీక్ష్యతే. తస్మిన్నావలోకనేన వినాఽనేకాన్యహాన్యతీతాని. కిం కరోమి? క్వ యామి? భవద్భి ర్నాకి మపి ర్శీ?'తి. 'ద్విజోత్తమ! కశ్చి దత్ర తిష్ఠతి. కి మేష తవ నన్దనః? సత్య మేవ? తదేనం గృహా' ణేత్యుక్త్వా దైవానుకూల్యేన మహ్యం తం వ్యతరన్. తేభ్యో దత్తాశీ రహం బాలక మఙ్గీకృత్య శిశిరోదకాదినోపచారే ణాశ్వాస్య నిశ్శఙ్కం భవదఙ్క మానీతవా నస్మి. ఏవ మాయుష్మన్తం పితృరూపో భవా నభిరక్షతా దితి—రాజా సుహృ దాపన్నిమిత్తం శోకం తన్నన్దనవిలోకనసుఖేన కించి దధరీకృత్య, త ముపహారవర్మనామ్నాఽఽహూయ, రాజవాహన మివ పుపోష.

జనపతి రేకస్మిన్ దివసే తీర్థస్నానాయ పక్కణనికటమార్గేణ గచ్ఛ న్నబలయా కయాచి దుపలాలిత మనుపమశరీరం కుమారం కంచి దవలోక్య కుతూహలాకుల స్తా మపృచ్ఛత్ 'భ మిని! రుచిర

---

కనే అనేక దినములు గడచినవి. ఏమి చేయుదును? ఎచటి కేగుదును? మీచే చూడబడలేదా?" అని. "ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఇచట ఒకడున్నాడు. ఇతడు నీ కుమారుడా? ఇది సత్యమైనచో నితనిని స్వీకరింపుము" అని పల్కి, దైవము అనుకూలించుటచేత వానిని నా కొసంగిరి. వారల కాశీస్సులనిచ్చి నేను బాలకుని స్వీకరించి, చల్లని నీరు మొదలగు ఉపచారములచేత ఊరడిల్లజేసి, నిశ్శంకముగా మీ సన్నిధికి తీసికొని వచ్చితిని. ఇట్లు ఆయుష్మంతుడైన వానిని పితృరూపులైన మీరు రక్షింతురుగాక." మహారాజు మిత్రుని ఆపదయే నిమిత్తముగా గల దుఃఖమును ఆతని కుమారుని చూచుటద్వారా కొంచెము తగ్గించుకొని, ఆ బాలునకు ఉపహారవర్మ యని పేరిడి రాజవాహనుని వలె పోషించెను.

మహారాజు ఒకానొక పుణ్య దివసమునందు తీర్థస్నాన నిమిత్తమై పట్టణ సమీప మార్గమున వెళ్ళుచు ఒక స్త్రీ చేత లాలింపబడువాడును, సాటిలేని శరీరము గలవాడును అయిన ఒక కుమారుని చూచి కుతూహలముగల వాడగుచు ఆమె నిట్లు ప్రశ్నించెను "ఓ అబలా! సుందరాకారుడును, రాజగుణ సంపూ

మూర్తి రాజగుణసంపూర్తి రసౌ వర్భకో భవ దన్వయసంభవో న భవతి. కస్య నయనానన్దః? నిమిత్తేన కేన భవదధీనో జాతః? కథ్యతాం యాథాతథ్యేన త్వయే'తి. ప్రణతయా శబర్యా సలీల మలాపి: 'రాజః న్నాత్మపల్లీసమీపే పదవ్యాం వర్తమానస్య మిథిలేశ్వరస్య సర్వస్వ మపహరతి శబరసైన్యే, మద్దయితే నాపహృత్య కుమార ఏష మహ్య మర్పితో వ్యవర్ధత'. తదవధార్య కార్యజ్ఞో రాజా ముని కథితం తం ద్వితీయరాజకుమార మేవ నిశ్చిత్య, సామదానాభ్యాం తా మనునీయాప హారవర్మే త్యాఖ్యాయ, దేవ్యై వర్ధయేతి సమర్పితవాన్.

కదాచి ద్వామదేవశిష్య స్సోమశర్మనామా కంచి దేకం బాలకం రాజ్ఞః పురో నిక్షిప్యాభాషత: 'దేవ! రామతీర్థే స్నాత్వా ప్రత్యాగచ్ఛతా మయా కాననావనౌ వనితయా కయాపి ధార్యమాణ మేన ముజ్జ్వలాకారం కుమారం విలోక్య సాదర మభాణి. 'స్థవిరే!

---

ర్ణుడును అయిన బాలకుడు నీ వంశమున పుట్టినవాడు కాడు. కనుక ఇతడు ఎవనికి నేత్రానందమును గూర్చువాడు? ఏ కారణముచే నీ అధీనమందున్నాడు? ఉన్నదున్నట్లుగా చెప్పుదువు గాక." ప్రణామము చేసిన శబరి స్త్రీ చేత సవిలాసముగా నిట్లు పలుకబడెను—"ఓ రాజా! మా పల్లెకు సమీపమునందలి మార్గమున వర్తించుచుండిన మిథిలేశ్వరుని సర్వస్వమును శబరసైన్యము అపహరించుచుండగా, ఈకుమారుడు నా ప్రియునిచే నపహరింపబడి నాకర్పింపబడి నాచే పెంచబడెను." అది విని కార్యాకార్యము నెరిగిన రాజు వానిని మునిచే చెప్పబడిన రెండవ కుమారునిగ నిశ్చయించి, సామదానోపాయములచే ఆమెను ఒప్పించి, అపహారవర్మయని పేరిడి "పెంచుము" అని దేవికి సమర్పించెను.

ఒకానొకప్పుడు వామదేవ శిష్యుడయిన సోమదేవశర్మ యనువాడు ఒకానొక బాలకుని రాజుగారి యెదుట నిల్పి యిట్లు పలికెను—"దేవా! రామతీర్థమున స్నానము ముగించుకొని వెనుదిరిగి వచ్చుచు అరణ్యప్రదేశమున ఒకానొక వనితచే ఎత్తుకొనబడి యుండిన ఉజ్వలాకారుడైన కుమారుని చూచి సాదరముగ నే నిట్లంటిని— "ఓ ముదుసలిదానా! నీ వెవ్వతెవు? ఈ అరణ్య

కాత్వ? మేకస్మిన్నటవీమధ్యే బాలక ముద్వహన్తీ కిమర్థ మాయా సేన భ్రమసి'? ఇతి. వృద్ధయా ఉప్యభాషి :—

'మునివర! కాలయవననామ్ని ద్వీపే కాలగుప్తో నామ ధనాఢ్యో వైశ్యవరః కశ్చి దస్తి. తన్నన్దినీం నయనానన్దకారిణీం సువృత్తాం నామైతస్మా దాగతో మగధనాథమన్త్రిసంభవో రత్నోద్భవో నామ రమణీయగుణాలయో భ్రాన్తభూవలయో మనోహారీ వ్యవహారీ వ్యుప యమ్య, సువస్తుసంపదా శ్వశురేణ సమ్మానితో ఒభూత్. కాలక్రమేణ నతాఙ్గీ గర్భిణీ జాతా. తత స్సోదరవిలోకనకుతూహలేన రత్నోద్భవః కథంచి చ్ఛ్వశుర మనునీయ, చపలలోచనయా సహ ప్రవహణ మారుహ్య, పుష్పపుర మభిప్రతస్థే. కల్లోలమాలికాభిహతః పోతః సముద్రామ్భ స్యమజ్జత్. గర్భభరాలసాం తాం లలనాం ధాత్రీభావేన కల్పితాఒహం కరాభ్యా ముద్వహన్తీ, ఫలక మేక మధిరుహ్య దైవ

---

రణ్యమునందు బాలకుని ఎత్తికొని ఎందులకు ఆయాసముతో తిరుగుచుంటివి?" వృద్ధురాలిచే నిట్లు చెప్పబడెను—

"ఓ మునివరా! కాలయవనమను పేరుగల ద్వీపమున కాలగుప్తుడను ఒక ధనవంతుడైన వైశ్యుడు గలడు. నేత్రానందము గూర్చు సువృత్తయను ఆ వైశ్యుని పుత్రికను ఈ ద్వీపమునుండి వచ్చినవాడును, మగధరాజు మంత్రి కుమారుడును, రమణీయ సుగుణములకు నిలయమును, భూవలయమును చుట్టి వచ్చినవాడును, సుందరుడును, వ్యవహారము తెలిసినవాడును ఐన రత్నోద్భవుడను వాడు వివాహము చేసికొని, మామగారిచే అనేక వస్తుసంపదతో సమ్మానింపబడెను. కాలక్రమమున ఆ వనిత గర్భిణి యయ్యెను. తదుపరి సోదరులను చూడవలెనను కుతూహలముతో రత్నోద్భవుడు ఎట్లో మామగారిని అనునయించి అంగీకరింపజేసి, ఆ చపలాక్షితోపాటు ఓడనెక్కి పుష్పపురమునకు బయలుదేరెను, తరంగ సమూహములచే కొట్టబడిన ఓడ సముద్రపు నీటిలో మునిగిపోయెను. గర్భ భారముచే అలసిన యా స్త్రీని, దాదిగా కల్పింపబడిన నేను చేతులతో మోయుచు, ఒక ఫలకము నధిరోహించి, అదృష్టవశమున తీరభూమిని

గత్వా తీరభూమి మగమమ్. సుహృజ్జనపరివృతో రత్నోద్భవ స్తత్ర నిమగ్నో వా కేనోపాయేన తీర మగమ ద్వా న జానామి. క్లేశస్య పరాం కాష్ఠా మధిగతా సువృత్తా ఽస్మి న్నటవీమధ్యే సుత మసూత. ప్రసవవేదనయా విచేతనా సా ప్రచ్ఛాయశీతలే తరుతలే నివసతి. విజనే వనే స్థాతు మశక్యతయా జనపదగామినం మార్గ మన్వేష్టు ముద్యుక్తయా మయా వివశాయా స్తస్యా స్సమీపే బాలకం నిక్షిప్య గన్తు మనుచిత మితి కుమారోఽప్యనా' యీతి.

ఏతస్మి న్నేవ క్షణే వన్యో వారణః కశ్చి దదృశ్యత. తం విలోక్య భీతా సా బాలకం నిపాత్య ప్రాద్రవత్. అహం సమీప లతాగుల్మే ప్రవిశ్య పరీక్షమాణో ఽతిష్ఠమ్. నిపతితం బాలకం పల్లవకబళ మి వాదదతి గజపతౌ కణ్ఠీరవో మహాగ్రహేణ న్యపతత్. భయాకులేన దంతావశేన ఝటితి వియతి పాత్యమానో బాలకో నిపతన్

---

చేరితిని. స్నేహితుల సమూహముతో గూడిన రత్నోద్భవుడు అందే మునిగెనో, ఏ యుపాయము చేతనైనను తీరమును చేరుకొనెనో నాకు తెలియదు. క్లేశ పరాకాష్ఠను పొందిన సువృత్త (ఈ దినము) ఈ అరణ్య మధ్యమున కుమారుని గనెను. ప్రసవ వేదనచే చైతన్యము గోల్పోయిన యామె మిక్కిలి నీడ కల్గి చల్లనైన వృక్షమూలమున నివసించుచున్నది. జనులు లేని వన మధ్యమున నిల్చుట అశక్యమగుటచేత జన పదములకు బోవు మార్గమును వెదకుటకై యుద్యమించిన నేను వివశయయిన యామె సమీపమున బాలకుని ఉంచి వెళ్లుట అనుచితమని బాలకునిగూడ వెంట దెచ్చితిని".

అదే క్షణమున ఒక అడవి యేనుగు కనబడెను దానిని చూచి భయపడిన యామె బాలకుని పాఱవైచి పరుగెత్తెను. నేను సమీపమందలి లతాకుంజమున ప్రవేశించి పరీక్షించుచుంటిని క్రిందబడిన బాలుని చిగురుటాకుల గుత్తిని వలె ఏనుగు గ్రహించుచుండగా మహాక్రోధముతో ఒక సింహము దానిపై బడెను. భయమువలన వ్యాకులత జెందిన ఏనుగుచే తొందరగా ఆకాశములోని ఎగుర వేయబడిన యా బాలకుడు క్రిందబడుచుండగా, చిరాయువగుటచే సమీపము

చిరాయుష్మత్తయా ఉపసన్నోన్నతతరుశాఖాసమాసీనేన, వానరేణ కేనచి త్పక్వఫలమనీషయా పరిగృహ్య ఫలేతరతయా వితతస్కన్ధ మూలే నిక్షిప్తోఽభూత్. సోఽపి మర్కటః క్వచి దగాత్. బాలకేన సత్త్వ సంపన్నతయా సకలక్లేశసహే నాభావి. కేసరిణా కరిణం నిహత్య కుత్రచి దగామి. లతాగృహా న్నిర్గతో ఽహమపి తేజః పుఞ్జం బాలకం శనై స్తరో రవతార్య, వనాన్తరే వనితా మన్విష్యావిలోక్యైన మానీయ గురవే నివేద్య, తన్నిదేశా ద్భవన్నికట మానీతవా నస్మీతి— సర్వేషాం సుహృదా మేకదైవానుకూల్యదైవాభావేన మహదాశ్చర్యం బిభ్రాణో రాజా 'రత్నోద్భవః కథ మభవ' దితిచిన్తయన్, పుష్పోద్భవ నామధేయం విధాయ, తదుదన్తం వ్యాఖ్యాయ సుశ్రుతాయ విషాదసంతోషా వనుభవన్ త దనుజతనయం సమర్పితవాన్.

అన్యేద్యుః కంచన బాలక మురసి దధతీ వసుమతీ వల్లభ మభిగతా తేన కుత్రత్యోఽసా వితి పృష్టా సమభాషత "రాజ! న్నతీ

---

నందలి ఒక ఎత్తైన వృక్షముపై కూర్చున్న వానరముచేత పక్వఫలముగా భావింపబడి గ్రహింపబడి, పండుగాక పోవుటచే విస్తృత స్కంధ మూలమున నుంచబడెను. ఆ వానరముకూడ నెచటకో ఎగెను. బలసంపన్నత కారణముగా బాలకునిచేత ఆ కష్టములన్నియు సహింపబడెను. ఏనుగును చంపిన సింహము ఎచటికో పోయెను లతా గృహమునుండి బయటికి వచ్చిన నేను తేజః పుంజమైన బాలకుని చెట్టునుండి దింపి, అడవి మధ్యలో స్త్రీని వెదకి ఆమెను కానక ఇతనిని గురువగు వామదేవునకు సమర్పించి, వారి ఆజ్ఞానుసారము తమ సమీపమునకు గొని తెచ్చితిని." మిత్రులందరకు ఒకేసారి దైవానుకూల్యము లేక పోవుటచేత మిక్కిలి ఆశ్చర్యమును పొందిన మహారాజు "రత్నోద్భవు డెట్లాయెనో" యని చింతించుచు ఆతని కుమారునకు పుష్పోద్భవుఁడను పేరుపెట్టి, ఈ విషయమునంతయు విపులీకరించి, విషాద సంతోషముల ననుభవించుచు, సుశ్రుతునకు ఆతని తమ్ముని కొడుకును సమర్పించెను.

మరియొకనాడు ఒకానొక బాలుని వక్షఃస్థలమున ధరించిన వసుమతీదేవి ప్రియుని చేరి ఆతనిచేత "ఈతఁ డెచటివా"డని యడుగబడి, ఇట్లు సమాధాన

తాయాం రాత్రౌ కాచన దివ్యవనితా మత్పురతః కుమారక మేనం సంస్థాప్య నిద్రాముద్రితాం మాం విబోధ్య వనీతా ఽబ్రవీత్; 'దేవి ! త్వన్మన్త్రిణో ధర్మపాలనన్దనస్య కామపాలస్య వల్లభా యక్షకాంతా ఽహం తారావలీ నామ నన్దినీ మణిభద్రస్య. యక్షేశ్వరానుమత్యా మదాత్మజ మేనం భవత్తనుజ స్యామ్భోనిధివలయవేష్టిత క్షోణీమణ్డలేశ్వరస్య భావినో విశుద్ధయశోనిధే రాజవాహనస్య పరిచర్యాకారిణాయ నీతవత్యస్మి. అత్వ మేనం మనోజసన్నిభ మభివర్ధ'యేతి. విస్మయవికసితనయనయా మయా సవినయం సత్కృతా స్వకీ యక్షీ సాఽదృశ్యతా మయాసీ'' దితి.—కామపాలస్య యక్షకన్యాసఙ్గమే విస్మయమానమానసో రాజహంసో రఞ్జిత మిత్త్రం సుమిత్త్రి మాహూయ, తదీయభ్రాతృపుత్ర మర్థపాలం విధాయ, తస్మై సర్వం వార్తాదికం వ్యాఖ్యాయాదాత్.

---

మిచ్చెను—"రాజా ! కడచిన రాత్రి ఒకానొక దివ్యవనిత నా ముందు ఈ కుమారుని నిలిపి నిద్రలో మునిగిన నన్ను లేపి, వినయముతో "దేవి ! నీ మంత్రియగు ధర్మపాలునియొక్క కుమారుడగు కామపాలుని భార్యను. నేను యక్షకన్యను, మణిభద్రుని కుమార్తెను, తారావళియను దానను. యక్షరాజు ననుమతితో నా కుమారుడగు నితనిని చతుస్సముద్ర వలయిత భూమండలమునకు అధీశ్వరుడు కాబోవువాడును, పరిశుద్ధమైన కీర్తిసంపద గలవాడును, మీ కుమారుడును అగు రాజవాహనునకు పరిచర్యా నిమిత్తమై తీసికొని వచ్చితిని. నీవు మన్మథ సమానుడగు నితనిని పెంచుము" అని పలికి ఆశ్చర్యముచే వికసించిన నేత్రములు గల నాచేత సవినయముగా సత్కరింపబడి సుందరనేత్రయగు నా యక్ష కాంత అదృశ్యమయ్యెను." కామపాలునకు యక్షకన్యా సంగమము కల్గుట యందు ఆశ్చర్యపడుచున్న మనసుగల రాజహంసుడు రంజిత మిత్రుడైన మంత్రియగు సుమిత్రుని పిలిచి, ఆతని సోదరపుత్రుని అర్థపాల నామధేయునిగా నొనరించి, ఆతనికై సమస్త వార్తాదికమును వివరించి యప్పగించెను.

తతః పరస్మిన్ దివసే వామదేవాన్తేవాసీ తదాశ్రమవాసీ సమాసాదితదేవకీర్తిం నిర్భర్త్సితమారమూర్తిం కుసుమ సుకుమారం కుమార మేక మవగమయ్య నరపతి మవాదీత్; ''దేవ! తీర్థయాత్రా ప్రసఙ్గేన కావేరీతీర మాగతోఽహం విలోలాలకం బాలకం నిజోత్సఙ్గతలే నిధాయ రుదతీం స్థవిరా మేకాం విలోక్యావోచమ్:— 'స్థవిరే! కా త్వ? మయ మర్భకః కస్య నయనానన్దకరః? కాంతారం కిమర్థ మాగతా? శోక కారణం కి' మితి. సా కరయుగేన బాష్పజల మున్మృజ్య నిజశోకశల్యో త్పాటనక్షమ మివ మా మవలోక్య శోక హేతు మవోచత్.

''ద్విజాత్మజ! రాజహంసమన్త్రిణ స్సితవర్మణః కనీయా నాత్మజ స్సత్యవర్మా తీర్థయాత్రాభిలాషేణ దేశ మేన మగచ్ఛత్. స కస్మింశ్చి దగ్రహారే కాళీం నామైకస్య భూసురస్య నన్దినీం వివాహ్య,

---

అంతట మరుసటి దినమున వామదేవుని శిష్యుడగు ఆతని ఆశ్రమవాసి యొకడు ఆరాధింపబడిన దేవకీర్తి వంటి కీర్తిగలవాడును, అతిశయింపబడిన మన్మథుని స్వరూపము గలవాడును, పూవువలె మెత్తనివాడును అగు ఒక కుమారుని తెచ్చి రాజుతో పల్కెను—"దేవా! తీర్థయాత్రా ప్రసంగముచే కావేరీ తీరమును చేరిన నేను కదలాడు ముంగురులుగల బాలకుని తన యంక తలమున నుంచుకొని ఏడ్చు ఒక ముదుసలిదానిని చూచి యిట్లు పలికితిని— "ముదుసలిదానా! నీ వెవతెవు? ఈ చిన్నవాడు ఏ తండ్రికి ఆనందము నిచ్చువాడు? ఈ యడవికి ఎందులకు వచ్చితివి? దుఃఖించుటకు గల కారణమేమి?" అని. ఆమె కరయుగముచె కన్నీటిని తుడుచుకొని తన శోకశల్యమును పెకలించుటకు సమర్థుడగు వానివలెనున్న నన్ను చూచి దుఃఖకారణము నిట్లు చెప్పెను—

"ఓ బ్రాహ్మణకుమారా! రాజహంసుని అమాత్యుడగు సితవర్మయొక్క చిన్న కుమారుడైన సత్యవర్మ తీర్థయాత్రాభిలాషచే నీ దేశమునకు వచ్చెను. ఆతడు ఒకానొక యగ్రహారమున కాళియను పేరుగల ఒక బ్రాహ్మణ కన్యను వివాహమాడి, ఆమెయందు సంతానము కలుగనందువలన ఆమె చెల్లెలయిన

తస్యా అనపత్యతయా గౌరీం నామ తద్భగినీం కాఞ్చన కాంతాం పరిణీయ, తస్యా మేనం తనయ మలభత. కాళీ సాసూయ మేకదా ధాత్ర్యా మయా సహ బాల మేన మేకేన మిషేణాఽనీయ తటిన్యా మేతస్యా మక్షిపత్. కరే ణైకేన బాలక ముద్ధృత్యాపరేణ ప్లవమానా నదీవే గాగతస్య కస్య చి త్తరో శ్శాఖా మవలమ్బ్య తత్ర శిశుం నిధాయ నదీవేగే నోహ్యమానా కేనచి త్తరులగ్నేన కాలభోగినా ఽహ మదంశి మదవలమ్బీభూతో భూరుహో ఽయ మస్మిన్ దేశే తీర మగమత్. గరళ స్యోద్దీపనతయా మయి మృతాయా మరణ్యే కశ్చన శరణ్యో నా స్తీతి మయా శోచ్యత'' ఇతి.

తతో విషమవిషజ్వాలావలీఢావయవా సా ధరణీతలే న్యపతత్. దయావిష్టో ఽహం మ న్త్రబలేన విషవ్యథా మపనేతు మక్షమః, సమీపకుఞ్జే ష్వోషధివిశేష మన్విష్య ప్రత్యాగతో, వ్యుత్క్రా న్తజీవితాం తా మలోకయమ్. తదను తస్యాః పావక సంస్కారం రచయిత్వా,

---

గౌరి యను కాంతను వివాహమాడి ఆమెయందీ కుమారుని పొందెను. కాళి అసూయతో ఒకసారి ఒక మిషచేత దాదినైన నాతోపాటు ఈ బాలుని కొని వచ్చి ఈ నదిలో పడవైచెను. ఒక చేతితో బాలకుని ఎత్తిపట్టి, రెండవచేతితో ఈదుచు నదీ వేగమువలన కొట్టుకొని వచ్చిన తరుశాఖను పట్టుకొని, దానిపై శిశువునుంచి నదీవేగముచే మోయబడుచు, చెట్టునందు తగుల్కొన్న యొక కాల సర్పముచేత కరువబడితిని. నా కవలంబముగా నైన వృక్షము ఈ ప్రదేశమున తీరము చేరినది. విషపు తీవ్రతచే నేను అరణ్యమునందు చనిపోగా వీనికి రక్షకు డెవ్వడును ఉండడుగదా యని దుఃఖించితిని."

అనంతరము విషమ విష జ్వాలలచే ఆవరింపబడిన అవయవములు గల ఆ వనిత భూమిపై బడెను. జాలిగొన్న హృదయముగల నేను మంత్రబలముచే విష వ్యథను పోగొట్టుటకు అసమర్థుడనై చేరువనున్న పొదరిళ్ళలో ఓషధి విశేషమును వెదకి, మరలి వచ్చి యామె విగత ప్రాణయై యుండుట చూచితిని. పిమ్మట నామెకు అగ్ని సంస్కారముచేసి, దుఃఖముచే వ్యాకులితమైన మనస్సు

శోకాకులచేతా బాల మేన మగతి మాదాయ, సత్యవర్మవృత్తాన్తశ్రవణ
వేలాయాం తన్నివాసాగ్రహారనామధేయస్యాశ్రుతతయా తదన్వేషణ
మశక్య మి త్యాలోచ్య, భవదమాత్యతనయస్య భవానేవ రక్షితేతి
భవన్త మేన మనయ'' మితి—త న్నిశమ్య సత్యవర్మస్థితే స్సమ్య
గనిశ్చితతయా ఖిన్నమానసో నరపతిః సుమతయే మన్త్రిణే సోమ
దత్తం నామ తదనుజతనయ మర్పితవాన్. సోఽపి సోదర మాగత
మివ మన్యమానో విశేషేణ పుపోష.

ఏవం మిలితేన కుమారమణ్డలేన బాలకేళీ రనుభవ న్నధిరూఢా
నేకవాహనో రాజవాహనో ఽనుక్రమేణ చౌలోపనయనాదిసంస్కార
జాత మలభత. తత స్సకలలిపిజ్ఞానం, నిఖిల దేశభాషాపాణ్డిత్యం, షడ
ఙ్గసహితవేదసముదాయ కోవిదత్వం, కావ్య నాటకాఖ్యాన కాఖ్యాయికేతి
హాస చిత్రకథా సహిత పురాణగణనైపుణ్యం, ధర్మ శబ్ద జ్యోతి

---

గలవాడనై, గతిలేని బాలుని గైకొని సత్యవర్మ వృత్తాంతము విను సమయమున
ఆతని నివాసమగు అగ్రహారము పేరు వినబడకపోవుటచే ఆతనిని వెదకుట
అశక్యమని తలంచి మీ మంత్రి కుమారునకు మీరే రక్షకులని మీదరి కీతనిని
దెచ్చితిని". దానిని విని సత్యవర్మ స్థితి మిక్కిలి అనిశ్చితమగుటచే ఖిన్న
మనస్కుడైన రాజు మంత్రియైన సుమతికి సోమదత్తుడను పేరుగల ఆతని
తమ్ముని కుమారుని అప్పగించెను. ఆతడును తమ్ముడే వచ్చినటుల తలపోయుచు
ఆ బాలుని చక్కగ పోషించెను.

ఈ విధముగ కలిసిన కుమార సమూహముతో బాల్యక్రీడల ననుభ
వించుచు, అధిరోహింపబడిన అనేక వాహనములు గల రాజవాహనుడు క్రమాను
పారముగ చౌలోపనయనాది సంస్కార సమూహమును పొందెను. తదుపరి
సమస్త లిపి జ్ఞానమును, సమస్త దేశములందలి భాషలయందు పాండిత్యమును,
షడంగములతో కూడిన వేద సముదాయ విజ్ఞానమును, కావ్య. నాటక, ఆఖ్యాన,
ఆఖ్యాయికా, ఇతిహాస, చిత్రకథాదులతో కూడిన పురాణ సమూహము లందలి
నిపుణత్వమును, ధర్మ-శబ్ద-జ్యోతిష-తర్క-- మీమాంసాది సమస్త శాస్త్ర సము

స్తర్క-మీమాంసాది సమస్తశాస్త్రచాతుర్యం, కామన్దకీయాది నీతిపటల కౌశలం, వీణాద్యశేషవాద్యదాక్ష్యం, సంగీతసాహిత్యహారిత్వం, మణి మన్త్రౌషధాది మాయాప్రపఞ్చచఞ్చుత్వం, మాతఙ్గ తురంగాది వాహనా రోహణపాటవం, వివిధాయుధప్రయోగ చణత్వం, చౌర్య దురోదరాది కపటకలాప్రౌఢత్వం చ, తత్తదాచార్యేభ్య స్సమ్యగ్లబ్ధ్వా యౌవనేన విలసన్తం కృత్యేష్వనలసం తం కుమారనికరం నిరీక్ష్య మహీవల్లభ స్సోఽహం శత్రుజనదుర్జయ ఇతి పరమానన్ద మవిన్దత.

ఇతి శ్రీ మదాచార్యమహాకవిదణ్డినా విరచితే దశకుమారచరితే
పూర్వపీఠికాయాం కుమారోత్పత్తి ర్నామ
ప్రథమోచ్ఛ్వసః.

---

దాయమునందలి చాతుర్యమును, కామందకీయాదులగు నీతిశాస్త్ర సముదాయము నందలి కుశలత్వమును, వీణ మొదలగు సమస్త వాద్యము లందలి దక్షత్వమును, సంగీత, సాహిత్యములందలి హారిత్వమును, మణి-మంత్రౌషధాదులగు మాయా ప్రపంచ పరిజ్ఞానమును, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వాహనముల నెక్కుట యందలి పటుత్వమును, సమస్తములైన ఆయుధములను ప్రయోగించుట యందలి సామర్థ్యమును, చౌర్యము ద్యూతము మొదలగు కపట కళలందలి ప్రౌఢత్వమును, ఆయా ఆచార్యుల ద్వారా సంపూర్ణముగ బొంది, యౌవనముచే ప్రకాశించు కుమార సమూహమును చూచి, మహారాజు "నేను శత్రుజనములకు దుర్జయుడ"నని పరమానందము నందెను

ఇది శ్రీ మదాచార్య మహాకవి దండిచే విరచితమైన
దశకుమారచరిత మందలి పూర్వపీఠికయందు
కుమారోత్పత్తి యను ప్రథమోచ్ఛ్వాసము.

---

# దశకుమారచరితమ్

## ద్విజోపకృతి ర్నామ ద్వితీయోచ్ఛ్వాసః

అథైకదా వామదేవ స్సకలకలాకుశలేన కుసుమసాయక సమ్మితసౌన్దర్యేణ కల్పిత సోదర్యేణ సాహసాపహసిత కుమారేణ సుకుమారేణ జయధ్వజాతపవారణ కలశాఙ్కిత కరేణ కుమారనికరేణ పరివేష్టితం రాజాన మానతశిరసం సమభిగమ్య తేన కృతాం పరిచర్యా మంగీకృత్య నిజ చరణకమల యుగలమిల న్మధుకరాయమాన కాకపక్షం విదలిష మాణ విపక్షం కుమారచయం గాఢ మాలిఙ్గ్య మితసత్యవాక్యేన విహితాశీ రభ్యభాషత : "భూవల్లభ ! భవదీయం మనోరథఫల మివ సమృద్ధ లావణ్యం తారుణ్యం నుత మిత్త్రం భవత్పుత్త్రం ఽనుభవతి. సహచర సమేతస్య నూవ

---

# దశకుమారచరితము

## ద్విజోపకారము అను ద్వితీయోచ్ఛ్వాసము

అంతట నొక్కనాడు వామదేవుడు సకల కళలయందు కౌశలము గలిగి, మన్మథునిబోలు సౌందర్యము గలిగి, కల్పింపబడిన సోదర భావము గలిగి సాహసముచే పరిహసింపబడిన కుమారస్వామిగల, మృదువైన జయధ్వజ–ఛత్ర–కలశములచే చిహ్నితమైన హస్తములుగల కుమార సమూహముచే పరివేష్టింపబడి, వంగి నమస్కరించిన రాజునుచేరి, అతనిచే చేయబడిన పరిచర్య నంగీకరించి, తన పాదకమలముల జంటయందు తుమ్మెదల వలెనున్న ముంగురులు గలవారు, సంహరింపబడనున్న శత్రువులుగల వారునైన కుమార సమూహమును గాఢముగా ఆలింగన మొనర్చుకొని మితము సత్యమునగు వాక్యముతో విధింపబడిన ఆశీస్సులు గలవాడై యిట్లు పలికెను—"భూనాథా ! మీ మనోరథముల ఫలమాయన్నట్లున్న లావణ్యముగల, యౌవనమును పొగడదగిన మిత్రులుగల

మేతస్య దిగ్విజయారమ్భసమయ ఏషః. తదస్య సకలక్లేశసహస్య రాజవాహనస్య దిగ్విజయప్రయాణం క్రియతా' మితి. కుమారా మారాభి రామా రామాద్యపౌరుషా రుషా భస్మీకృతారయో రయోపహసితసమీరణా రణాభియానేన యానేన తేనాభ్యుదయాశంసం రాజాన మకార్షుః. తత్సాచివ్య మితరేషాం విధాయ సముచితాం బుద్ధి ముపదిశ్య శుభే ముహూర్తే సపరివారం కుమారం విజయాయ విససర్జ మహీపతిః.

రాజవాహనో మఙ్గళసూచకం శుభశకునం విలోకయన్ దేశం కంచి దతిక్రమ్య విన్ధ్యాటవీమధ్య మవిశత్. తత్ర హేతి హతికిణాఙ్కం కాలాయసకర్కశకాయం యజ్ఞోపవీతే నానుమేయవిప్రభావం వ్యక్తకిరాతప్రభావం లోచనపరుషం కమపి పురుషం దదర్శ. తేన విహితపూజనో రాజవాహనో ఒభ్యభాషత: ''నను మానవజనసఙ్గ

---

నీ పుత్రుడు అనుభవించుచున్నాడు. మిత్రసమేతుడగు నితని కిది నిశ్చయముగా దిగ్విజయారంభ సమయము. కనుక సమస్త క్లేశములను సహించగల రాజ వాహనునకు దిగ్విజయ ప్రయాణము నేర్పాటు చేయబడుగాక". మన్మథునివలె సుందరులు, రామాదుల పౌరుషముగలవారు, క్రోధముచే భస్మీపటలమొనర్ప బడిన శత్రువులు గలవారు, వేగముచే పరిహసింపబడిన వాయువు గలవారును ఐన యీ కుమారులు యుద్ధ ప్రయాణమువంటి నడకతో రాజును అభ్యుదయ వాదిగా నొనర్చిరి. ఇతరులకు రాజవాహన మంత్రిత్వము విధించి, సమయోచిత బుద్ధిని ఉపదేశించి మహారాజు శుభముహూర్తమున విజయసిద్ధికై సపరివారుడైన కుమారుని పంపెను.

రాజవాహనుడు మంగళసూచకమగు శుభశకునమును కనుంగొనుచు ఒకా నొక దేశమునుదాటి వింధ్యారణ్య మధ్యభాగమును ప్రవేశించెను. అచట ఆయుధ ప్రహరణముల గాయముల చిహ్నము గల్గి ఇనుమువలె నతి కర్కశమగు శరీరము గలిగి, యజ్ఞోపవీతధారణముచే ఊహింపదగిన విప్రభావము, వ్యక్తమైన కిరాతభావము గలిగి, కంటికి కఠోరముగా కన్పించు ఒకానొక పురుషుని జూచెను. ఆతనిచే ఆచరింపబడిన పూజలుగల రాజవాహనుడు ఇట్లు పలికెను. "మానవజన సంపర్కములేక, మృగములకు హితమును గూర్చు భయంకర

రహితే మృగహితే ఘోర ప్రచారే కాంతారే వింధ్యాటవీమధ్యే భవా నేకాకీ కిమితి నివసతి ? భవదంసోపనీతం యజ్ఞోపవీతం భూసుర భావం ద్యోతయతి; హేతిహతిభిః కిరాతరీతి రనుమీయతే; కథయ కిమేత' దితి. తేజోమయో ఒయం న మానుషమాత్రపౌరుషో నూనం భవతీతి మత్వా స పురుష స్తద్వయస్యముఖా న్నామజననే విజ్ఞాయ తస్మై నిజవృత్తాంత మకథయత్.—

"రాజనన్దన ! కేచి దస్యా మటవ్యాం వేదాదివిద్యాభ్యాస మప హాయ నిజకులాచారం దూరీకృత్య సత్యశౌచాదిధర్మవ్రతం పరిత్యజ్య కిల్బిష మన్విష్యంతః పుళిన్దపురోగమా స్తదన్న ముపభుఞ్జానా బహవో బ్రాహ్మణబ్రువా నివసంతి. తేషు కస్యచిత్పుత్రో నిందాపాత్రచారిత్రో మాతఙ్గనామాఒహమ్. స చ కిరాతజాలేన జనపదం ప్రవిశ్య గ్రామేషు ధనినః స్త్రీబాలసహితా నానీయ బన్ధనే నిధాయ తేషాం సకలధన మప

---

సంచారముగల యటవియందు వింధ్యారణ్య మధ్యభాగమున ఏకాకివై నీ వెందుకు నివసించుచున్నావోకదా ? నీ భుజముపైనున్న యజ్ఞోపవీతము బ్రాహ్మణత్వ మును సూచించుచున్నది శస్త్రఘాతములచే కిరాతరీతి ఊహింపనగుచున్నది. చెప్పుము ఇది యేమి ?" తేజోనిధియగు నీతడు నిశ్చయముగా మానుషమాత్ర పౌరుషము కలవాడు కాడని తలచి, యా పురుషుడు ఆతని మిత్రుని వలన పేరు పుట్టుకల నెఱింగి, ఆతనికి తన వృత్తాంతము నిట్లు చెప్పెను.

"రాజకుమారా ! ఈ యడవిలో (కొందరు) వేదాది విద్యల నభ్యసించుట మాని తమ కులాచారములను దూరపరచి, సత్య శౌచాది ధర్మవ్రతమును విడచి పుచ్చి, పాపము నన్వేషించుచు బోయవారి ననుసరించుచు, వారి తిండి తినుచు బ్రాహ్మణబ్రువు లెందరో నివసించు చున్నారు. వారిలో ఒకానొకని కుమారుడను, నిందాపాత్ర చరిత్రుడను నేను మాతంగుడను పేరు గలవాడను. అట్టి నేను కిరాతబలముతోపాటు జనపదమును ప్రవేశించి గ్రామములందలి స్త్రీ బాలవృద్ధ సహితులైన ధనికులను తీసికొనివచ్చి, బంధనము నందుంచి వారి సమస్త ధనము లను అపహరించి మదించి దయలేని వాడనై చరించితిని. ఒకానొకప్పుడు ఒక

హరన్నుద్ధృత్య పీతదయో వ్యచరమ్. కదాచి దేకస్మి న్కాంతారే మదీయసహచరగణేన జిఘాంస్యమానం భూసుర మేక మవలోక్య దయాయత్తచిత్తో ఽవోచమ్ : 'నను పాపా! న హంతవ్యో బ్రాహ్మణ' ఇతి. తే రోషారుణనయనా మాం బహుధా నిరభర్త్సయన్. తేషాం భాషణపారుష్య మసహిష్ణు రహ మవనీసురరక్షణాయ చిరం ప్రయుధ్య తై రభిహతో గతజీవితో ఽభవమ్.

తతః ప్రేతపురీ ముపేత్య తత్ర దేహధారిభిః పురుషై పరివేష్టితం సభామధ్యే రత్నఖచితసింహాసనాసీనం శమనం విలోక్య తస్మై దణ్డప్రణామ మకరవమ్. సోఽపి మా మవేక్ష్య చిత్రగుప్తం నామ నిజామాత్య మాహూయ త మవోచత్: ''సచివ! నైషోఽ ముష్య మృత్యుసమయః. నిన్దితచరితోఽప్యయం మహీసురనిమిత్తం గతజీవితోఽభూత్. ఇతః ప్రభృతి విగళితకల్మషస్యాస్య పుణ్యకర్మ

---

అరణ్యమునందు నామిత్ర సమూహముచే చంపబడనున్న ఒక బ్రాహ్మణుని చూచి దయాయత్తచిత్తుడనై "ఓ పాపులారా ! బ్రాహ్మణుడు చంపదగినవాడు కాడు" అని పలికితిని. క్రోధముచే నెఱ్ఱబాఱిన కన్నులు గలవారై వారు నన్ను ఎన్నియో విధముల భయపెట్టిరి. వారి మాటల కఠోరతను సహింపజాలని నేను బ్రాహ్మణ రక్షణ కొఱకు చాలసేపు యుద్ధమొనర్చి, వారిచే కొట్టబడి ప్రాణములు గోల్పోతిని.

అనంతరము యమలోకమును జేరి సభామధ్యమునందు దేహధారులైన పురుషులచే పరివేష్ఠింపబడి రత్నఖచిత సింహాసము నధిరోహించిన యముని చూచి అతనికి దండ ప్రణామ మొనర్చితిని. అతడును నన్నుచూచి చిత్రగుప్తుడను పేరు గల తన మంత్రిని పిలిచి, అతనితో నిట్లు పలికెను—"అమాత్యా! ఇది యీతనికి మృత్యు సమయము కాదు. ఇతడు నిందిత చరిత్రుడైనను బ్రాహ్మణ నిమిత్తముగా గత జీవితుడయ్యెను. ఇకనుండి నశించిన పాపముగల యీతనికి పుణ్యకర్మాచరణమునందు ఆసక్తి పుట్టగలదు. నరకమున పాపిష్ఠులచే

కరణే రుచి రుదేష్యతి. పాపిష్ఠై రనుభూయమాన మత్ర యాతనా విశేషం విలోక్య పునరపి పూర్వశరీర మనేన గమ్యతా'' మితి. చిత్రగుప్తోఽపి తత్ర తత్ర సంతప్తే ష్వయ స్తమ్భేషు బధ్యమానా నత్యుష్ణీకృతే వితత శరావతై లే క్షిప్యమాణాన్ లగుడై ర్జర్జరీకృతావయవాన్ నిశితటఙ్కైః పరితక్ష్యమాణా నపి దర్శయిత్వా పుణ్యబుద్ధి ముపదిశ్య మా మముఞ్చత్.

తదేవ పూర్వశరీర మహం ప్రాప్తో మహాటవీమధ్యే శీతలోపచారం రచయిత్వా మహీసురేణ పరీక్ష్యమాణ శ్శిలాయాం శయితః క్షణ మతిష్ఠమ్. తదను విదితోదన్తో మదీయబన్ధుగణస్సహసా సమాగత్య మన్దిరం మానీయ మా మపక్రాన్తవ్రణ మకరోత్. ద్విజన్మా కృతజ్ఞో మహ్య మక్షరశిక్షాం విధాయ వివిధాగమతన్త్రం మాఖ్యాయ, కల్మష క్షయకారణం సదాచార ముపదిశ్య, జ్ఞానేక్షణగమ్యమానస్య శశిఖణ్డ శేఖరస్య పూజావిధాన మభిధాయ, పూజాం మత్కృతా మఙ్గీకృత్య,

---

అనుభవింపబడు యాతనా విశేషమును చూచి మరల నీతడు పూర్వశరీరమునే పొందుగాక " చిత్రగుప్తుడును అచ్చటచ్చట కాలిన అయస్స్తంభములందు బంధింపబడు చున్నవారిని, మిక్కిలి మరగకాగిన తైల శరావములందు బడద్రోయ బడుచున్నవారిని దండములచే మోదబడు అవయవములు గలవారిని, వాడియైన రంపములచే కోయబడుచున్నవారిని కూడ చూపించి, పుణ్యబుద్ధి నుపదేశించి నన్ను వదలి పెట్టెను.

నేనా పూర్వ శరీరమునే పొంది మహారణ్య మధ్య భాగమున శైత్యోపచారము గావించి బ్రాహ్మణునిచే రక్షింపబడుచున్నవాడనై, శిలపై శయనించి క్షణము ఉంటిని తదుపరి ఈ ఉదంతము తెలిసి నా బంధు సమూహాము వెంటనే వచ్చి, గృహమునకు గొనితెచ్చి నన్ను నశించిన వ్రణముగల వానినిగా జేసెను. కృతజ్ఞుడైన బ్రాహ్మణుడు నాకు అక్షర జ్ఞానమును గలిగించి, సమస్త శాస్త్ర తంత్రమును చెప్పి, పాపములను నశింపజేయు సదాచారమును బోధించి, విజ్ఞాన నేత్రములచే పొందదగినవాడును, అర్ధచంద్రుని శిరమున ధరించినవాడును, ఐన శంకరుని పూజా విధానమును తెలియజెప్పి నాచే చేయబడిన పూజను అంగీక

నిరగాత్. తదారభ్యాహం కిరాతకృతసంసర్గం బంధుకుల ముత్సృజ్య, సకల లోకైకగురు మిందుకలావతంసం చేతసి స్మర, న్నస్మి న్కాననే దూరీకృతకలజ్కో వసామి. దేవ ! భవతే విజ్ఞాపనీయం రహస్యం కించి దస్త్యాగమ్యతామ్.—

ఇతి స చ వయస్యగణా దపనీయ రహసి పున రేన మభాషత ''రాజ ! న్నతీతే నిశాన్తే గౌరీపతి స్స్వప్నసన్నిహితో నిద్రాముద్రిత లోచనం విబోధ్య ప్రసన్న వదనకాన్తిః ప్రశ్రయావనతం మా మవోచత్ : 'మాతఙ్గ ! దండకారణ్యాన్తరాల గామిన్యా స్తటిన్యా స్తీర భూమౌ సిద్ధసాధ్యారాధ్య మానస్య స్ఫటికలిఙ్గస్య పశ్చా దద్రిపతి కన్యాపదపఙ్తిచిహ్నిత స్యాశ్మన స్సన్నిధౌ విధే రానన మివ బిలం విద్యతే. తత్ర నిక్షిప్తం తామ్ర శాసనం విధాతు రివ శాసనం సమాదాయ విధిం తదుపదిష్టం దిష్టవిజయ మివ విధాయ పాతాళలోకా

---

రించి వెడలిపోయెను. అది మొదలు బోయజాతి సంబంధముగల బంధుజాలమును విడచి నిఖిల లోకములకు గురువు చంద్రకళాభరణుడును అగు పరమ శివుని చిత్తమున స్మరించుచు ఈ యరణ్యమునందు దూరీకృత పాపుడనై నివసించుచున్నాను. దేవా : మీకు విజ్ఞాపన జేయవలసిన రహస్యము కొంత గలదు. ఇటు రండి".

ఆ మాతంగుడును మిత్రసమూహమునుండి యెడముగా గొనివచ్చి రహస్యముగా నాతనితో మరల నిట్లు పలికెను. "రాజా ! గడచిన రాత్రి తెల్లవారు జామున ప్రసన్నమైన ముఖవర్చస్సుగల పార్వతీపతి స్వప్నమున సాక్షాత్కరించి, నిద్రలో మూసిన కనులు గల్గిన నన్ను మేల్కొలిపి వినయావనతుడనైన నాతో ఇట్లనెను—"మాతంగా ! దండకారణ్య మధ్య భాగమున ప్రవహించు నదీ తీర భూమియందు సిద్ధ సాధ్యులచే ఆరాధింపబడు స్ఫటిక లింగమునకు వెనుక పార్వతీదేవి పాదపంక్తులచే చిహ్నితమైన రాతి సమీపమున బ్రహ్మదేవుని ముఖమువలె నొక రంధ్రము గలదు. అచట నిక్షిప్తమైన తామ్రశాసనమును బ్రహ్మదేవుని ఆజ్ఞవలె గ్రహించి దానియందు నిర్దేశింపబడిన విధానమును

ధీశ్వరేణ భవతా భవితవ్యమ్. భవత్సాహాయ్యకరో రాజకు
మారో ఒద్య శ్వో వా సమాగమిష్య'తీతి. తదాదేశానుగుణమేవ
భగవదాగమన మభూత్. సాధనాభిలాషిణో మమ తోషిణో
రచయ సాహాయ్య'' మితి.—తథే త్యుక్త్వా రాజవాహనో సాకం
మాతఙ్గేన నమితోత్తమాఙ్గేన విహాయార్ధరాత్రే నిద్రాపరతన్త్రం మిత్త్ర
గణం వనాంతర మవాప.

తదను తదనుచరా స్సాకల్యేన రాజకుమార మనవ లోక
యంతో విషణ్ణహృదయా స్తేషు వనేషు సమ్య గన్విష్యానవేక్షమాణా
ఏతదన్వేషణమనీషయా దేశాన్తరం చరిష్ణవో నిశ్చితపునస్సఙ్గమ
సంకేతస్థానాః పరస్పరం వియుజ్య యయుః.

లోకైకవీరేణ రక్ష్యమాణ స్సంతుష్టాన్తరంగో మాతఙ్గోఽపి
బిలం శశిశేఖరకథితాభిజ్ఞానపరిజ్ఞాతం నిశ్శఙ్కం ప్రవిశ్య, గృహీత

---

అదృష్ట విజయమువలె భావించి నీవు పాతాళ లోకమునకు అధీశ్వరుడవు గావల
యును. మీకు సహాయ మొనర్చు రాజకుమారుడు నేడో రేపో రాగలడు."
ఆ పరమ శివుని ఆజ్ఞాను గుణముగనే మీ రాక సంభవించినది. సాధనము లభిల
షించుచు, సంతోషించుచున్న నాకు సహాయము చేయుము." రాజవాహను డట్లే
యని పలికి యర్ధరాత్రమున నిద్రాసక్తమయిన మిత్రసమూహమును వదలి
నతమ స్తకుడైన మాతంగునితో కలిసి వేఱొక యరణ్యమునకు బోయెను.

పిమ్మట నాతని అనుచరులందరును రాజకుమారుని గానక దుఃఖావిష్ట
హృదయులై అడవులలో బాగుగ వెదకియు కాననివారై యాతనిని అన్వేషించు
తలంపుతో దేశాంతరముల సంచరింప దలంచి నిశ్చయింపబడిన పునస్సమాగమ
సంకేతస్థానము గలవారై పరస్పరము విడివడి వెడలిపోయిరి.

లోకైక వీరుడగు రాజవాహనునిచే రక్షింపబడుచు సంతుష్టాంత రంగు
డగు మాతంగుడును చంద్రశేఖరునిచే చెప్పబడిన గుర్తులవలన తెలిసికొనబడిన
బిలమును నిశ్శంకముగా ప్రవేశించి, గ్రహింపబడిన తామ్రశాసనము గలవాడై , ఆ

తామ్రశాసనో, రసాతలం పథా తేనైవోపేత్య, తత్ర కస్యచి త్పట్టణస్య నికటే కేళీకాననకాసారస్య వితతసారసస్య సమీపే నానావిధేన శాసనవిధానోపపాదితేన హవిషా హోమం విధాయ, ప్రత్యూహపరిహారిణి సవిస్మయం విలోకయతి రాజవాహనే, సమిదాజ్యసముజ్జ్వలితే జ్వలనే పుణ్యగేహం దేహం మన్త్రపూర్వక మాహుతీకృత్య, తటిత్సమానకాన్తిం దివ్యాం తను మలభత.

తదను మణిమయ మణ్డనమణ్డలమణ్డితా సకలలోకలలనా కులలలామభూతా కన్యకా కాచన వినీతానేక సఖీజనానుగమ్యమానా కలహంసగత్యా శనై రాగత్యావనిసురోత్తమాయ మణి మేక ముజ్జ్వలాకార ముపాయనీకృత్య, తేన 'కా త్వం?' మితి పృష్టా సోత్కణ్ఠా కలకణస్వనేన మన్దమన్ద ముదఞ్జలి రభాషత: ''భూసురోత్తమ! అహ మసురోత్తమనన్దినీ కాళిన్దీ నామ; మమ పితాఽస్య లోకస్య శాసితా మహాను

---

మార్గముననే రసాతలమును చేరి అచ్చట ఒకానొక పట్టణ సమీపమున, శాసనము నందలి విధానముచే ప్రతిపాదింపబడిన నానావిధమైన హవిస్సుచేత హోమము చేసి, విఘ్నములను పరిహరించు రాజవాహనుడు సవిస్మయముగ చూచుచుండ, సమిధలచేతను, నేతి చేతను ప్రజ్వరిల్లిన అగ్నిహోత్రమునందు పుణ్యములకు పుట్టినిల్లగు తన దేహమును మంత్రపూర్వకముగా ఆహుతినొసంగి విద్యుత్సమాన ప్రకాశముగల దివ్య తనువును పొందెను.

తదనంతరము మణిమయములైన భూషణ గణముచే అలంకరింపబడినదియు, సమస్త స్త్రీ లోకమునకు శిరోమణియైనదియు, వినయవతులగు అనేక సఖీజనముచే అనుసరించబడినదియునగు ఒక కన్యక కలహంస గమనముతో మెల్లగావచ్చి బ్రాహ్మణోత్తముడగు మాతంగునకు ఉజ్జ్వలాకారముగల ఒక మణిని కానుకగా నిచ్చి ఆతనిచే "నీ వెవతెవు?" అని యడుగబడి, ఉత్కంఠ గలదియై అంజలి ఘటించి, కలకంఠ స్వనముతో మెలమెల్లగా నిట్లు పలికెను— "బ్రాహ్మణోత్తమా! నేను ఒక రాక్షసోత్తముని కూతురను, కాళిందియను దానను. ఈ లోకమున కధిపతియైన మహానుభావుడగు నా తండ్రి పరాభవింప

ఖావో నిజపరాక్రమా సహిష్ణునా విష్ణునా మారీకృతామరే సమరే యమ
నగరా తిథిరకారి. తద్వియోగశోకసాగరమగ్నాం మామవేక్ష్య కోఽపి
కారుణిక స్సిద్ధతాపసోఽభాషత : 'బాలే ! కశ్చి ద్దివ్యదేహధారీ మానవో
నవో వల్లభ స్తవ భూత్వా సకలరసాతలం పాలయిష్య'తీతి. తదా
దేశం నిశమ్య, ఘనోన్ముఖీ చాతకీ వర్షాగమన మివ తవాఽలోకన
కాఙ్క్షిణీ చిర మతిష్ఠమ్. మన్మనోరథ ఫలాయమానం భవదాగమన
మవగమ్య, మద్రాజ్యావలమ్బనభూతామాత్యానుమత్యా మదనకృత
సారథ్యేన మనసా భవన్త మాగచ్ఛమ్. లోకస్యాస్య రాజ్యలక్ష్మీ
మంగీకృత్య మాం తత్సపత్నీం కరోతు భవా'' నితి. మాతఙ్గోఽపి
రాజవాహనానుమత్యా తాం తరుణీం పరిణీయ దివ్యాఙ్గనాలాభేన హృష్ట
తరో రసాతలరాజ్య మురరీకృత్య పరమానన్ద మాససాద.

---

బడిన యమరులుగల సమరమున తన పరాక్రమము సహింపని విష్ణువుచే
యమనగరమునకు అతిథిగా చేయబడెను.

ఆతని వియోగ దుఃఖమనెడు సముద్రమున మునిగిన నన్ను జూచి
ఎవడో ఒక దయగల సిద్ధ తాపసుడు—"బాలా ! ఒకానొక దివ్య దేహమును
ధరించిన క్రొత్త మానవుడు నీకు భర్తయై సమస్త రసాతలము పరిపాలింప
గలడు" అని పలికెను. ఆయన ఆజ్ఞను విని, మేఘములకై ఎదురుచూచు
చాతకపక్షి వర్షాగమమునువలె నిన్ను జూచు కోరిక గలదాననై చిరకాలముంటిని.
నా కోరికలకు ఫలము వంటిదైన నీ యాగమనమును తెలిసికొని, నా రాజ్యము
నకు అవలంబకులైన అమాత్యుల యనుమతితో, మన్మథ సారథ్యముగల
మనస్సుతో మిమ్ము చేరితిని. ఈ లోకపు రాజ్యలక్ష్మిని నీవు అంగీకరించి నన్ను
దానికి సవతినిగా జేయుదువుగాక". మాతంగుడును రాజవాహనుని అనుమతితో ఆ
తరుణిని పరిణయమాడి, దివ్య స్త్రీ లాభముచే మిక్కిలి సంతసించినవాడై
రసాతల రాజ్యము నంగీకరించి పరమానందము నందెను.

వఞ్చయిత్వా వయస్యగణం సమాగతో రాజవాహన స్తదవలోకన కౌతూహలేన భువం గమిష్ణుః కాళిన్దీద త్తం క్షుత్పిపాసాదిక్లేశనాశనం మణిం సాహాయ్యకరణసంతుష్టా న్మాతఙ్గాల్లబ్ధ్వా, కంచ నాధ్వాన మను వ ర్తమానం తం విసృజ్య, బిలపథేన నిర్యయౌ. తత్ర మిత్త్రగణ మనవలోక్య భువం బభ్రామ. భ్రమంశ్చ విశాలోపశల్యే కమప్యా క్రీడ మాసాద్య విశిశ్రమిషు, రాందోళికారూఢం రమణీసహిత మా ప్త జనపరివృత ముద్యానే సమాగత మేకం పురుష మపశ్యత్. సోఽపి పరమానన్దేన పల్లవితచేతా వికసితవదనారవిందో 'మమ స్వామీ సోమ కులావతంసో విశుద్ధయశోనిధీ రాజవాహన ఏషః; మహాభాగ్యతయాఽ కాండ ఏవాస్య పాదమూలం గత వానస్మి; సంప్రతి మహా న్నయనో త్సవో జాతః' ఇతి ససంభ్రమ మాందోళికాయా అవతీర్య, సరభస పదవిన్యాస విలాస హర్షోత్కర్ష భరితః, త్రిచతుఃపదా న్యుద్గత్య, తస్య చరణకమల యుగళం గళదుల్లసన్మల్లికావలయేన మౌళినా

---

మిత్ర సమూహమును వంచించి వచ్చిన రాజవాహనుడు వారిని చూడవలె నను కుతూహలముతో భూలోకమునకు పోగోరినవాడై సాహాయ్యముచే సంతుష్టుడైన మాతంగుని వలన ఆకలి దప్పి మొదలగు క్లేశములను నశింపజేయగల కాళిందీ ద త్తమైన మణిని పొంది, కొంతదూరము అనుసరించి వచ్చిన మాతంగుని వెనుకకు పంపి, బిలమార్గమున బయటికి వచ్చెను. అచ్చట మిత్రగణమును గాంచక లోకమున తిరిగెను అట్లు తిరుగుచు విశాల గ్రామసీమ యందలి ఉద్యానవనమును జేరి విశ్రమింపగోరినవాడై, రమణీ సహితుడు, బంధుజన పరి వృతుడునై పల్లకి నెక్కి ఉద్యానవనమున ప్రవేశించిన ఒక పురుషుని చూచెను. ఆతడును పరమానందముతో చిగురించిన చి త్తము గలవాడై, వికసించిన ముఖ కమలము గలవాడై "ఇతడు చంద్రవంశమునకు ఆభరణము, పరిశుద్ధ కీ ర్తినిధి యైన నాస్వామి రాజవాహనుడు. గొప్ప భాగ్యవశముచేత కారణము లేకయే ఇతని పాదమూలమును జేరితిని. ఇప్పుడు నా కన్నుల పండుగైనది" అని తొందరగా పల్లకినుండి దిగి, తడబడు పాద న్యాసముల విలాసముచే, హర్షో త్కర్షముచే నిండినవాడై, మూడు నాలుగడుగులు నడచి, జారుచున్న విక

పస్పర్శ. ప్రమోదాశ్రుపూర్ణో రాజా పులకితాఙ్గం తం గాఢ మాలిఙ్గ్య 'అయే! సౌమ్య సోమదత్త!' ఇతి వ్యాజహార.

తతః కస్యాపి పున్నాగభూరుహస్య ప్రచ్ఛాయశీతలే తలే సంవిష్టేన మనుజనాథేన సప్రణయ మభాణి: 'సఖే! కాలమేతావన్తం, దేశే కస్మిన్, ప్రకారేణ కేన అస్థాయి? భవతా సంప్రతి కుత్ర గమ్యతే? తరుణీ కేయమ్? ఏష పరిజన స్సంపాదితః కథం? కథ' యేతి. సోఽపి మిత్రసందర్శనవ్యతికరాపగతచింతాజ్వరాతిశయో ముకుళితకరకమల స్సవినయ మాత్మీయప్రచార ప్రకార మవోచత్.

ఇతి శ్రీ మదాచార్య మహాకవిదణ్డినః కృతౌ దశకుమారచరితే
పూర్వపీఠికాయాం ద్విజోపకృతి ర్నామ
ద్వితీయోచ్ఛ్వాసః.

---

సించిన మల్లెపూలమాల గల శిరముతో ఆతని పాదపద్మయుగళమును స్పృశించెను. ఆనంద బాష్పములతో నిండిన రాజు పులకిత శరీరుడైన యాతనిని గాఢముగ కౌగలించుకొని "ఓయీ! సౌమ్య? సోమదత్తా!" యని పలికెను.

తరువాత ఒక పున్నాగ వృక్షపు నీడగల చల్లని ప్రదేశమునందు కూర్చుండిన మహారాజు ప్రేమ పూర్వకముగా నిట్లు పలికెను—"మిత్రమా! ఇంత కాలము నీవు ఏ దేశమునందు ఏ విధముగ నుంటివి? ఇప్పుడెచ్చటికి వెళ్ళుచుంటివి? ఈ తరుణి యెవ్వరు? ఈ దాస జనము నెట్లు సంపాదించితివి? చెప్పుము". వాడును మిత్రుని దర్శించుటచేత నశించిన చింతా జ్వరాతిశయము గలవాడై అంజలి ఘటించి సవినయముగ తన సంచార విధానమును చెప్పెను.

ఇది శ్రీ మదాచార్య మహాకవి దండి కృతియైన
దశకుమారచరిత మందలి పూర్వపీఠికయందు
ద్విజోపకృతి యను ద్వితీయోచ్ఛ్వాసము.

# దశకుమారచరితమ్

## సోమదత్తచరితం నామ తృతీయోచ్ఛ్వాసః

దేవ ! భవచ్చరణకమల సేవాభిలాషీభూతో ఽహం భ్రమన్నేకస్యాం వనావనౌ పిపాసాకులో లతాపరివృతశీతల నదసలిలం పిబన్, ఉజ్జ్వలాకారం రత్నం తత్రైక మద్రాక్షమ్. త దాదాయ, గత్వా చ, కంచనాధ్వాన మతిక్రమ్య, అమ్బరమణే రత్యుష్ణతయా గంతు మక్షమో, వనేఽస్మి న్నేవ కిమపి దేవాయతనం ప్రవిష్టో, దీనాననం బహుతనయసమేతం స్థవిరం మహీసుర మేక మవలోక్య, కుశల ముదితదయో ఽహ మపృచ్ఛమ్. కార్పణ్యావివర్ణ వదనో మహాశాపూర్ణ మానసో ఽవోచ దగ్రజన్మా "మహాభాగ ! సుతా నేతా న్మాతృహీనాననే కై రుపాయై రక్షన్, ఇదానీ మస్మిన్ కుదేశే భైక్షం సంపాద్య

---

# దశకుమారచరితము

## సోమదత్త చరిత్రము అను తృతీయోచ్ఛ్వాసము

దేవా ! మీ పాదపద్మ సేవను అభిలషించు నేను ఒకానొక వన ప్రదేశమున సంచరించుచు దప్పికగొని లతలచే కప్పబడిన చల్లని నదముల జలమును త్రావుచు, అచట ప్రకాశించు ఆకారముగల ఒక రత్నమును కనుగొంటిని. దానిని గైకొని బయలుదేరి, కొంత మార్గమును గడచి, సూర్యుని వేడి ఎక్కువగుటచే నడుచుట కశక్తుడనై ఈ వనమునందలి ఒక దేవాలయము ప్రవేశించి దీనవదనుడు బహుపుత్ర సమేతుడునగు ఒకముదుసలి బ్రాహ్మణుని చూచి, దయపుట్టి కుశల మడిగితిని. కృపణత్వముచే వివర్ణమైన ముఖము గల్గి గొప్ప ఆశతో నిండిన మనసు గలవాడై బ్రాహ్మణుడిట్లు పలికెను—"మహానుభావా ! మాతృహీనులైన ఈ కుమారులను పెక్కు ఉపాయములతో రక్షించుచు, ఇప్పుడీ పాడు

దవ దేతేభ్యో, వసామి శివాలయేఽస్మి' న్నితి. 'భూదేవ ! ఏతి త్కటకాధిపతీ రాజా కస్య దేశస్య ? కిన్నామధేయః ? కి మ త్రాగమనకారణ మస్య ?' ఇతి పృష్టోఽభాషత మహీసురః.

సౌమ్య ! మ త్తకాలో నామ లాటేశ్వరో దేశస్యాస్య పాల యితు ర్వీరకేతో స్తనయాం వామలోచనాం నామ తరుణీరత్న మస మానలావణ్యాం శ్రావం శ్రావ మవధూతదుహితృప్రార్థనస్య తస్య పాటలీంనామ్నా నగరీ మరౌత్సీత్. వీరకేతు రపి భీతో మహోపా యన మివ తనయాం మ త్తకాలాయాదాత్. తరుణీలాభహృష్టచేతా లాటపతిః 'పరిణేయా నిజపుర ఏ'వేతి నిశ్చిత్య, గచ్ఛన్నిజదేశం ప్రతి, మృగయాదరేణాత్ర వనే సైన్యవాస మకారయత్. కన్యాసారేణ నియుక్తో మానపాలో నామ వీరకేతుమ న్త్రీ మానధన శ్చతురఙ్గబల సమన్వితో ఽన్యత్ర రచితశిబిర స్తన్నిజనాథావమానఖిన్న మానసోఽ న్తర్భిభే''దేతి.

---

దేశమునందు భిక్షమును సంపాదించి వీరికి పెట్టుచు ఈ శివాలయమునందు నివసించుచున్నాను". "బ్రాహ్మణుడా ! ఈ శిబిరమునకు అధిపతి యే దేశపు రాజు ? ఏమి పేరు గలవాడు? ఇచ్చట ఆతని రాకకు గారణమేమి ?" అని అడుగబడినవాడై బ్రాహ్మణుడు ఇట్లు పలికెను.

"ఓ సౌమ్యుడా ! మ త్తకాలుడను లాటదేశపు రాజు ఈ దేశపు పాలకుడగు వీరకేతుని పుత్రికయగు వామలోచనయను సాటిలేని లావణ్యముగల స్త్రీ రత్నమును గూర్చి విని విని, పుత్రిక నిమ్మనిన తన ప్రార్థనను తిరస్కరించిన యాతని పాటలీ నగరమును ముట్టడించెను. వీరకేతుడును భీతుడై తన కూతురును గొప్ప కానుకగా మ త్తకాలున కర్పించెను. యువతి లభించుటచే సంతసించిన చి త్తముగల లాట దేశాధిపతి తన పురమునందే పెళ్ళి చేసికొనవలెనని నిశ్చయించి, స్వదేశమునుగూర్చి వెళ్లుచు వేటయందలి ఆదరముచే ఈ అరణ్యమునందు సైన్యపు శిబిరమును వేయించెను. కన్యయే సర్వస్వమైన వీరకేతునిచే నియోగింపబడిన మానధనుడైన మానపాలుడను వీరకేతుమంత్రి చతురంగ బల సమన్వితుడై మరియొకచోట శిబిరము వేయించినవాడై తన ప్రభువునకు కల్గిన అవమానముచే ఖిన్న మనస్కుడై రహస్యముగా ప్రతిక్రియ నాలోచించెను.

'విప్రోఽసౌ బహుతనయో విద్వా న్నిర్ధనః స్థవిర శ్చ దాన యోగ్య' ఇతి తస్మై కరుణాపూర్ణమనా రత్న మదామ్. పరమాహ్లాద వికసితాననోఽభిహితానేకాశీః క్వచి ద్గ్రజన్మా జగామ. అధ్వశ్రమ ఖిన్నేన మయా తత్ర నిరవేశి నిద్రాసుఖమ్. తదను పశ్చాన్నిగళిత బాహుయుగళ స్స భూసురః కశాఘాతచిహ్నితగాత్రో ఽనేకనైస్త్రింశికై రనుయాతోఽభ్యేత్య మా 'మసౌ దస్యు' రిత్యదర్శయత్. పరిత్యక్తభూసురా రాజభటా రత్నావాప్తిప్రకారం మదుక్త మనాకర్ణ్య, భయరహితం మాం గాఢం నియమ్య రజ్జుభి, రానీయ కారాగార, 'మేతే తవ సఖాయ' ఇతి నిగడితాన్ కాంశ్చి న్నిర్దిష్టవంతో, మా మపి నిగడితచరణయుగళ మకార్షుః.

కిం కర్తవ్యతామూఢేన నిరాశక్లేశానుభవేనావోచి మయా: 'నను పురుషా ! వీర్యపరుషాః ! నిమిత్తేన కేన నిర్విశథ కారావాస దుఃఖం దుస్తరం ? యూయం వయస్యా ఇతి నిర్దిష్ట మేతైః; కి

---

"అనేక తనయులు గల్గి విద్వాంసుడై, ధనము లేనివాడై, ముదుసలియైన యీ విప్రుడు దాన యోగ్యుడని" తలచి దయతో నిండిన మనస్సు గలవాడనై ఒక రత్నమును అతనికిచ్చితిని. పరమానందముచే వికసించిన వదనము గల్గి పెక్కు ఆశీస్సులొసంగి యా బ్రాహ్మణుడు ఎచటికో వెడలిపోయెను. మార్గాయాస ఖిన్నుడనైన నేను అచ్చట నిద్రాసుఖమనుభవించితిని. తదుపరి వెనుకకు మరల్చి కట్టబడిన బాహుయుగళము గల్గి, కొరడా దెబ్బల గుర్తులుగల యా బ్రాహ్మణుడు అనేకులైన ఖడ్గధారులచే ననుసరించబడి, నన్నుజేరి "ఇతడే దొంగ" యని చూపించెను. బ్రాహ్మణుని వదలిపెట్టిన రాజభటులు నాచే చెప్పబడిన రత్నప్రాప్తి విధమును వినక, భయరహితుడనైన నన్ను త్రాళ్ళచే గట్టిగ బంధించి, కారాగారమును చేర్చి "వీరే నీ మిత్రు"లని బంధింపబడిన కొందరిని చూపించుచు నన్నుకూడ బంధింపబడిన పాదయుగళము గలవానినిగా నొనర్చిరి. ఏమిచేయుటకు తెలియక నిరాశాక్లేశములను అనుభవించు నేనిట్లు పలికితిని. "పరాక్రమముచే పరుషులగు ఓ పురుషులారా ! ఏ కారణముచేత దుస్తరమైన కారాగారవాస దుఃఖమును అనుభవించుచున్నారు ? మీరు స్నేహితులని వీరిచే నిర్దేశింపబడినది.

మిదమ్ ?' ఇతి. తథావిధం మా మవేక్ష్య భూసురాన్మయా శ్రుతం లాటపతివృత్తాన్తం వ్యాఖ్యాయ చోరవీరాః పున రవోచన్ : 'మహాభాగ ! వీరకేతుమన్త్రిణో మానపాలస్య కిఙ్కరా వయం. తదాజ్ఞయా లాటేశ్వరమారణాయ రాత్రౌ సురఙ్గాద్వారేణ తదగారం ప్రవిశ్య, తత్ర రాజాభావేన విషణ్ణా, బహుధన మపహృత్య మహాటవీం ప్రావిశామ. అపరేద్యు శ్చాన్వేషిణో రాజానుచరా బహవోఽభ్యేత్య, హృతధనాన్వితా నస్మాన్ పరితః పరివృత్య, దృఢతరం బద్ధ్వా, కటక మానీయ, సమ స్తవస్తుశోధనవేలాయా మేకస్యానర్ఘ్యరత్న స్యాభావే నాస్మద్వధాయ మాణిక్యాదానాయాస్మా న్నిగలాశృఙ్ఖలయన్.' ఇతి. శ్రుతరత్న రత్నాలోకనస్థానోఽహ 'మిదం తదేవ భూదేవదానం మాణిక్య' మితి నిశ్చిత్య, తా న్దుఃఖస్థా నాత్మనో జన్మ నామధేయం యుష్మదన్వేషణపర్యటన ప్రకారం చాభాష్య, సమయోచితై స్సంలాపై

---

ఇది యేమి ?" అట్టి నన్నుజూచి, బ్రాహ్మణుని వలన నేను వినిన లాటదేశాధిపతి వృత్తాంతమును సవిస్తరముగ జెప్పి చోరవీరులు మరల నిట్లు పలికిరి. "మహాభాగ! మేము వీరకేతు మంత్రియగు మానపాలుని భృత్యులము. ఆతని అనుమతిచే లాటపతిని చంపుటకై రాత్రియందు సురంగ మార్గమున ఆతని నిలయమును ప్రవేశించి, అచ్చట రాజు కనబడక పోవుటచే దుఃఖితులమై, గొప్ప ధనము నపహరించి, మహారణ్యమును ప్రవేశించితిమి. మరుసటి దినమున అన్వేషకులైన ఎందరో రాజసేవకులు చేరి అపహరించిన ధనములతోనున్న మమ్ము చుట్టుముట్టి మిక్కిలి దృఢముగా బంధించి, కటకమునకు కొనితెచ్చి, సమస్త వస్తువులను పరిశీలించు సమయమున ఒక అమూల్య రత్నము లేమిచే మమ్ములను చంపుటకు, మాణిక్యమును మరల గ్రహించుటకును మమ్ముల నిట్లు బంధించిరి. రత్నమును గూర్చి, రత్నము కనబడు స్థానమును గూర్చి యెరిగిన నేను "ఇది బ్రాహ్మణునకు దానమిచ్చిన యా మాణిక్యమే" యని నిశ్చయించి, దుఃఖస్థులైన వారి నుద్దేశించి, నీ జన్మమును, పేరును, మిమ్ము అన్వేషించుచు తిరిగిన విధమును చెప్పి, సమయోచిత సంభాషణములతో స్నేహము నొనర్చితిని, తదుపరి అర్థరాత్రమున వారియొక్క, నాయొక్క శృంఖలా బంధనమును ఛేదించి, వారిచే

రైర్మైత్రీ మకార్షమ్ తతోఽర్ధరాత్రే తేషాం మమ చ శృఙ్ఖలాబన్ధనం నిర్భిద్య, తైరనుగమ్యమానో, నిద్రితస్య ద్వాస్థగణస్యాయుధజాల మాదాయ, పురరక్షా న్స్ఫురతోఽభిముఖాగతాన్ పటుపరాక్రమలీలయాఽభిద్రావ్య, మానపాలశిబిరం ప్రావిశమ్. మానపాలో నిజకిఙ్కరేభ్యో మమ కులాభిమానవృత్తాన్తం తాత్కాలిక విక్రమం చ నిశమ్య మా మార్చయత్.

పరేద్యుర్మత్తకాలేన ప్రేషితాః కేచన పురుషా మానపాల ముపేత్య, 'మన్త్రిన్! మదీయరాజమన్దిరే సురఙ్గయా బహుధన మపహృత్య చోరవీరా భవదీయకటకం ప్రావిశన్. తా నర్పయ; నో చే న్మహాననర్థ స్సంభవిష్యతి.' ఇతి క్రూరతరం వాక్య మబ్రువన్. త దాకర్ణ్య రోషారుణితనేత్రో మన్త్రీ "లాటపతిః కః? తేన మైత్రీ కా? పున రస్య వరాకస్య సేవయా కిం లభ్యమ్?' ఇతి తాన్నిరభర్త్సయత్. తే చ మానపాలోక్తం విప్రలాపం మత్తకాలాయ తథైవాకథయన్. కుపితోఽపి లాటపతి ర్దోర్వీర్యగర్వేణాల్పసైనికసమేతో

---

ననుసరింపబడి, నిద్రించిన ద్వారపాలక సమూహపు ఆయుధగణము తీసికొని, ఎదురై తాకిన నగర రక్షకులను గొప్ప పరాక్రమలీలచే పాఱద్రోలి మానపాలుని శిబిరమును ప్రవేశించితిని. మానపాలుడును తన భృత్యుల వలన నా కులాభిమాన వృత్తాంతమును, తాత్కాలిక పరాక్రమమును విని నన్నర్చించెను.

మరుసటి దినమున మత్తకాలునిచే పంపబడిన కొందరు పురుషులు మానపాలుని జేరి "మంత్రీ! నా రాజమందిరము నందలి సురంగ మార్గమున బహుధనము నపహరించి, చోరవీరులు నీ కటకమును ప్రవేశించిరి వారి నప్పగింపుము లేనియెడల గొప్ప అనర్థము సంభవింప గలదు." అని మిక్కిలి క్రూరమైన వాక్యము పలికిరి. అది విని క్రోధముచే నెఱ్ఱవారిన కన్నులుగల మంత్రి "లాటపతి ఎవడు? ఆతనితో మైత్రియేమి? ఆ నీచుని సేవచే నేమి లభ్యమగును?" అని వారిని బెదరించెను. వారును మానపాలునిచే పలుకబడిన విప్రలాపమును మత్తకాలునకట్లే చెప్పిరి. కుపితుడైన లాటపతియును భుజబల గర్వముచే కొద్ది

యోద్ధుమభ్యగాత్. పూర్వమేవ కృతరణనిశ్చయో మానపాల స్సన్నద్ధ యోధో యోద్ధుకామో భూత్వా, నిశ్శఙ్కం నిరగాత్. అహమపి సబహుమానం మన్త్రిదత్తాని బహుళతురఙ్గమోపేతం చతురసారథిం రథంచ, దృఢతరం కవచం, మదనురూపం చాపం చ, వివిధబాణపూర్ణం తూణీరద్వయం, సముచితా న్యాయుధాని గృహీత్వా, యుద్ధసన్నద్ధో, మదీయబలవిశ్వాసేన రిపూద్ధరణోద్యుక్తం మన్త్రిణ మన్వగామ్. పరస్పరమత్సరేణ తుములసఙ్గరకర ముభయసైన్య మతిక్రమ్య, సముల్లసద్భుజాటోపేన బాణవర్షం తదఙ్గే విముఞ్చ, న్నరాతీ న్ప్రహరమ్. తతోఽతిరయతురఙ్గమం మద్రథం తన్నికటం నీత్వా శీఘ్రలఙ్ఘనోపేతతదీయరథోఽహ మరాతే శ్శిరఃకర్తన మకార్షమ్.

తస్మి న్నిపతితే, తదవశిష్టసైనికేషు పలాయితేషు, నానావిధం హయగజాదివస్తుజాల మాదాయ, పరమానన్దసంభృతో మన్త్రీ మమా

---

సైన్యముతో కూడి, యుద్ధము చేయుటకు వచ్చెను పూర్వమే యుద్ధము చేయ నిశ్చయించిన మానపాలుడును సంసిద్ధులైన యోధులు గలవాడై, యుద్ధకాముడై నిశ్శంకముగా బయలుదేరెను. నేనును సగౌరవముగా మంత్రిచే నీయబడిన అనేకములైన అశ్వములతోగూడి నేర్పరియగు సారథిగల రథమును, అతి దృఢమైన కవచమును, నా కనురూపమైన ధనుస్సును, అనేక బాణములతో నిండిన అమ్ముల పొది జంటను, సముచితములైన ఆయుధములను తీసికొని, యుద్ధ సన్నద్ధుడనై, నా పరాక్రమము నందలి విశ్వాసముచే శత్రువును జయించుట కుద్యుక్తుడైన మంత్రి ననుసరించితిని. పరస్పర మాత్సర్యముతో సంకుల సమరము సాగించు నుభయ సైన్యముల నతిక్రమించి, ప్రకాశించు భుజబల గర్వముతో బాణవర్షమును వారి అవయవములందు కురిపించుచు, శత్రువులను సంహరించితిని. తదనంతరము మిక్కిలి వేగవంతములైన అశ్వములుగల నా రథమును ఆతని సమీపమునకు గొనిపోయి, త్వరిత లంఘనముచేత నాతని రథము నందుకొని నేను శత్రువు శిరస్సును ఖండించితిని.

ఆ మత్తకాలుడు పడినంత మిగిలిన యాతని సైనికులు పారిపోగా సమస్త విధమైన అశ్వగజాది వస్తుజాలమును తీసికొని మిక్కిలి ఆనంద సంభ

నేకవిధాం సంభావనా మకార్షీత్, మానపాలప్రేషితా త్తదనుచరా దేన మఖిల ముదన్త మాకర్ణ్య, సంతుష్టమనా రాజాఽభ్యుద్గతో, మదీయ పరాక్రమే విస్మయమానః, సమహోత్సవ మమాత్యబాన్ధవానుమత్యా శుభదినే నిజతనయాం మహ్యం మదాత్. తతో యౌవరాజ్యాభిషిక్తో ఽహమనుదిన మారాధితమహీపాలచిత్తో వామలోచనయాఽనయా సహ నానావిధసౌఖ్య మనుభవన్, భవద్విరహవేదనాశల్య వైకల్యహృదయ, స్సిద్ధాదేశేన సుహృజ్జనావలోకనఫలం ప్రదేశం మహాకాలనివాసినః పరమేశ్వరస్యారాధనాయాద్య పత్నీసమేత స్సమాగతోఽస్మి. భక్త వత్సలస్య గౌరీపతేః కారుణ్యేన భవత్పాదారవిన్ద సందర్శనానన్దసన్దోహో మయా లబ్ధ ఇతి.

తం నిశమ్య నన్దితపరాక్రమో రాజవాహన స్తన్నిరపరాధ దండం దైవ ముపాలభ్య తస్మై క్రమేణాఽత్మచరితం కథయామాస. తస్మి న్నవసరే పురతః పుష్పోద్భవం విలోక్య ససంభ్రమం నిజ

---

రితుడైన మంత్రి నాకు బహువిధమైన గౌరవము ఒనర్చెను. మానపాలునిచే పంపబడిన అనుచరునివలన ఈసమ స్తవృత్తాంతమును విని సంతుష్టమనస్కుడైన మహారాజెదురువచ్చి నా పరాక్రమమునకు విస్మయము జెందినవాడై మంత్రి, బంధువుల అనుమతితో ఒక శుభ దినమునందు మహోత్సవములతో, తన కూతు రను నా కొసంగెను. పిమ్మట యౌవ రాజ్యమునందు అభిషిక్తుడనైన నేను ప్రతిదినము మహారాజు చిత్తము నారాధించుచు, ఈ యువతితోపాటు బహువిధ సౌఖ్యము లనుభవించుచు, మీ యెడబాటువలన గలిగిన బాధయనెడి శల్యముచే వికలతజెందిన హృదయము గలవాడనై ఒకసిద్ధుని ఆనతి ప్రకారము మహాకాల నివాసియగు పరమేశ్వరు నారాధించుట కొరకు ధర్మపత్నీ సమేతముగ మిత్ర దర్శనము ఫలముగాగల ఈ ప్రదేశమునకు వచ్చితిని. భక్తులయందు వాత్సల్యము గల పార్వతీపతి దయచే మీ పాద పద్మములను దర్శించుటవలన కలిగిన ఆనం దాతిశయము నాకు లభించినది."

ఆ వృత్తాంతమును విని అభినందింపబడిన పరాక్రమము గల రాజవాహ నుడు అపరాధము లేకయే దండనమును విధించిన దైవమును నిందించి, క్రమ ముగా నాతనికి తన చరిత్రమును చెప్పెను. ఆ సమయమున ఎదుట పుష్పోద్భ

నిటలతటస్పృష్టచరణాఙ్గుళి ముదిఞ్జలి మత్యుగ్గాఢ మాలిఙ్గ్య, ఆనంద బాష్ప సంకుల సంఫుల్లలోచనః, 'సౌమ్య ! సోమదత్త ! అయం స పుష్పోద్భవః.' ఇతి తస్మై తం దర్శయామాస. తౌ చ చిరవిరహ దుఃఖ ముత్సృజ్యా న్యోన్యాలిఙ్గనసుఖ మన్వభూతామ్. తత స్తస్యైవ మహీరుహస్య చ్ఛాయాయా ముపవిశ్య, రాజా సమభాషత : 'వయస్య ! భూసురకార్యం కరిష్ణు రహం 'మి త్రగణో విదితార్థ స్సర్వథాఽ న్తరాయం కరిష్య' తీతి నిద్రితా న్భవతః పరిత్యజ్య నిర గామ్. తదను ప్రబుద్ధో వయస్యవర్గః కిమితి నిశ్చిత్య మదన్వేష ణాయ కుత్ర గతవాన్ ? భవా నేకాకీ క్వ గంతా?'' ఇతి. సోఽపి లలాటతటచుంబదంజలిపుట స్సవినయం సమలపత్.

ఇతి శ్రీ మదాచార్య మహాకవిదణ్డినః కృతౌ దశకుమారచరితే
పూర్వపీఠికాయాం సోమదత్తచరితం నామ
తృతీయోచ్ఛ్వాసః.

---

వుని జూచి సంభ్రమముతో నిజ ఫాలభాగముచే స్పృశింపబడిన పాదాంగుళములు గలిగి, అంజలి ఘటించిన యాతని నతి గాఢముగ కౌగిలించుకొని, ఆనంద బాష్పములు తొణుకులాడు విప్పారిన కన్నులు గలవాడై "సౌమ్యుడ ! సోమ దత్తా ! ఇతడే ఆ పుష్పోద్భవుడు" అని ఆతనికి పుష్పోద్భవుని జూపించెను. వారిరువురును చిరకాల విరహ దుఃఖమును వదలి ఒకరినొకరు కౌగలించుకొని సుఖము ననుభవించిరి. తదుపరి ఆ చెట్టు నీడయందే కూర్చుండి మహారాజిట్లు పలికెను. "మిత్రమా ! బ్రాహ్మణ కార్యము చేయబూనిన నేను విషయము తెలిసినచో మిత్ర సమూహము ఎల్ల వేళల విఘ్నము నాచరింపగలదని నిద్రించిన మిమ్ములను వదలి వెళ్ళితిని. పిమ్మట మేల్కొన్న మిత్రవర్గము ఏమని నిశ్చ యించి, నన్ను వెదకుటకై ఎటు వెళ్ళెనో ? ఒంటరివైన నీవు ఎట కేగితివో!" ఆతడును లలాట దేశమును తాకుచున్న అంజలి పుటము గలవాడై సవినయముగ నిట్లు పలికెను.

ఇది శ్రీ మదాచార్య మహాకవి దండి కృతియైన
దశకుమారచరిత మందలి పూర్వపీఠికయందు
సోమదత్తచరితము యను తృతీయోచ్ఛ్వాసము.

# దశకుమారచరితమ్

## పుష్పోద్భవచరితం నామ చతుర్థోచ్ఛ్వాసః

దేవ! మహీసురోపకారాయైవ దేవో గతవానితి నిశ్చిత్యాపి, దేవేన గన్తవ్యం దేశం నిర్ణేతుమశక్నువానో, మిత్రగణః పరస్పరం వియుజ్య, దిక్షు దేవమన్వేష్టుమగచ్ఛత్. అహమపి దేవస్యాన్వేషణాయ మహీమటన్, కదాచిదమ్బరమధ్యగతస్యామ్బరమణేః కిరణమసహిష్ణు, రేకస్య గిరితటమహీరుహస్య ప్రచ్ఛాయశీతలే తలే క్షణముపావిశమ్. మమ పురోభాగే దినమధ్యసమయే సఙ్కుచితసర్వావయవాం ఖర్వాకృతిం కూర్మాకృతిం మానుషచ్ఛాయాం నిరీక్ష్య, ఉన్ముఖో గగనతలాన్మహారయేణ పతన్తం పురుషం కంచిదన్తరాల ఏవ దయోపనతహృదయోఽహమవలమ్బ్య, శనైరవనితలే నిక్షిప్య,

---

# దశకుమారచరితము

## పుష్పోద్భవచరిత్రము అను చతుర్థోచ్ఛ్వాసము

దేవా ! బ్రాహ్మణున కుపకారము చేయుటకొఱకై దేవరవారు వెళ్ళియుందురని నిశ్చయించియును తా మరిగిన ప్రదేశమును నిర్ణయించుటకు అశక్తమైన మిత్ర సమూహము పరస్పరము విడిపడి దిక్కులందు మిమ్మన్వేషించుటకు జనెను. నేనును మిమ్ము అన్వేషించుటకొఱకు మహీతలమున తిరుగుచు ఒకసారి ఆకాశ మధ్యమునందున్న సూర్యుని కిరణజాలము సహింపజాలనివాడనై పర్వత సమీపమునందలి ఒక వృక్షపు నీడగల చల్లని ప్రదేశమున క్షణకాలము కూరుచుంటిని. నా ముందరి భాగమున మధ్యాహ్న సమయమున ముడుచుకొనబడిన సమస్తావయవములు గల తాబేలువంటి ఆకారముగల మానవుని నీడనుజూచి తలయెత్తి, ఆకాశతలము నుండి గొప్ప వేగముతో క్రిందపడుచున్న యొక పురుషుని దయావిష్ట హృదయుడనైన నేను మధ్యలోనే పట్టుకొని, మెల్లగా భూతల

దూరాపాతవీతసంజ్ఞం తం శిశిరోపచారేణ విబోధ్య, శోకాతిరేకేణో
ద్గదబాష్పలోచనం తం భృగుపతన కారణ మపృచ్ఛమ్. సోఽపి కర
రుహైః రశ్రుకణా నపనయ న్నభాషత. 'సౌమ్య ! మగధాధినాథా
మాత్యస్య పద్మోద్భవ స్యాత్మసమ్భవో రత్నోద్భవనామాహం,
వాణిజ్యరూపేణ కాలయవనద్వీప ముపేత్య, కా మపి వణిక్కన్యకాం
పరిణీయ, తయా సహ ప్రత్యాగచ్ఛన్, అమ్బుధితీర స్యానతిదూర ఏవ
ప్రవహణస్య భగ్నతయా సర్వేషు నిమగ్నేషు, కథం కథ మపి దైవాను
కూల్యేన తీరభూమి మధిగమ్య, నిజాఙ్గనావియోగ దుఃఖార్ణవే ప్లవమా
నోఽహం కస్యాపి సిద్ధతాపస స్యాదేశాదరేణ షోడశహాయనాని కథంచి
న్నీత్వా, దురవస్థాపార మనపేక్షమాణో గిరిపతన మకార్షమ్' ఇతి.

తస్మిన్నే వావసరే కిమపి నారీకూజిత మశ్రావి, 'నఖలు సము
చిత మిదం, య త్సిద్ధాదిష్టే పతితనయమిళనే, విరహ మసహిష్ణు

---

మందుంచి. అతి దూరమందుండి క్రింద పడుటచే పీడిన చైతన్యము గల ఆ
పురుషుని శీతలోపచారముచే మేలుకొల్పి, దుఃఖాతిశయముచేత పైకి వచ్చిన
బాష్పములతో కూడిన కన్నులుగల యాతనిని కొండ శిఖరము నుండి పడుటకు
కారణము నడిగితిని. ఆతడును వ్రేళ్ళతో భాష్పబిందువులను తుడుచుకొనుచు నిట్లు
పలికెను. "సౌమ్యుడా ! నేను మగధరాజు మంత్రియైన పద్మోద్భవుని కుమారు
డను రత్నోద్భవుడను వాడను. వ్యాపార నిమిత్తమై కాలయవన ద్వీపమును జేరి
ఒక వర్తకుని కుమార్తెను వివాహమాడి, ఆమెతో కలసి వెనుదిరిగి వచ్చుచు
సముద్ర తీరమునకు సమీపముననందే నావ పగిలిపోవుటచే అందరును మునిగిపోగా
ఎట్లో ఒక విధముగ, దైవానుకూలతచే తీరప్రదేశమును జేరి, నా ప్రియురాలి
వియోగమువలన ఏర్పడిన దుఃఖ సముద్రమునందు మునిగిన నేను ఒక సిద్ధ
తాపసుని ఆదేశాదరములచేత పదునారు సంవత్సరము లెట్లో గడిపి, దురవస్థల
అంతును తెలియనివాడనై పర్వతముపై నుండి దూకితిని."

ఆ సమయముననందే ఒక స్త్రీ ఆర్తనాదము వినబడెను. "ఇది సముచి
తము కాదు సుమా ! పతిపుత్రులతోడి సమాగమము సిద్ధునిచే ఆదిష్టమైయుండగా

ర్వైశ్వానరం విశ' తీతి. త న్ని శమ్య మనోవిదితజనకభావం త మవాదిషం 'తాత ! భవతే విజ్ఞాపనీయాని బహూని స న్తి. భవతు పశ్చా దఖిల మాఖ్యాతవ్యమ్ అధునా నారీకూజిత మను పేక్షణీయం మయా. క్షణమాత్ర మత్ర భవతా స్థీయతా' మితి. తదను సోఽహం త్వరయా కించి ద న్త రమగమమ్. తత్ర పురతో భయఙ్కర జ్వాలా కుల హుతభుగవగాహన సాహసికాం ముకుళితాఞ్జలిపుటికాం వనితాం కాంచి దవలోక్య, ససంభ్రమ మనలా దపనీయ, కూజన్త్యా వృద్ధయా సహ మత్పితు రభ్యర్ణ మభిగమయ్య, స్థవిరా మవోచమ్ : 'వృద్ధే ! భవత్యౌ కుత్రత్యే ? కాంతారే నిమి త్తేన కేన దురవస్థాఽనుభూయతే? కథ్యతా' మితి.

సా సగద్గద మవాదీత్ :—పు త్ర ! కాలయవనద్వీపే కాలగు ప్తనామ్నో వణిజః కస్యచి దేషా సుతా, సువృత్తానామ, రత్నో

---

వియోగము సహింపజాలక అగ్నిని ప్రవేశించుచున్నావు" అని. ఆ మాట విని నా తండ్రియేయని మనస్సున కనిపించుచున్న ఆతనితో ఇట్లు పలికితిని- "అయ్యా ! మీకు విజ్ఞప్తి చేయవలసినవి పెక్కులు గలవు. కానిందు అంతయును తరువాత చెప్పదగియున్నది. ప్రస్తుతము నాకు స్త్రీ ఆ ర్తనాదము ఉపేక్షింపదగినదికాదు. మీరు క్షణకాలమిచ్చట ఉందురుగాక!" ఇట్లు పలికిన నేను పిదప త్వరగా కొంచెము దూరమువెళ్ళితిని. అచ్చట ముందరనున్న భయంకర జ్వాలలతో వ్యాకులమైన అగ్నిలో పడుటకు సాహసించు ముడిచిన అంజలి పుటముగల ఒక వనితను జూచి, ససంభ్రమముగ అగ్నినుండి తొలగించి, ఆక్రందించుచున్న వృద్ధురాలితోకూడి నా తండ్రి సమీపమునకు జేరి, వృద్ధురాలితో నిట్లంటిని— "ఓ ముదుసలి యవ్వా ! మీరిద్దరును ఎచ్చటివారు ? ఈ యడవియందు ఏ నిమి త్తముచేత ఇంతటి దురవస్థ అనుభవించుచున్నారు ? చెప్పుదువుగాక !"

ఆమె గద్గదస్వరముతో నిట్లుపలికెను— "కుమారా ! కాలయవన ద్వీపమునందు కాలగుప్తుడను ఒక వ ర్తకుని కూతురగు సువృ త్తయను పేరుగల ఈమె తన భర్తయగు రత్నోద్భవునితో వచ్చుచుండగా సముద్రమున ఓడ

ద్భవేన నిజకాన్తే నాగచ్ఛన్తి, జలధౌ మగ్నే ప్రవహణే, నిజధాత్ర్యా మయా సహ ఫలక మేక మవలమ్బ్య, దైవయోగేన కూల ముపేతా, ఆసన్న ప్రసవ సమయా కస్యాంచి దటవ్యా మాత్మజ మసూత. మమ తు మన్దభాగ్యతయా బాలే వనమాతఙ్గేన గృహీతే, మద్ద్వితీయా పరి భ్రమన్తీ, 'షోడశవర్షానంతరం భర్తృపుత్త్రసఙ్గమో భవిష్య' తీతి సిద్ధ వాక్యవిశ్వాసా దేకస్మిన్ పుణ్యాశ్రమే తావన్తం సమయం నీత్వా శోక మపారం సోఢు మక్షమా, సముజ్జ్వలితే వైశ్వానరే శరీర మాహుతీ కర్తు ముద్యుక్తా ఽఽసీ''దితి. తదాకర్ణ్య నిజజననీం జ్ఞాత్వా తా మహం దణ్డవత్ప్రణమ్య తస్యై మదుదన్త మఖిల మాఖ్యాయ ధాత్రీభాషణ ఫుల్లవదనం విస్మయవికసితాక్షం జనక మదర్శయమ్. పితరౌ తౌ సాభిజ్ఞాన మన్యోన్యం జ్ఞాత్వా ముదితాన్తరాత్మానౌ, వినీతం మా మమన్దాశ్రువర్షేణాభిషిచ్య, గాఢ మాశ్లిష్య శిరస్యుపాఘ్రాయ, కస్యాంచి న్మహీరుహచ్ఛాయాయా ముపావిశతామ్. 'కథం నివసతి

---

మునిగిపోగా దాని దాదినైన నాతోగూడ ఒక ఫలకము నూతగొని దైవవశమున ఒడ్డున జేరినదై, దరిజేరిన ప్రసూతి సమయముగలదై ఒకానొక యడవిలో కుమారుని ప్రసవించెను. కాని నా మందభాగ్యముచేత బాలుడు వనగజముచే గ్రహింపబడగా నాతోగలసి తిరుగుచు "పదునారు సంవత్సరముల తరువాత పతి పుత్రులతోడి కలయిక జరుగగలద"ను సిద్ధవాక్యమునందలి విశ్వాసము వలన ఒక పుణ్యాశ్రమమున నింతకాలమును గడిపి, అంతులేని దుఃఖమును సహించుట కశక్తయై మండుచున్న అగ్నిలో శరీరము నాహుతిజేయుటకు సిద్ధమైనది."

అది విని నేను ఆమెను నా తల్లినిగా దెలిసికొని దండవత్ప్రణామ మాచ రించి, ఆమెకు నా సమస్త చరిత్రమును దెలిపి, దాది సంభాషణములచే వికసిం చిన ముఖమును, విస్మయముచే వికసించిన నేత్రములునుగల తండ్రిని జూపితిని. తలిదండ్రులిద్దరును అన్యోన్యము గుర్తులచే తెలిసికొని సంతసించిన మనస్సు గలవారై వినమ్రుడనైన నన్ను అంతులేని కన్నీటివానతో అభిషేకించి, గాఢముగ కౌగిలించుకొని, శిరస్సును మూర్కొని, ఒకానొక చెట్టునీడలో కూర్చుండిరి.

మహీవల్లభో రాజహంసః?' ఇతి జనకేన పృష్టోఽహం తస్య రాజ్యచ్యుతిం త్వదీయజననం సకలకుమారావాప్తిం తవ దిగ్విజయారమ్భం, భవతో మాతఙ్గానుయాన, మస్మాకం యుష్మదన్వేషణ కారణం, సకల మభ్యధామ్. తత సౌ కస్యచి దాశ్రమే మునే రస్థాపయమ్.

తతో దేవస్యాన్వేషణపరాయణోఽహ మఖిలకార్య నిమిత్తం విత్తం నిశ్చిత్య, భవదనుగ్రహో ల్లబ్ధస్య సాధకత్వస్య సాహాయ్యకరణ దక్షం శిష్యగణం నిష్పాద్య, విన్ధ్యవనమధ్యే పురాతనపట్టణస్థానా న్యుపేత్య వివిధనిధిసూచకానాం మహీరుహాణా మధో నిక్షిప్తా న్వసుపూర్ణాన్ కలశాన్ సిద్ధాఞ్జనేన జ్ఞాత్వా, రక్షిషు పరిత స్స్థితేషు, ఖనన సాధనై రుత్పాట్య దీనారా నసంఖ్యాన్ రాశీకృత్య. తత్కాలాగత మనతిమూరే నివేశితం వణిక్కటకం కంచి దభ్యేత్య, తత్ర బలినో బలీవర్దాన్ గోణీం శ్చ క్రీత్వా, అన్యద్రవ్యమిషేణ వసు తద్గోణీ

---

"మహారాజగు రాజహంసుడు ఎట్లు నివసించుచున్నాడ"ని తండ్రిచే అడుగబడిన నేను అతని రాజ్యనాశనమును, నీ జననమును. సమస్త కుమారుల ప్రాప్తియు, మీ జైత్రయాత్రారంభమును, మీ మాతంగానుగమనమును, మేము మిమ్ములను వెదుకుటకుగల కారణమును సర్వమును చెప్పితిని. పిమ్మట వారిరువురను ఒక ముని ఆశ్రమము నెలయించితిని.

తదనంతరము ప్రభువుల అన్వేషణయందు ఆసక్తుడనైన నేను సమస్త కార్యములకు కారణము ధనమని తలచి, మీ యనుగ్రహము వలన పొందబడిన సాధకత్వమునకు సహాయముజేయ సమర్థమైన శిష్యగణమును సంపాదించి, వింధ్యారణ్య మధ్యమునందలి పురాతన పట్టణ స్థానములను జేరి, వివిధ నిధి సూచకములైన వృక్షములక్రింద దాచబడిన ధనముతో నిండిన కలశములను సిద్ధాంజనముచే తెలిసికొని, రక్షకులు చుట్టుముట్టియుండగా త్రవ్వెడు పరికరములతో, లెక్కలేని దీనారములను వెలికి తీసి, కుప్పవోసి, ఆ సమయమునకు వచ్చి సమీపమునందున్న ఒక వర్తక శిబిరమును జేరి, అచ్చట బలిష్ఠములైన ఎద్దులను, సంచులను కొని, అన్యద్రవ్యమను మిషతో ఆ సంచులలో నింపబడిన ధనమును

సమ్మిలితం తైరుహ్యమానం శనైః కటక మనయమ్. తదధికారిణా చన్ద్రపాలేన కేనచి ద్వణిక్పుత్రేణ విరచితసౌహృదోఽహ మమునైవ సాక ముజ్జయినీ ముపావిశమ్ మత్పితరావపి తాం పురీమభిగమయ్య, సకలగుణనిలయేన బన్ధుపాల నామ్నా చన్ద్రపాల జనకేన నీయమానో మాలవనాథదర్శనం విధాయ, తదనుమత్యా గూఢవసతి మకరవమ్. తతః కాననభూమిషు భవన్త మన్వేష్టు ముద్యుక్తం మాం పరమ మిత్రం బన్ధుపాలో నిశమ్యావదత్: 'సకలం ధరణీతల మపార మన్వేష్టు మశక్తో భవాన్ మనోగ్లానిం విహాయ తూష్ణీం తిష్ఠతు. భవ న్నాయకాలోకనకారణం శుభశకునం నిరీక్ష్య కథయిష్యా' మీతి.

తల్లపితామృతాశ్వాసితహృదయోఽహ మనుదినం తదుపకణ్ఠవర్తీ కదాచి దిన్ధుముఖీం నవయౌవనావలీఢావయవాం నయనచన్ద్రికాం బాల చన్ద్రికాం నామ తరుణీరత్నం వణిజ్మన్దిర లక్ష్మీం మూర్తామివావ

---

వారిచే మోయింపజేసి, మెల్లగా శిబిరమును జేర్చితిని. ఆ శిబిరమున కధికారియైన ఒక వైశ్యకుమారుడగు చంద్రపాలునితో స్నేహముజేసి, అతనితో కలిసి ఉజ్జయినీ నగరము ప్రవేశించితిని. నా తల్లిదండ్రులనుకూడ ఆ నగరమునే చేర్చి సమస్త సుగుణములకు నిలయుడైన చంద్రపాలుని తండ్రియైన బంధుపాలుడను వానితో తీసికొనిపోబడి, మాళవరాజు దర్శనము చేసికొని, అతని అనుమతితో రహస్యనివాస మేర్పరచుకొంటిని. తరువాత అరణ్యభూములందు మిమ్ముల నన్వేషించుట కుద్యుక్తుడనైన నన్నుగూర్చి విని పరమ మిత్రుడైన బంధుపాలుడు ఇట్లు పలికెను— "అంతులేని సమస్త భూమండలమును వెదకుట కశక్తుడవగు నీవు మానసిక బాధను వదలి యూరకుండుము. మీ ప్రభువును దర్శించుటకు కారణమైన శుభశకునమును చూచి చెప్పగలను."

ఆతని పలుకులనెడు అమృతముచే నాశ్వాసింపబడిన హృదయముగల నేను ప్రతిదినము అతని సమీపమునందే యుండి, ఒకసారి చంద్రబింబము వంటి ముఖము గలదియు, నవయౌవనముతో కూడిన అవయవములు గలదియు, కన్నులకు వెన్నెలవంటిదియునునగు, బాలచంద్రికయను పేరుగల యువతీరత్నమును—

లోక్య, తదీయలావణ్యావధూతదీరభావో లతాన్తబాణబాణలక్ష్యతా మయా సిషమ్. చకితబాలకురఙ్గలోచనా సాఽపి కుసుమసాయకసాయకాయమానేన కటాక్షవీక్షణేన మా మసకృన్నిరీక్ష్య మన్దమారుతాన్దోలితలతేవాకమ్పత. మమ సాఽభిముఖై స్సమాకుఞ్చితై రాగలజ్జాన్తరాలవర్తిభి రపాఙ్గవర్తిభి రీక్షణవిశేషై ర్నిజమనోవృత్తిమకథయత్. చతురగూఢ చేష్టాభి రస్యా మనోఽనురాగం సమ్యగ్ జ్ఞాత్వా సుఖ సఙ్గమోపాయ మచిన్తయమ్, అన్యదా బన్ధుపాల శ్శకునై ర్భవద్గతిం ప్రేక్షిష్యమాణః పురప్రాన్తవిహారవనం మయా సహోపేత్య కస్మింశ్చిన్మహీరుహే శకునవచనాని శృణ్వ న్నతిష్ఠత్.

అహ ముత్కలికావినోదపరాయణో వనాన్తే పరిభ్రమన్, సరోవరతీరే చిన్తాక్రాన్తచిత్తాం దీనవదనాం మన్మనోరథైకభూమిం బాల

---

స్వరూపము దాల్చిన వైశ్యమందిర లక్ష్మివలె నున్నదానిని చూచి ఆమె లావణ్యముచే తిరస్కరింపబడిన ధైర్యగుణము గలవాడనై, పుష్పబాణుని బాణములకు లక్ష్యమైతిని భయపడిన లేడిపిల్ల చూపులవంటి చూపులుగల ఆమెయును, మన్మథుని బాణమువలెనున్న వాలుచూపుతో నన్ను పెక్కుసారులు జూచి, పిల్లగాలులచే చలించు తీగవలె వడకెను.

అభిముఖములు, సిగ్గుచే సంకుచితములు, ప్రేమకు సిగ్గునకు నడుమనున్నవి, వాలుగన్నులందు వర్తించునవియైన ఈక్షణ విశేషములతో ఆమె నాకు లన మానసికావస్థను తెలిపెను. చతురములు, గూఢములునైన చేష్టలచే ఆమె మనస్సునందలి ప్రేమను బాగుగ తెలిసికొని, సుఖముగా కలియుట కుపాయమునాలోచించితిని. మరియొకప్పుడు బంధుపాలుడు మెల్లగా మీస్థితిని ఊహించుచున్నవాడై నాతోపాటు పురమునకు సమీపమునందున్న ఒక విహారవనమును జేరి, ఒకానొక వృక్షమునందలి పక్షుల పలుకులను వినుచుండెను.

నేను వియోగ బాధను పోగొట్టుకొను ఆసక్తిగలవాడనై విహార వనమధ్యమున సంచరించుచుండగా ఒక సరోవర తీరమునందు చింతతోనిండిన చిత్తము గలదియు, దీనమైన ముఖముగలదియు, నా కోరికలకు ముఖ్యస్థానమైనదియు నగు

చన్ద్రికాం వ్యలోకయమ్. తస్యా స్ససంభ్రమప్రేమలజ్జాకౌతుకమనో
రమం లీలావిలోకనసుఖ మనుభవన్, సుదత్యా వదనారవిన్దే విషణ్ణ
భావం మదనకదనఖేదానుభూతం జ్ఞాత్వా. తన్నిమిత్తం
జ్ఞాస్యన్, లీలయా తదుపకణ్ఠ ముపేత్యావోచిషమ్; 'సుముఖి!
తవ ముఖారవిన్దస్య దైన్యకారణం కథ' యేతి. సా రహస్యసంజాత
విస్రమ్భతయా విహాయ లజ్జాభయే, శనై రభాషత : 'సౌమ్య! మాన
సారో మాలవాధీశో వార్ధకస్య ప్రబలతయా నిజనన్దనం దర్పసార
ముజ్జయిన్యా మభ్యషిఞ్చత్. స కుమార స్సప్తసాగరపర్యన్తం మహీ
మణ్డలం పాలయిష్య న్నిజ పైతృష్వస్రీయా వుద్దణ్డకర్మాణౌ చణ్డ
వర్మదారువర్మాణౌ ధరణీ భరణే నియుజ్య తపశ్చరణాయ రాజరాజగిరి
మభ్యగాత్. రాజ్యం సర్వ మసపత్నం శాసతి చణ్డవర్మణి దారువర్మా
మాతులాగ్రజన్మనో శ్శాసన మతిక్రమ్య పారదార్యపరద్రవ్యాపహార

---

బాలచంద్రికను చూచితిని. తొట్రుపాటు, ప్రేమ, సిగ్గు, కౌతుకములతో మనో
హరమైన ఆమె లీలా విలోకన సుఖము ననుభవించుచు, నా యువతి ముఖ కమ
లమునందలి విషాద భావమును, మన్మథ బాధవలన కల్గిన దుఃఖానుభవమును కూడ
తెలిసికొని, దానికి కారణ మరయగోరి విలాసముగా నామె దరిచేరి యిట్లు పల్కి
తిని— "సుముఖీ! నీ ముఖపద్మపు దీనత్వమునకు కారణమును తెలుపుము."
ఆమె ఏకాంతమువలన కల్గిన విశ్వాసముచే సిగ్గును, భయమును వీడి మెల్లగా
నిట్లు పల్కెను— "సౌమ్యుడా! మాలవ దేశాధీశ్వరుడగు మానసారుడు ముదు
సలితనము ముదురుటచే తన కుమారుడైన దర్పసారుని ఉజ్జయినియం దభిషే
కించెను. ఆ రాజకుమారుడు సప్తసాగర పర్యంతమైన రాజ్యమును పాలింపగోరిన
వాడై తన మేనత్త కుమారులును, భయంకర కర్మలను జేయువారును ఐన
చండవర్మ దారువర్మలను భూరక్షణమున నియోగించి, తపశ్చరణమునకై కుబేర
పర్వతము జేరెను. చండవర్మ సమస్త రాజ్యమును శత్రురహితముగా పరిపా
లించుచుండగా దారువర్మ మేనమామ యొక్కయు అన్నయొక్కయు ఆజ్ఞను మీరి
పరుల భార్యలను, పరద్రవ్యములను అపహరించుట మొదలగు దుష్కర్మల నాచ

ణాది దుష్కర్మ కుర్వాణో మన్మథసమానస్య భవతో లావణ్యాయత్త చిత్తాం మా మేకదా విలోక్య కన్యాదూషణదోషం దూరీకృత్య బలాత్కారేణ రన్తు ముద్యుక్తే, తచ్చిన్తయా దైన్య మగచ్ఛమ్'' ఇతి. తస్యా మనోగతం మయి రాగోద్రేకం, మన్మనోరథ సిద్ధ్యన్తరాయం చ నిశమ్య బాష్పపూర్ణలోచనాం తా మాశ్వాస్య దారువర్మణో మారణోపాయం చ విచార్య వల్లభా మవోచమ్:—

''తరుణి ! భవదభిలాషిణం దుష్టహృదయ మేనం నిహన్తుం మృదు రుపాయః కశ్చి చ్చిన్త్యతే. 'యక్షః కశ్చి దధిష్ఠాయ బాలచన్ద్రికాం నివసతి. తదాకారసంపదాశాశృఙ్ఖలిత. హృదయో య స్సంబన్ధయోగ్య స్సాహసికో రతిమన్దిరే తం యక్షం నిర్జిత్య తయైకసఖీసమేతయా మృగాక్ష్యా సంలాపామృతసుఖ మనుభూయ కుశలీ నిర్గమిష్యతి, తేన చక్రవాకసంశయకరపయోధరా వివాహనీయేతి సిద్ధే నైకే నావాది'

---

రించినవాడై మన్మథ సమానులైన మీ లావణ్యమునందు తగుల్కొన్న చిత్తము గల నన్ను ఒకప్పుడు చూచి, కాన్యాదూషణ దోషమును దూరమొనర్చి, బలాత్కారముగ రమించుటకు సిద్ధముకాగా ఆవిచారము చేతనే నేను దైన్యము పొందితిని." నా విషయమున ఆమె మనోగతమైన అనురాగాతిశయమును, నా మనోరథసిద్ధికి విఘ్నమునుకూడ విని, కన్నీరు నిండిన కన్నులుగల యామెను ఊరడించి దారువర్మ మరణోపాయమును విచారించి ప్రియురాలితో నిట్లంటిని—

"యువతీ ! నిన్నభిలషించు ఈ దుష్టహృదయుని చంపుటకు మృదువైన యుపాయ మాలోచింపబడుచున్నది. ఒకానొక యక్షుడు బాలచంద్రిక నావేశించి నివసించుచున్నాడు. ఆమె రూపసంపదయందలి ఆశచే కట్టుబడిన హృదయము గల, సంబంధ యోగ్యుడైన సాహసి యెవడు రతిమందిరమునం దాయక్షుని జయించి, ఏకసఖీసమేతయగు నా మృగాక్షితో సంలాపామృత సుఖము ననుభవించి, కుశలియై రాగలడో, ఆతనినే చక్రవాకములనెడు సంశయము గలిగించు స్తనములుగల బాలచంద్రిక వివాహమాడబడగలదు" అని, ఒక సిద్ధునిచే చెప్పబడినది అని పురజనులయెదుట సత్యభాషణులైన మీయింటివారిచేత పెక్కు

ఇతి పురజనస్య పురతో భవదీయై స్సత్యవాక్యై ర్జనైః ప్రఖ్యాపనీయమ్. తదను దారువర్మా వాక్యా న్యేతద్విధాని శ్రావం శ్రావం తూష్ణీం యది భియాస్థాస్యతి తర్హి, వరమ్. యదివా దౌర్జన్యేన త్వయా సఙ్గమ మంగీకరిష్యతి తదా స భవదీయై రిత్థం వాచ్యః; 'సౌమ్య! దర్పసార వసుధాధి పామాత్యస్య భవతో ఽస్మిన్నివాసే సాహసకరణ మనుచితం; పౌరజనసాక్షికం భవన్మన్దిర మానీతయా తయా తోయజాక్ష్యా సహ క్రీడ న్నాయుష్మాన్ యది భవిష్యసి, తదా పరిణీయ తరుణీం మనోరథా న్నిర్విశ' ఇతి. సోఽప్యేత దంగీకరిష్యతి. త్వం సఖీవేషధారిణా మయా సహ తస్య మన్దిరం గచ్ఛ. అహమేకాన్తనికేతనే ముష్టిజానుపదా ఘాతై స్తం రభసాన్నిహత్య పునరపి వయస్యామిషేణ భవతీ మను నిశ్శఙ్కం నిర్గమిష్యామీతి.

తదేన ముపాయ మంగీకృత్య విగతసాధ్వసలజ్జా ఽభవత్. పున రప్యవోచమ్ : 'జననీజనకసహోదరాణాం పురత ఆవయోః ప్రేమాతి

---

మాటలు చెప్పబడవలెను. తదుపరి దారువర్మ యీ విధములయిన మాటలను విని భయముతో నూరకుండినచో మేలే. ఒకవేళ దౌర్జన్యముచే నీతోడి సంగము మునకు సిద్ధపడినచో అప్పుడు వాడు మీవారిచే నిట్లు చెప్పబడవలెను. ''సౌమ్యుడ! దర్పసారమహారాజునకు అమాత్యుడవగు నీకీ గృహసాహసము ఉచితము కాదు. పురజనులు సాక్ష్యముగ మీ భవనమునకు గొనితేబడిన యీ పద్మాక్షితో క్రీడించుచు నాయుష్మంతుడవు కాగోరుదువేని అప్పు డీ యువతిని పరిణయమాడి కోరికల ననుభవింపుము.'' ఆతడును దీని నంగీకరింప గలడు. సఖీవేషము ధరించిన నాతో కూడి నీవు వాని మందిరమునకు వెళ్ళుము. నేను ఏకాంత మందిరమునందు పిడికిలితో, మోకాళ్ళతో, పాదముల దెబ్బలతో నాతని తర్వగా జంపి మరల చెలికత్తె వ్యాజముతో నిన్ననుసరించి నిశ్శంకముగా బయటకు రాగలను.''

అందువలన ఈ యుపాయము నంగీకరించి వీడిన భయము సిగ్గు కలదయ్యెను. నేను మరియు నిట్లంటిని— ''తల్లిదండ్రులయు, సహోదరులయు

శయమాఖ్యాయ, సర్వథాఽస్మత్పరిణయకరణే తౌ సనునయేః. తేఽపి వంశసమ్పల్లావణ్యాఢ్యాయ యూనే మహ్యాం త్వాం దాస్యన్త్యేవ. దారువర్మణో మారణోపాయం తేభ్యఃకథయిత్వా, తేషా ముత్తర మాఖ్యేయం మహ్య'మితి. సాఽపి కిఞ్చిదుత్ఫుల్లసరసిజాననా మా మబ్రవీత్: 'సుభగ! క్రూరకర్మాణం దారువర్మాణం భవాన్ హన్తు మర్హతి. తస్మిన్ హతే సర్వథా యుష్మన్మనోరథః ఫలిష్యతి. ఏవం క్రియతామ్. భవదుక్తం సర్వ మహ మపి తథా కరిష్య' ఇతి మా మసకృద్వివృత్తవదనా విలోకయన్తీ మన్దమన్ద మగార మగాత్. అహమపి బన్ధుపాల ముపేత్య శకునజ్ఞాత్తస్మా త్త్రింశద్దివసాన న్తరమేవ భవత్సఙ్గ స్సమ్భవిష్యతీ త్యశ్రృణవమ్. తదను మదనుగమ్యమానో బన్ధుపాలో నిజావాసం ప్రవిశ్య మా మపి నిలయాయ వ్యసర్జయత్.

---

ఎదుట మన ప్రేమాతిశయమును చెప్పి, అన్నివిధముల మన వివాహవిషయమున వారిని ఒప్పింపుము. వారును కులము, సంపద, సౌందర్యము గల్గిన యువకుడనగు నాకు నిన్ను తప్పక ఇచ్చెదరు. దారువర్మ మారణోపాయము వారికి జెప్పి నాకు వారి సమాధానము జెప్పవలయును.'' ఆమెయును కొంచెము వికసించిన పద్మము వంటి ముఖము గలదగుచు నాతో ఇట్లనెను– "సుందరా! క్రూరకర్ముడైన దారువర్మను నీవు చంపవలయును. వాడు చచ్చినచో మీ మనోరథము పూర్తిగా ఫలించగలదు. అట్లే చేయుము. నీచే చెప్పబడిన సర్వము నేనును అట్లే చేయుదును''. ఇట్లని నన్ను పెక్కుమారులు ప్రక్కకు త్రిప్పిన ముఖముతో జూచుచు మెల్ల మెల్లగా తన గృహమున కేగెను. నేనును బంధుపాలుని జేరి శకున శాస్త్రమును తెలిసిన యాతని వలన ముప్పది దినముల తరువాత మీతో సమాగమము జరుగగలదని వింటిని. తదుపరి నాచే ననుసరింపబడినవాడై బంధుపాలుడు తన గృహము ప్రవేశించి నన్ను కూడ ఇంటికి పంపెను.

మన్మాయోపాయవాగురాపాశ లగ్నేన దారువర్మణా రతిమన్ది
రం సమాహూతా బాలచన్ద్రికా తం గమిష్యన్తీ దూతికాం మన్నికటం
ప్రేషితవతీ. అహమపి మణినూపుర మేఖలాకంకణ తాటంక హార
క్షౌమ కజ్జలం వనితాయోగ్యం మణ్డనజాతం నిపుణతయా తత్తత్స్థా
నేషు నిక్షిప్య, సమ్యగఙ్గీకృతమనోజ్ఞవేషో, వల్లభయా తయా సహ
తదగారద్వారోపాన్త మగచ్ఛమ్. ద్వాస్స్థకథితాస్మదాగమనేన సాదరం
విహితాభ్యుద్గతినా తేన ద్వారోపాన్తనివారితాశేషపరివారేణ సహస్థితా
బాలచన్ద్రికా సఙ్కేతాగార మనీయత. నగర వ్యాకులాం యక్షకథాం
పరీక్షమాణో నాగరికజనోఽపి కుతూహలేన దారువర్మణః ప్రతీహార
భూమి మగమత్. వివేకశూన్యమతి రసౌ రాగాతిరేకేణ రత్నఖచిత
హేమపర్యఙ్కే హంసతూలగర్భశయన మాసీయ తరుణీం, తస్యై త్రై
మహ్యం చ తమిస్రాసమ్యగనవలోకితపుంభావాయ మనోహరస్త్రీవేషాయ

---

నా మాయోపాయ మనెడు వల త్రాటికి చిక్కిన దారువర్మచే రతి
మందిరమున రమించుట కాహ్వానింపబడిన బాలచంద్రిక యాతనిని చేర
బోవుచు ఒక దూతికను నా దరికి పంపెను. నేనును మణినూపురములు,
మొలనూలు, కంకణములు, తాటంకములు, హారములు, పట్టువస్త్రము,
కాటుక మొదలగు వనితలకు యోగ్యమైన అలంకరణసామగ్రిని నైపుణ్యముతో
నాయా స్థానము లందుంచి బాగుగ కుదిరిన సుందరవేషము గలవాడనై, యా
ప్రియురాలితోపాటు దారువర్మ గృహద్వార ప్రాంతమునకు వెళ్ళితిని. ద్వార
పాలకునిచే మా యాగమన వార్త విని సాదరముగ అభ్యుత్థానాది క్రియలాచరిం
చిన ఆతనిచేత ద్వార సమీపమందలి పరివారమంతయు నివారింపబడగా
నాతో కూడిన బాలచంద్రిక సంకేత గృహమునకు గొనిపోబడెను. నగరమును
వ్యాకులపరచుచున్న యక్షకథను పరిశీలించుచున్న నాగరికజనము కూడ
కుతూహలముతో దారువర్మ గృహద్వార ప్రదేశమును జేరెను. వివేకశూన్య
మతియైన దారువర్మ రాగాతిశయముతో ఆ యువతిని రత్నఖచితమైన కనక
శయ్యపై హంసతూలికా గర్భశయనమునకు రావించి ఆమెకును, చీకటిలో
బాగుగ చూడబడని పురుషస్వరూపము గల్గి మనోహర స్త్రీ వేషము ధరించి

చామీకరమణిమయమణ్డనాని. సూక్ష్మాణి చిత్రవస్త్రాణి, కస్తూరికామిళితం హరిచన్దనం, కర్పూరసహితం తామ్బూలం సురభీని కుసుమాని, లలిత వస్తుజాతం సమర్ప్య, ముహూర్తద్వయమాత్రం హాసవచనైః స్సంలప న్నతిష్ఠత్. తతో రాగాన్ధతయా సుముఖ్యాలిఙ్గనే మతిం వ్యధత్త. రోషారుణితోఽహ మేనం పర్యంకతలా న్నిశ్శఙ్కో నిపాత్య ముష్టిజాను పదాఘాతైః ప్రాహరమ్. నియుద్ధరభసవికల మలఙ్కారం పూర్వ వన్మేళయిత్వా, భయకమ్పితాం నతాంగీ ముపలాలయన్, మన్దిరాఙ్గణ ముపేత స్సాధ్వసకమ్పిత ఇవోచ్చై రజకూజ మ్, హా! బాలచన్ద్రికా

---

నాకును కనకమణిమయములైన యలంకరణములు, సూక్ష్మములైన చిత్ర విచిత్ర వస్త్రములు, కస్తూరీ మిళితమైన హరిచందనము, కర్పూరయుక్తమైన తాంబూలమును, సుపరిమళములైన పువ్వులు మొదలగు మృదుల వస్తు జాతమును, సమర్పించి, రెండుక్షణముల కాలము హాస వచనములతో సంభా షించుచు నుండెను. అంతట అనురాగమువలన గ్రుడ్డివాడగుటచే సుందరి నాలింగనము చేసికొన మనసు పడెను. క్రోధముచే ఎఱ్ఱబారిన ముఖముగల నేను ఆతనిని పర్యంకతలము నుండి నిర్భయముగ క్రింద పడవైచి, పిడి కిళ్ళ, మోకాళ్ళ, పాదముల దెబ్బలతో వధించితిని. ద్వంద్వయుద్ధముచే చెడిన యలంకారములను పూర్వమువలె సవరించుకొని, భయముచే కంపిం చుచు వంచిన శిరస్సుగల యామె నుపలాలించుచు, గృహ ప్రాంగణమున కేతెంచినవాడనై భయముతో వణకు కంఠముగల వానివలె బిగ్గరగా "బాలచం ద్రిక నావేశించిన ఘోరాకారముగల యక్షునిచే దారువర్మ చంపబడెను. త్వరగ రండి. చూడండి" అని యరచితిని. దానిని విని గుమిగూడిన జనులు ఉబ్బొం గిన కన్నీళ్ళు గలవారై హాహాకారములతో, దిక్కులను బధిరములుగ జేయుచు

ధిష్ఠితేన ఘోరాకారేణ యక్షేణ దారువర్మా నిహన్యతే. సహసా సమా గచ్ఛత, పశ్యత! తేతి. త దాకర్ణ్య మిళితా జనా స్సముద్యద్బాష్పా హా హా నినాదేన దిశో బధిర యన్తో 'బాలచన్ద్రికా మధిష్ఠితం యక్షం బలవ న్తం శృణ్వన్నపి దారువర్మా మదాన్ధ స్తామే వాయాచత. త దసౌ స్వకీయేన కర్మణా నిహతః. కిం తస్య విలపనే' నేతి మిథో లప న్తః ప్రావిశన్. కోలాహలే తస్మిం శ్చటులలోచనయా సహ నైపు ణ్యేన సహసా నిర్గతో నిజావాస మగామ్. తతో గతేషు కతిపయ దినేషు, పౌరజనసమక్షం సిద్ధాదేశ ప్రకారేణ వివాహ్య తా మిన్దు ముఖీం, పూర్వసంకల్పితం సుఖం యథేష్ట మన్వభవమ్. బన్ధుపాల శకుననిర్దిష్టదివసేఽస్మిన్నిర్గత్య పురాద్బహి ర్వ ర్తమానో నేత్రోత్సవ కారి భవదవలోకనసుఖ మ ప్యనుభవా మీతి.

ఏవం మిత్త్రవృ త్తా న్తం నిశమ్యామ్లానమానసో రాజవాహన స్స్వస్య చ సోమద త్తస్య చ వృత్తా న్త మస్మై నివేద్య, 'సోమద త్త!

---

"బాలచంద్రిక నావేశించి యున్న యక్షుని బలవంతునిగ వినియును దారువర్మ మదాంధుడై ఆమెనే కోరెను. అందుచే నితడు తన అపరాధ కర్మచేతనే చంప బడెను. ఆతనికై విలపించుటవలన ప్రయోజనమేమి" అని పరస్పరము మాట్లాడుకొనుచు లోనికి ప్రవేశించిరి. ఆ కోలాహలమున చంచలాక్షియగు నామెతోపాటు నైపుణ్యముతో, వెంటనే బయటకు వచ్చి స్వగృహమును జేరి తిని. తదనంతరము కొన్నిదినములు గడచిన పిమ్మట సిద్ధుని ఆదేశప్రకార ముగ పురజనుల సమక్షమున ఆ చంద్రముఖిని వివాహమాడి, పూర్వము సంక ల్పించిన సురతసుఖము యథేష్టముగ ననుభవించితిని. బంధుపాలుని శకున ముచే నిర్దేశింపబడిన ఈ దివసమునందు బయలుదేరి పురమునుండి వెలు పల నున్నవాడనై కన్నులపండువైన మీ దర్శనసుఖమును కూడ ననుభ వించుచున్నాను" అని.

ఇట్లు మిత్రుని వృత్తాంతము విని సంతుష్టమనస్కుడైన రాజవాహ నుడు తనయొక్కయు, సోమదత్తుని యొక్కయు వృత్తాంతము నాతనికి

మహాకాళేశ్వరారాధనాన్తరం భవద్వల్లభాం సపరికరాం నిజకటకం ప్రాపయ్యాఽగచ్ఛే' తి నియుజ్య, పుష్పోద్భవేన సేవ్యమానో భూస్వర్గాయమాన మవన్తికాపురం వివేశ. త 'త్రాయం మమ స్వామికుమార' ఇతి బన్ధుపాలాదయే బన్ధుజనాయ కథయిత్వా తేన రాజవాహనాయ బహువిధాం సపర్యాం కారయన్, 'సకలకలాకుశలో' మహీసుర ఇతి పురి ప్రకటయన్ పుష్పోద్భవో ఽముష్య రాజ్ఞో మజ్జనభోజనాదిక మనుదినం స్వమందిరే కారయామాస.

ఇతి శ్రీమదాచార్య మహాకవి దణ్డినః కృతౌ దశకుమారచరితే
పూర్వపీఠికాయాం సోమదత్తచరితం నామ
చతుర్థ ఉచ్ఛ్వాసః.

---

నివేదించి, ''సోమదత్తా ! మహాకాళేశ్వరుని ఆరాధనము ముగిసిన పిదప సపరివారయైన నీ ప్రియురాలిని నిజనివాసమునందు విడిచి రమ్మని'' నియోగించి పుష్పోద్భవునిచే సేవింపబడుచున్నవాడై భూలోకస్వర్గము వలె నున్న అవంతికాపురము ప్రవేశించెను. ఈతడు నాప్రభువు కుమారుడు అని అచ్చట బంధుపాలుడు మొదలగు బంధుజనులకు చెప్పి, వానిచే రాజవాహనునకు బహువిధమైన సపర్యను చేయించి, ''మహీసురుడు. సకల కళాకుశలుడని'' పురమున ప్రకటించి, పుష్పోద్భవుడు ఆ రాజునకు స్నాన భోజనాదికము ప్రతి దినము తన మందిరమునందే ఏర్పాటు గావించెను.

అవన్తిసున్దరీపరిణయో నామ

# పఞ్చమోచ్ఛ్వాసః

అథ మీనకేతనసేనానాయకేన, మలయగిరిమహీరుహ నిరన్తరా వాసిభుజఙ్గమముక్తావశిష్టేనేవ సూక్ష్మతరేణ, ధూత హరిచన్దనపరిమళ భరేణేవ మన్దగతినా, దక్షిణానిలేన వియోగి హృదయస్థం మన్మథానల ముజ్జ్వలయతా, సహకార కిసలయ మకరందాస్వాదసరక్తకణ్ఠానాం మధుకరకలకణ్ఠానాం కాకలీకలకలేన దిక్చక్రం వాచాలయతా, మానినీ మానసోత్కలికా ముపనయన్, మాకన్ద సిన్దువార రక్తాశోక కింశుక

---

# దశకుమారచరిత్రము

## అవంతి సుందరీ పరిణయము అను పంచమోచ్ఛ్వాసము

అంత మన్మథుని సేనానాయకుడును, మలయ పర్వతప్రాంత వృక్షము లందు ఎల్లవేళల నివసించు సర్పములచే త్రావబడి విడువబడిమిగిలినదాయన్నట్లు స్వలమైనదియు, కదలింపబడిన గంధపు చెట్ల పరిమళ భారము చేతనో యన్నట్లు మందగమనము కలదియునైన దక్షిణవాయువుచే వియో గుల హృదయములందలి మదనాగ్నిని ప్రజ్వలింపజేయుచు, గున్నమామిడి చెట్లయందలి చిగురుటాకులను, మకరందమును ఆస్వాదించుటచే రక్త కం ఠములైన తుమ్మెదల యొక్కయు, కోయిలల యొక్కయు కాకలీ కలకలముతో దిక్చక్రము నినదింపజేయుచు, యువతుల మానసమునందలి యుత్కంఠమును పెంచుచు, మాకందము, సింధువారము, రక్తాశోకము, పలాశము, తిలకము మొద

తిలకేషు కలికా ముత్పాదయన్, మదనమహోత్సవాయ రసికమనాంసి సముల్లాసయన్, వసన్తసమయ స్సమాజగామ. తస్మిన్నతిరమణీయే కాలేఽవన్తిసున్దరీ నామ మానసారనన్దినీ ప్రియవయస్యయా బాలచంద్రికయా సహ నగరోపాన్తరమ్యోద్యానే విహారోత్కణ్ఠయా పౌరసున్దరీసమవాయసమన్వితా కస్యచిచ్చూతపోతకస్య చ్ఛాయాశీతలే గన్ధకుసుమహరిద్రాక్షతచీనామ్బరాది నానా విధేన పరిమళద్రవ్యనికరేణ మనోభవ మర్చయంతీ రేమే.

తత్ర రతిప్రతికృతి మవంతిసున్దరీం ద్రష్టుకామః కామ ఇవ వసన్తసహాయః పుష్పోద్భవసమన్వితో రాజవాహనస్తదుపవనం ప్రవిశ్య, తత్రతత్ర మలయమారుతాన్దోళితశాఖా నిరన్తర సముద్భిన్న కిసలయ కుసుమ ఫలసముల్లసితేషు రసాలతరుషు కోకిలకీరాళి

---

లగు వృక్షములందు మొగ్గల నుదయింప జేయుచు, మన్మథోత్సవమునకై రసికుల మనస్సుల నుల్లసింపజేయుచు వసంత సమయ మాసన్న మాయెను. అతి సుందరమగు నా సమయమున నవంతి సుందరియను పేరుగల మానసార నందిని ప్రియస్నేహితురాలగు బాలచంద్రికతో కూడి నగరసమీపమునందలి నందనోద్యానమున విహరించు కోరికతో పుర సుందరీ సమూహముతో కూడినదై గున్నమావి నీడచే చల్లగానున్న యొకానొక ప్రదేశమున గంధము, పుష్పములు, పచ్చని యక్షతలు, చీనాంబరాది నానావిధ పరిమళ ద్రవ్యసమూహముతో మన్మథు నర్చించుచు వినోదించెను. అచ్చట రతీదేవి ప్రతిబింబము వలె నున్న అవంతి సుందరిని చూడ గోరిన వసంత సహాయకుడైన మన్మథుడు వలె పుష్పోద్భవసహితుడైన రాజవాహను డా విహారవనమునందు ప్రవేశించి అచ్చటచ్చట మలయానిలముచే ఊగింపబడిన శాఖలందు నిరంతరముగా వికసించు చిగురుటాకులతో, పుష్పములతో, ఫలములతోను ఉల్లసితమైన మామిడి చెట్లయందు కోకిలల, చిలుకల, తుమ్మెదల మధురాలాపములను విని విని, వికసించిన ఇందీవర, కల్హార, కైరవ, కమల సముదాయమున క్రీడించుటలో

కుల మధురాలాపాన్ శ్రావంశ్రావం, వికసితేన్దీవరకల్హార కైరవరాజీవ రాజీ కేళీలోల కలహంససారస కారణ్డవ చక్రవాక చక్రవాల కలకల వ్యాకుల విమలశీతల సలిల లలితాని సరాంసి దర్శందర్శం, అమన్ద లీలయా లలనాసమీప మవాప. బాలచన్ద్రికయా నిర్భయ్ 'మాగమ్యతా' మితి హస్తసంజ్ఞయా సమాహూతో నిజతేజోజితపురుహూతో రాజవాహనో ఽవన్తిసున్దర్యాః అన్తికం జగామ. యా వసన్తసహాయేన సముత్సుకతయా రతేః కేళీశాలభఞ్జికావిధిత్సయా కఞ్చన నారీవిశేషం విరచయ్యాఽఽత్మనః క్రీడాకాసార శారదారవిన్ద సౌన్దర్యేణ పాదద్వయం, ఉద్యానదీర్ఘికా మత్తమరాళికాగమన రీత్యా లోలాలసగతివిలాసం, తూణీరలావణ్యేన జఙ్ఘే, కదళీ లాలిత్యేన మనోజ్ఞ మూరుయుగం, జైత్రరథ చక్ర చాతుర్యేణ

---

లీనమైన కలహంసల, సారసముల, కారండవముల, చక్రవాకముల, గుంపులకం కలనాదములచే వ్యాకులమైన నిర్మల, శీతల జలముచే సుందరమగు సరస్సులను చూచిచూచి, అమందవిలాసముతో నా యువతి సమీపమును చేరెను. బాల చంద్రిక చేత నిర్భయముగ "నిటు వత్తురుగాక" యని హస్త సంజ్ఞచే నాహ్వా నింపబడి తన తేజముచే జయింప బడిన యింద్రుడుగల రాజవాహనుడు అవంతి సుందరి దరిని జేరెను. ఆమె వసంత సహాయుడైన మన్మథుని చేత ఔత్సుక్యముతో రతీదేవికి ఆటబొమ్మను చేయవలయు నను కోరికచే ఒక స్త్రీ రత్నమును సృష్టించి, తన క్రీడా సరస్సు నందలి శారదారవింద సౌందర్యముతో పాదముల జంటను, ఉద్యానవన మందలి దీర్ఘికలలో మదించిన రాజహంస నడకల రీతితో లోలము, అలసమునైన గతి విలాసమును, అమ్ములపొది సౌందర్యముతో పిక్కలను, అరటి స్తంభముల మృదుత్వముతో మనోహరమైన తొడలజంటను, జైత్రరథ చక్రముల చాతుర్యముతో నిండైన జఘనమును, కొంచెము వికసించిన విలాసయుక్తమైన కర్ణభూషణమగు కలువ

ఘనం జఘనం, కించిద్వికసల్లీలావతంసకహ్లార కోరకకోటరాను
వృత్త్యా గంగావర్తసనాభిం నాభిం, సౌధారోహణ పరిపాట్యా
వళిత్రయం మౌర్వీమధుకరపఙ్క్తినీలిమలీలయా రోమావళిం,
పూర్ణసువర్ణకలశశోభయా కుచద్వన్ద్వం, లతామణ్డపసౌకుమార్యేణ
బాహూ, జయశఙ్ఖాభిఖ్యయా కణ్ఠం, కామికర్ణపూరసహకారపల్లవ
రాగేణ ప్రతిబిమ్బీకృతబిమ్బం రదనచ్ఛదం, బాణాయమానపుష్ప
లావణ్యేన శుచిస్మితమ్, అగ్రదూతికాకలకణ్ఠికాకలాలాపమాధుర్యేణ
వచనజాతం, సకలసైనికనాయక మలయమారుతసౌరభ్యేణ నిశ్వాస
పవనం, జయధ్వజమీనదర్పేణ లోచనయుగళం, చాపయష్టిశ్రియా
భ్రూలతే, ప్రథమసుహృద స్సుధాకర స్యాపనీతకలఙ్కయా కాంత్యా
వదనం, లీలామయూరబర్హభంగ్యా కేశపాశం చ, విధాయ, సమస్త
మకరన్దకస్తూరికా సమ్మిశ్రేతేన మలయజరసేన ప్రక్షాళ్య, కర్పూర

---

పూమొగ్గ నడిమి భాగపు సామ్యముతో గంగానది యందలి సుడివంటి నాభిని,
భవనము నధిరోహించు సోపానముల వరుసతో వళిత్రయమును, అల్లెత్రాటి
తుమ్మెదల సమూహముల నలుపుదనపు విలాసముతో రోమావళిని, నిండిన
కనక కలశముల శోభతో కుచముల జంటను, లతా మండపముల సుకుమార
తతో బాహువులను, జయశంఖపు శోభతో కంఠమును, కాముకుల కర్ణాభరణ
మగు తీయమావి చిగురుటాకుల ఎఱుపుదనముతో ప్రతిబింబముగా చేయబడిన
దొండపండు వంటి అధరమును, బాణములగుచున్న అరవిందాశోకాది
పుష్పముల సౌందర్యముతో శుద్ధమైన చిరునవ్వును, అగ్రదూతియైన కోకిల
కూజిత మాధుర్యముతో మాటలను, సమస్త సైనికులకు నాయకుడగు
మలయవాయువు సుపరిమళముతో నిశ్వాసవాయువును, విజయపతాక మం
దలి చేపయొక్క గర్వముతో కన్నుల జంటను, చాప యష్టిశోభతో తీగవంటి
కనుబొమ్మలను, ప్రథమ మిత్రుడైన చంద్రుని కళంకము లేని కాంతితో
ముఖమును, పెంపుడు నెమిళ్ళ భంగిమతో కేశపాశమును కల్పించి, సమస్త
మైన మకరందములతో, కస్తూరికలతో మిశ్రితమై చందనరసముచే కడిగి
కర్పూర పరాగముచే తుడిచి, నిర్మింపబడినదో యనునట్లు ప్రకాశించెను.

పరాగేణ సమ్మృజ్య, నిర్మితేవ రరాజ. మూర్తిమతీవ లక్ష్మీ ర్మాల
వేశకన్యకాఽఽస్తే. సైవారాధ్యమానం సంకల్పితవరప్రదానాయాఽవిర్భూ
తం మూర్తిమన్తం మన్మథ మివ త మాలోక్య మన్దమారుతాన్దో
ళితలతేవ మదనావేశవతీ చకమ్పే. తదను క్రీడావిస్రమ్భాన్నివృత్తా
లజ్జయా కాని కాన్యపి భావాన్తరాణి వ్యధత్త. 'లలనాజనం
సృజతా విధాత్రా నూన మేషా ఘుణాక్షరన్యాయేన నిర్మితా. నోచే
దబ్జభూ రేవంవిధనిర్మాణ నిపుణో యది స్యాత్, తర్హి తత్సమాన
లావణ్యా మన్యాం తరుణీం కిం న కరోతి?' ఇతి సవిస్మయానురాగం
విలోకయత స్తస్య సమక్షం స్థాతుం లజ్జితా సా కించి త్సఖీజనాన్త
రితగాత్రీ తన్నయనాభిముఖైః కించి దాకుఞ్చితైః రఞ్చితభ్రూ
లతైః రపాఙ్గవీక్షితై రాత్మనో మనఃకురఙ్గ స్యానాయమానలావణ్యం
రాజవాహనం విలోకయ న్త్యతిష్ఠత్. సోఽపి తస్యా స్తదోత్పాదిత

---

స్వరూపమును ధరించిన లక్ష్మివలెనున్న యా మాళవరాజు కూతురు తనచే
నారాధింపబడుచు, సంకల్పించిన వరముల నిచ్చుటకై సాక్షాత్కరించిన
మూర్తిమంతుడగు మన్మథుడా యన్నట్లున్న యాతనింగాంచి, పిల్లగాలులచే
కదల్చబడిన తీగవలె మదనునిచే నావేశింపబడినదై చలించెను. తదుపరి
క్రీడా విస్రంభము నుండి మరలినదై సిగ్గుచే ఏవేవో భావాంతరములను ధరిం
చెను. "స్త్రీ జనమును సృష్టించు బ్రహ్మదేవునిచే నిశ్చయముగా నీమె ఘుణా
క్షర న్యాయముచే సృష్టింపబడినది. అట్లుగాక కమలసంభవుడు ఈ విధమైన
సౌందర్య నిర్మాణమున నిపుణుడే అయినచో ఆమెతో సమానమైన లావణ్యము
గల మరియొక యువతిని ఏల సృజింపడు" అని ఆశ్చర్యానురాగములతో
చూచుచున్న అతని సమక్షమున నిలుచుటకు సిగ్గిలిన యామె కొంచెము చెలి
కత్తెల మరుగున నిలచిన శరీరముగలదై అతని నేత్రముల కభిముఖములై
కొంచెము ముడిచిన భ్రూలతలతో నొప్పిన క్రీగంటి చూపులతో తన మనస్స
నెడి లేడికి వలయగుచున్న సౌందర్యముగల రాజవాహనుని చూచుచు నిలిచెను.
అతడును ఆమె నుండి యప్పుడు ఉత్పన్నములైన భావరసములయొక్క

భావరసానాం సామగ్ర్యా ల్లబ్ధబలస్యేవ విషమశరస్య శరవ్యాయమానమానసో బభూవ.

సా మనసీత్థ మచిన్తయత్. 'అనన్యసాధారణసౌన్దర్యేణానేన కస్యాం పురి భాగ్యవతీనాం తరుణీనాం లోచనోత్సవః క్రియతే? పుత్త్రరత్నేనామునా పురంధ్రీణాం పుత్త్రవతీనాం సీమన్తినీనాం కా నామ సీమన్తమౌక్తికీక్రియతే? కాఽస్యదేవీ? కిమత్రాగమనకారణ మస్య? మన్మథో మా మపహసితనిజలావణ్య మేనం విలోకయంతీ మసూయయేవాతిమాత్రం మథ్నన్నిజనామ సాన్వయం కరోతి. కిం కరోమి? కథ మయం జ్ఞాతవ్యః?' ఇతి. తతో బాలచన్ద్రికా తయో రితరేతరరాగవృత్తిం భావవివేకై ర్జ్ఞాత్వా, కాంతాసమాజసన్నిధౌ రాజనన్దనోదన్తస్య సమ్య గాఖ్యాన మనుచిత మితి లోక సాధారణై ర్వాక్యై రభాషత: 'భర్తృదారికే! అయం సకలకళా ప్రవీణో దేవతా

---

సామగ్రిచేత పొందబడిన బలముగలవాడా యన్నట్లున్న పంచబాణునకు బాణ లక్ష్య భూతమైన మానసముగల వాడయ్యెను.

ఆ యవంతి సుందరి మనసులో నిట్లాలోచించెను. "అనన్యసాధారణమైన ఈ సౌందర్యముచేత ఏపురము నందలి భాగ్యవతులైన యువతులకు కన్నుల పండుగ జేయబడుచున్నదో! పుత్రరత్నమగు నీతనిచే కుటుంబినులు పుత్రవతులునైన స్త్రీలలో నెవతె శిరోమణిగా జేయబడుచున్నదో! ఈతని పట్టపు రాణి యెవతెయో! ఇచ్చటి కీతని రాకకు కారణమేమో! పరిహసింప బడిన స్వీయలావణ్యముగల ఇతనిని చూచుచున్న నన్ను అసూయచేతవలె మన్మథుడు మిక్కుటముగా మథించుచు తన నామధేయమును సార్థకమొనరించుకొనుచున్నాడు. ఏమిచేయుదును? ఇతడెట్లు తెలియదగినవాడు?"

అంతట బాలచంద్రిక వారి పరస్పర ప్రేమను భావ వివేచనములచే పసికట్టి స్త్రీ సమాజ సమక్షమున రాజకుమారుని గాథను వివరించుట యనుచితమని లోకసామాన్యములైన మాటలతో నిట్లు సంభాషించెను- "భర్తృదారికా!

సాన్నిధ్యకరణః, ఆహవనిపుణో, భూసురకుమారో, మణిమన్త్రౌషధిజ్ఞః, పరిచర్యార్హో భవత్యా, పూజ్యతామ్' ఇతి. తదాకర్ణ్య నిజమనోరథ మనువదన్త్యా బాలచన్ద్రికయా సంతుష్టాన్తరంగా తరంగావలీమందానిలేనేవ సంకల్ప జేనాఽకులీకృతా రాజకన్యా జిత మారం కుమారం సముచితాసనాసీనం విధాయ సఖీహస్తేన గన్ధ కుసుమాక్షత ఘనసారతామ్బూలాది నానావస్తునిచయేన పూజాం తస్మై కారయామాస.

రాజవాహనోఽప్యేవ మచిన్తయత్ : 'నూన మేషా పూర్వ జన్మని మే జాయా యజ్ఞవతీ. నో చే దేతస్యా మేవంవిధో ఽను రాగో మన్మనసి న జాయేత. శాపావసానసమయే తపోనిధే ర్జాతి

---

ఇతడు సమస్త కళాకోవిదుడు, దేవతలను సన్నిహితులను గావించుకొన్నవాడు, యుద్ధమునందు నిపుణుడు, మణి మంత్రౌషధములనెఱిగిన వాడునగు బ్రాహ్మణ కుమారుడు. నీచే పూజింపబడ నర్హుడు. పూజింపబడుగాక.'' అదివిని తన కోరిక ననుసరించి పలుకుచున్న బాలచంద్రికచే సంతసించిన మనస్సుగలదై అలలపై నుండి వచ్చు పిల్లగాలుల చేతవలె మన్మథునిచే వ్యాకులపరచబడిన రాజకన్యక, జయించిన మన్మథుడుగల రాజకుమారుని తగిన యాసనమునం దాసీనుని గావించి, చెలిచేత గంధము, పుష్పములు, అక్షతలు, కర్పూరము, తాంబూలము మొదలుగా గల వివిధములైన వస్తుజాతముతో నాతనికి పూజ చేయించెను.

రాజవాహనుడును ఇట్లాలోచించెను– ''నిశ్చయముగా నీమె పూర్వ జన్మము నందలి నా భార్య యజ్ఞవతియే. కానిచో నీమెయం దీ విధమైన యను రాగము నామనస్సున కలుగదు. తపోనిధి యొక్క శాపము ముగియు సమ

స్మరత్వ మావయో స్సమాన మేవ. తథాఽపి కాలజనితవిశేష సూచకై ర్వాక్యై రస్యా జ్ఞాన ముత్పాదయిష్యామి' ఇతి. తస్మిన్‌సమయే కోఽపి మనోరమో రాజహంసః కేళీవిధిత్సయా తదుపకణ్ఠ మగ మత్. సముత్సుకయా రాజకన్యయా మరాళగ్రహణే నియుక్తాం బాల చన్ద్రికా మవలోక్య 'సముచితో వాక్యావసర ఏష' ఇతి సంభాషణ నిపుణో రాజవాహన స్సలీల మలపత్ : "సఖి ! పురా శామ్బో నామ కశ్చి న్మహీవల్లభో మనోవల్లభయా సహ విహారవాఞ్ఛయా కమలాకర మవాప్య, తత్ర కోకనదకదమ్బసమీపే నిద్రాధీనమానసం రాజహంసం గృహీత్వా, బిసగుణేన తస్య చరణయుగళం నిగడ యిత్వా. కాంతాముఖం సానురాగం విలోకయ న్మన్దస్మితవికసితైక కపోలమణ్డల స్తా మభాషత : 'ఇన్దుముఖి ! మయా బద్ధో మరాళ

---

యమునందు పూర్వజన్మస్మరణము మా యిరువురకు సమానమే. ఐనను ఆ సమయమున జరిగిన విశేషములను సూచించు వాక్యములచే నీమెకప్పటి జ్ఞానము నుదయింప జేయగలను.'' ఆ సమయమునందే మనోహరమైన ఒక రాజహంస క్రీడించు కోరికతో ఆమె సమీపమునకు వచ్చెను. ఉత్సుకతగల రాజకన్యకచే హంసను పట్టుకొనుటయందు నియోగింపబడిన బాలచంద్రికను చూచి 'ఇది మాటాడుటకు దగిన సమయమని' సంభాషణలో నిపుణుడైన రాజవాహనుడు సవిలాసముగ నిట్లనెను-''సఖీ ! పూర్వము శాంబుడను పేరుగల ఒక మహా రాజు ప్రియురాలితో కూడి విహరించు కోరికతో నొక సరోవరమునుచేరి అందు ఎఱ్ఱకలువల సమీపమున నిద్రాధీనమైన మానసముగల ఒక రాజహం సను పట్టుకొని తామరతూడు దారముతో దాని పాద యుగళమును కట్టి ప్రియు రాలి ముఖమును సానురాగముగ చూచుచు, చిరునవ్వులతో వికసించిన కపోల భాగములు గలవాడై ఆమెతో ఇట్లు పలికెను- 'చంద్రముఖీ ! నాచే బంధింప బడిన ఈ హంసము శాంతుడైన మునివలె నున్నది. ఇది స్వేచ్ఛగా వెళ్ళు

శ్శాన్తో మునివ దాస్తే; స్వేచ్ఛయా ఽనేన గమ్యతామ్.' ఇతి. సో ఽపి రాజహంస శ్శామ్బ మశపత్: 'మహీపాల! య దస్మి న్నమ్బుజషణ్డే ఽనుష్ఠానపరాయణతయా పరమానన్దేన తిష్ఠన్తం నైష్ఠికం మా మకారణం రాజ్యగర్వే ణావమానితవానసి, త దేతత్పాపేన రమణీవిరహసంతాప మనుభవ.' ఇతి. విషణ్ణవదన శ్శామ్బో జీవితేశ్వరీవిరహ మసహిష్ణు ర్భూమౌ దండవ త్ప్రణమ్య, సవినయ మభాషత: 'మహాభాగ! య దజ్ఞానే నాకరవం, తత్ క్షమ స్వేతి. స తాపసః కరుణాకృష్టచేతా స్త మవదత్: 'రాజన్! ఇహ జన్మని భవత శ్శాపఫలాభావో భవతు; మద్వచనస్యామోఘతయా భావిని జననే శరీరాన్తరగతాయా అస్యా స్సరసిజాక్ష్యా రసేన రమణో భూత్వా, ముహూర్తద్వయం మచ్చరణయుగళబన్ధన

---

గాక.' ఆ రాజహంసము కూడ శాంబు నిట్లు శపించెను. 'మహారాజ! ఈ కమలముల గుంపులో అనుష్ఠానమం దాసక్తిచే పరమానందముతో నున్న నిష్ఠగలవాడనైన నన్ను అకారణముగ రాజ్య గర్వముచే ఏకారణమున అవమానించితివో ఆ కారణమున ఆ పాపముచే ప్రియురాలి విరహబాధ ననుభవింపుము.' విషణ్ణవదనుడైన శాంబుడు ప్రాణేశ్వరీ విరహమును సహింపనివాడై భూమిపై సాష్టాంగ దండ ప్రణామ మాచరించి సవినయముగ నిట్లు పలికెను– "మహాభాగ! అజ్ఞానముచే ఏది చేసితినో దానిని క్షమింపుము." ఆ తాపసుడు కరుణాధీన చిత్తుడై శాంబునితో నిట్లు పలికెను– "రాజా! ఈ జన్మలో నీకి శాప ఫలము లేకుండుగాక! నామాట అమోఘమగుటచే రాబోవు జన్మమందు మరియొక శరీరమును పొందిన ఈ కమలాక్షికి అనురాగముచే ప్రియుడవై, రెండుక్షణములు నాపాదయుగళమును బంధించుటచేత రెండు మాసములు గొలుసులచే బంధింపబడిన చరణములు గలవాడవై, ప్రియురాలి విరహబాధ ననుభవించి, అనంతరము బహుకాలము ప్రియురాలితో పాటు

కారితయా మాసద్వయం శృఙ్ఖలానిగళితచరణో రమణీవియోగ విషాద మనుభూయ, పశ్చా దనేక కాలం వల్లభయా సహ రాజ్య సుఖం లభస్వ' ఇతి. తదను జాతిస్మరత్వమపి తయోరన్వగృహ్ణాత్. తస్మా న్మరాళబన్ధం న కరణీయం త్వయా." ఇతి. సాఽపి ధర్త్రి దారికా తద్వచనాకర్ణనాభిజ్ఞాత స్వపురాతనజననవృత్తాంతా, నూన మయం మత్ప్రాణవల్లభ ఇతి మనసి జానతీ రాగపల్లవితమానసా సమందహాస మవోచత్ : 'సౌమ్య ! పురా శామ్బో యజ్ఞవతీసందేశ పరిపాలనాయ తథావిధం హంసబంధన మకార్షీత్. తథాహి, లోకే పండితా అపి దాక్షిణ్యే నా కార్యం కుర్వంతి.' ఇతి. కన్యాకుమారా వేవ మన్యోన్యపురాతనజనననామధేయే పరిచితే పరస్పరజ్ఞానాయ సాభిజ్ఞ ముక్త్వా, మనోజరాగ పూర్ణమానసౌ బభూవతుః.

---

రాజ్య సుఖమును పొందుము.'' తదుపరి వారికి పూర్వజన్మస్మృతిని కూడ అనుగ్రహించెను. అందువలన నీచే హంస బంధనము చేయబడ గూడనిది.'' ఆ రాజకన్యక కూడ అతని మాటలు వినుటచే తెలిసికొనబడిన తన పూర్వ జన్మ వృత్తాంతము గలదై, ''నిశ్చయముగా నీతడు నా ప్రాణవల్లభు''డని మనస్సునం దెఱింగినదై, అనురాగముచే చిగురించిన మనస్సుగలదై, మంద హాసముతో నిట్లు పల్కెను- "ఓ సౌమ్యుడా ! పూర్వము శాంబుడు యజ్ఞవతి యొక్క ఆజ్ఞను పరిపాలించుటకై ఆవిధముగ హంస బంధనము గావించెను. అది యుక్తమే కదా ! లోకమున పండితులు కూడ దాక్షిణ్యమున చేయదగని కార్యమును కూడ జేయుదురు.'' ఈ విధముగా రాజకన్యకయు రాజకుమా రుడును ఒకరి నొకరు తెలిసికొనుటకై గుర్తుగా పరిచితములైన పూర్వ జన్మ మందలి నామధేయములను పరస్పరము చెప్పికొని మదనరాగముచే నిండిన మనస్సు గలవారైరి.

తస్మిన్నవసరే మాలవేన్ద్రమహిషీ పరిజనపరివృతా దుహితృ కేళివిలోకనాయ తద్దేశ మవాప. బాలచన్ద్రికా తు తాం దూరతో విలోక్య ససంభ్రమం రహస్యనిర్భేదభియాహ స్తసంజ్ఞయా పుష్పో ద్భవసేవ్యమానం రాజవాహనం వృక్షవాటికా న్తరితగాత్ర మక రోత్. సా మానసారమహిషీ సఖీ సమేతాయా దుహితు ర్నానా విధాం విహారలీలా మనుభవ న్తీ క్షణం స్థిత్వా దుహిత్రా సమన్వితా నిజాగారగమనాయోద్యుక్తా బభూవ. మాతర మనుగచ్ఛ న్త్యవ న్తిసున్దరీ 'రాజహంసకుల తిలక ! వాఞ్ఛయా కేళీవనే మద న్తిక మాగతం భవ న్త మకాండ ఏవ విసృజ్య న మయా సముచితమితి జనన్యను గమనం క్రియతే. తదనేన భవన్మనోనురాగోఽన్యథా మాభూత్.' ఇతి మరాళ మివ కుమార ముద్దిశ్య సముచితాలాపకలాపం వద న్తీ

---

ఆ సమయమున మాళవరాజు పట్టపురాణి పరిజనముతో కూడి, కుమా ర్తె ఆటలను చూచుటకై యా ప్రదేశమును జేరెను. బాలచంద్రిక యామెను దూరము నుండియే చూచి ససంభ్రమముగా, రహస్య భేదనమగునను భయ ముచే, హ స్త సంజ్ఞ ద్వారా పుష్పోద్భవునిచే సేవింపబడుచున్న రాజవాహ నుని వృక్షవాటికలో లీనమైన తనువు గల వానిగా నొనర్చెను. ఆ మానసారుని పట్టపురాణి చెలిక త్తెలతో కూడిన పుత్రిక యొక్క బహువిధ విహార విలాసము ననుభవించుచు, క్షణకాలము నిలిచి పుత్రికతో కూడినదై స్వగృహమునకు వెళ్ళుటకై యుద్యు క్తయయ్యెను. తల్లి ననుసరించుచుండిన యవంతి సుందరి 'ఓ రాజహంస కులశ్రేష్ఠ ! కోరికతో క్రీడావనమున నా చేరువకు వచ్చిన నిన్ను అకారణముగనే వదలి తల్లితో వెళ్ళుట సముచితమని నేను చేయుట లేదు. కనుక ఇందుచే నీ మానసికానురాగము అన్యథా గాకుండు గాక' అని హంసను ఉద్దేశించినట్లు రాజకుమారు నుద్దేశించి తగిన మాటలు పలుకుచు, మాటి మాటికి వెనుదిరిగి దీన నయనయై యాతని ముఖము చూచుచున్నదై తన మందిరమునకు వెళ్ళెను.

పునః పునః పరివృత్త్య దీననయనా వదనం విలోకయన్తీ నిజ మన్దిర మగాత్.

తత్ర చ హృదయవల్లభకథాప్రసంగే బాలచన్ద్రికా కథిత తదన్వయనామధేయా, మన్మథబాణపతనవ్యాకులమానసా విరహవేద నయా, బహుళపక్షశశికళేవ క్షామక్షామా, ఆహారాదిసకలవ్యాపారం పరిహృత్య రహస్యమన్దిరే మలయజ రసక్షాళితపల్లవకుసుమ కల్పిత తల్పతలాయత్తతనులతా బభూవ. తత్ర తథావిధావస్థా మనుభ వన్తీం మన్మథానలసంతప్తాం సుకుమారీం నిరీక్ష్య ఖిన్నో వయస్యా గణః కాఞ్చనకలశ సంచితాని హరిచన్దనోశీరఘనసారమిళితాని తదభి షేకకల్పితాని సలిలాని, బిసతన్తుమయాని వాసాంసి చ, నళినీదళ మయాని తాలవృంతాని చ, సంతాపహరణాని బహూని సంపాద్య,

---

అచ్చట హృదయప్రియుని గూర్చిన కథా ప్రసంగమున బాలచంద్రి కచే ఆతని వంశనామధేయములు చెప్పబడినదై, మన్మథుని బాణములు పడుటవలన వ్యాకులమైన చిత్తము గలదై, వియోగ బాధతో కృష్ణపక్షపు నందలి చంద్రకళవలె మిగుల కృశించినదై, ఆహారము మొదలగు సమస్త వ్యాపారము విడనాడి, రహస్య మందిరమున చందన రసముచే కడుగబడిన చిగురుటాకుల చేతను, కుసుమములచేతను చేయబడిన తల్పమునం దుంచ బడిన తీగవంటి శరీరముగల దయ్యెను.

అచ్చట ఆ విధమైన అవస్థ ననుభవించుచు, మన్మథాగ్నిచే పరితప్త యైన, కోమలియైన కుమారిని చూచి, దుఃఖము నొందిన చెలికత్తెల సమూ హము బంగరు కలశములందుంచబడి, హరిచందనము, ఉశీరము, కర్పూర ములతో మిళితములై, యామె స్నానమునకై ఏర్పరుపబడిన జలములను, తామరతూండ్ల దారముతో చేయబడిన వస్త్రములను, తామరరేకులతో చేయ బడిన వీవనలను మరియు సంతాపమును పోగొట్టు పెక్కుసాధనములను సంపా

తస్యా శ్శరీర మశిశిరయత్, తదపి, శీతలోపచరణం సలిల మివ తప్తతైలే తదఙ్గే దహన మేవ సమన్తా దావిశ్చకార. కింకర్తవ్య తామూఢాం విషణ్ణాం వాలచంద్రికా మీషదున్మీలితేన కటాక్షవీక్షితేన బాష్పకణాకులేన విలోక్య విరహానలోష్ణనిశ్వాసగ్లపితాధరయా నతాంగ్యా శనై శ్శనై స్సగద్గదం వ్యాలాపి : "ప్రియసఖి ! కామః కుసుమాయుధః పఞ్చబాణ ఇతి నూన మసత్య ముచ్యతే. య దియ మహ మసంఖ్యై రిషుభి రనేన హన్యే. సఖి ! చంద్ర మసం బడబానలా దపి తాపకరం మన్యే. య దస్మి న్నన్తః ప్రవిశతి శుష్యతి పారావారః, సతి నిర్గతే తదైవ వర్ధతే. దోషా కరస్య దుష్కర్మ కిం వర్ణ్యతే మయా ? య దనేన నిజసహోద ర్యాః పద్మాలయాయా గేహభూత మపి కమలం హన్యతే. విరహా

---

దించి, ఆమె శరీరమును చల్లబరచిరి. కాగిన నూనెయందు నీటి వలె ఆ శీతలోపచారము కూడ ఆమె శరీరమునం దంతటను మంటనే పుట్టించెను. కిం కర్తవ్యతామూఢయై, దుఃఖితయైయున్న బాలచంద్రికను కొంచెము తెరువ బడి బాష్పకణములచే వ్యాకులమైన కటాక్ష వీక్షణముచే చూచి, విరహాగ్ని వలన కలిగిన వేడి నిశ్వాసములచే వాడిన పెదవిగల ఆ లతాంగి మెల్ల మెల్లగా సగద్గదముగ నిట్లు పలికెను_ "ప్రియసఖీ ! మన్మథుడు పుష్పబాణుడనియు, పంచబాణుడనియు నిశ్చయముగ నసత్యము పలుకబడుచున్నది. ఏలనన నేను మన్మథునిచే లెక్కలేనన్ని బాణములతో కొట్టబడుచున్నాను. చెలీ ! చంద్రుని బడబానలము కంటెను తాపకరునిగా తలంచుచున్నాను. ఏలనన ఎప్పుడీతడు లోనికి ప్రవేశించునో అప్పుడు సముద్రము శుష్కించును. బయటికిరాగా అప్పుడే వృద్ధిజెందును. దోషాకరుడగు చంద్రుని చెడుకర్మను నేనేమని వర్ణింతును ? ఏలనన, నీతనిచే తన సహోదరియగు లక్ష్మీదేవికి గృహము వంటిదైన కమలముగూడ నాశనము జేయబడుచున్నది. విరహాగ్నివలన సంతప్తమైన హృదయస్పర్శచే వెచ్చగా జేయబడిన మలయవాయువు నిశ్చయ

నల సంతప్తహృదయస్పర్శేన నూన ముష్ణీకృతః స్వల్పీభవతి మల యానిలః. నవపల్లవకల్పితం తల్పమిద మనంగాగ్ని శిఖాపటల మివ సంతాపం తనోస్తనోతి. హరిచన్దన మపి పురా నిజయష్టిసంశ్లేషవ దురగరదనలిప్తోల్బణగరలసంకలిత మివ తాపయతి శరీరమ్. తస్మా దలమల మాయాసేన శీతలోపచారేణ. లావణ్యజితమారో రాజకు మార ఏ వాగదఙ్కారో మన్మథ జ్వరాపహరణే. సోఽపి లబ్ధుమ శక్యో మయా. కిం కరోమి ?" ఇతి. బాలచంద్రికా మనోజజ్వరపరమ కాష్ఠాం గతాం కోమలాంగీం తాం రాజవాహనలావణ్యాధీనమానసా మనన్యశరణా మవేక్ష్యాఽత్మ న్యచిన్తయత్ : 'కుమార స్సత్వర మానే తవ్యో మయా. నోచే దేనాం స్మరణీయాం గతిం నేష్యతి మీన కేతనః. తత్రోద్యానే కుమారయో రన్యోన్యావలోకనవేలాయా మస

---

ముగా స్వల్పమగుచున్నది. క్రొంగ్రొత్త చిగురుటాకులతో జేయబడిన యీ తల్పము కూడ మన్మథాగ్ని జ్వాలల సముదాయమువలెశరీరమునకు సంతాపము గూర్చుచున్నది. హరిచందనము గూడ పూర్వము తనకట్టెతో సంపర్కము గల సర్పముల దంష్ట్రలచే పూయబడిన తీవ్రమైన గరళముతోగూడినదాని వలె శరీరమును తపింపజేయుచున్నది. అందువలన చాలు చాలు నీ ప్రయాస యైన శీతలోపచారము. సౌందర్యముచే జయింపబడిన మన్మథుడుగల ఆ రాజ కుమారుడే మన్మథజ్వరమును పోగొట్టుటలో వైద్యుడు. అతడును నాకు పొంద శక్యముకాని వాడు. ఏమిచేయుదును ?''

బాలచంద్రికయును మన్మథజ్వరము యొక్క పరాకాష్ఠనొందిన ఆ కోమ లాంగిని రాజవాహనుని సౌందర్యమునందు అధీనమైన మనస్సుగల దానినిగ, అన్యుల శరణము లేనిదానినిగా తెలిసికొని ఆత్మలో నిట్లాలోచించెను. ''రాజకుమారుడు సత్వరముగ నాచే తీసికొని రాబడవలసియున్నాడు. లేనిచో ఈమె నా మన్మథుడు, స్మరింపదగు స్థితిని (మరణమును) పొందింపగలడు. అచ్చటి యుద్యానవనమునందు వీరిరువురును పరస్పరము జూచుకొను సమయ

మసాయక స్స్వమం ముక్తసాయకోఽభూత్. తస్మా త్కుమారానయ
నం సుకరమ్.' ఇతి. తతోఽవంతిసున్దరీరక్షణాయ సమయోచితకరణీయ
చతురం సఖీగణం నియుజ్య, రాజకుమారమన్దిర మవాప. పుష్ప
బాణబాణతూణీరాయమాణమానసో ఽనఙ్గతప్తావయవసంపర్కపరిమ్లాన
పల్లవశయన మధిష్ఠితో రాజవాహనః ప్రాణేశ్వరీ ముద్దిశ్య సహ
పుష్పోద్భవేన సంలపన్, ఆగతాం ప్రియవయస్యా మాలోక్య, 'పాద
మూల మన్వేషణీయా లతేవ బాలచన్ద్రికాఽఽగ' తేతిసంతుష్టమనాః,
నిటలతటమణ్డనీభవదమ్బుజ కోరకాకృతిలసదఞ్జలిపుటా మితో నిషీ
దేతి నిర్దిష్టసముచితాసనాసీనా మవన్తిసున్దరీప్రేషితం సకర్పూరం
తామ్బూలం వినయేన దదతీం తాం కాన్తావృత్తాన్త మపృచ్ఛత్. తయా
సవినయ మభాణి 'దేవ ! క్రీడావనే భవదాలోకనకాల మారభ్య

---

మున విషమబాణుడు సరిసమానముగ బాణప్రయోగము గావించెను. అందు
వలన కుమారుని తోడ్కొని వచ్చుట సులభము.'' అంతట అవంతిసుం
దరీ రక్షణమునకై సమయోచిత కార్యములందు చతురలగు సఖీ సముదాయ
మును నియోగించి, రాజకుమారుని మందిరమును జేరెను.

మన్మథ బాణములకు తూణీరమైన మనస్సుగలవాడును, మన్మథునిచే
సంతప్తమొనర్చబడిన అవయవముల సంపర్కముచే వాడిపోయిన చిగురు
టాకుల పడకపై నున్నవాడునునైన రాజవాహనుడు ప్రాణేశ్వరి నుద్దేశించి
పుష్పోద్భవునితో మాటాడుచు, వచ్చిన నెచ్చెలిని జూచి "వెదుకబోయిన
తీగ పాదమూలమును జేరినటుల బాలచంద్రిక వచ్చిన'' దని సంతసించిన
మనస్సుగలవాడై, ఫాలభాగమున కలంకారప్రాయముగ నున్న తామరమొగ్గ
వంటి ఆకారముతో ప్రకాశించు అంజలి పుటము గలిగి, "ఇటు కూర్చుండు''
మని నిర్దేశింపబడి, సముచితమైన ఆసనముపై కూర్చుండి, అవంతి సుంద
రిచే పంపబడిన కర్పూరయుక్తమైన తాంబూలమును వినయముతో ఇచ్చు

మన్మథ మథ్యమానా పుష్పతల్పాదిషు తాపశమన మలబ్ధవతీ వామనే నేవోన్నత తరుఫల మలభ్యం త్వదురస్స్థలాలిఙ్గనసౌఖ్యం స్మరాన్ధ తయా లిప్సుస్సా స్వయమేవ పత్త్రికా మాలిఖ్య వల్లభాయైనా మర్పయేతి మాం నియుక్తవతీ.' ఇతి. రాజకుమారః పత్త్రికాం తా మాదాయ పపాఠ.

సుభగ ! కుసుమసుకుమారం
జగదనవద్యం విలోక్య తే రూపమ్,
మమ మానస మభిలషతి
త్వం చిత్తం కురు తథా మృదులమ్.

---

చున్న ఆ బాలచంద్రికను ప్రియురాలి వృత్తాంతమును గూర్చి ప్రశ్నించెను. ఆమెచే సవినయముగా నిట్లు చెప్పబడెను. "దేవా ! కేళీవనమునందు మిమ్ము లను చూచిన క్షణము మొదలు మన్మథునిచే పీడింపబడుచున్నదై, పుష్ప తల్పాదులందు తాపశాంతి లభింపనిదై, వామనుడు అలభ్యమైన ఉన్నత వృక్ష ఫలమును వలె మదనాంధ్యము చేత తమ వృక్షస్థలాలింగన సుఖమును అనుభ వించు కోరిక గలదై యామె స్వయముగా లేఖ వ్రాసి 'దీనిని ప్రియునకు సమర్పింపు' మని నన్ను నియోగించినది.'' రాజకుమారుడును ఆ లేఖను తీసికొని చదివెను.

శ్లో॥ ''సుందరా ! పుష్పమువలె అతిమృదువైన,
లోకమున దోషరహితమైన నీరూపమును జూచి
నా మానసము అభిలషించుచున్నది. నీవును
అట్లే మనస్సును కోమలముగ నొనర్పుము''

ఇతి పఠిత్వా సాదర మభాషత : 'సఖే ! ఛాయావన్మామను వర్తమానస్య పుష్పోద్భవస్య వల్లభా త్వమేవ తస్యా మృగీదృశో బహిశ్చరాః ప్రాణా ఇవ వర్తసే. త్వచ్చాతుర్య మస్యాం క్రియాలతాయా మాలవాల మభూత్. త దఖిలం కరిష్యామి నతాంగ్యా మన్మనఃకాఠిన్య మాఖ్యాతమ్. యదా కేళీవనే కురఙ్గనయనాలోచన పథ మపతం, తదై వాపహృతపదీయమానసా సా స్వం మదిర మగాత్. సా స్వచేతసో మాధుర్యకాఠిన్యే స్వయ మేవ జానాతి. దుష్కరః కన్యా న్తఃపురప్రవేశః. తదనురూప ముపాయ ముప పాద్య శ్వః పరశ్వో వా నతాంగీం సఙ్గమిష్యే. మదుదన్త మేవ మాఖ్యాయ శిరీషకుసుమసుకుమారాయా యథా శరీరబాధా న జాయేత, తథావిధ ముపాయ మాచరే' తి. బాలచంద్రికా చస్య ప్రేమగర్భితం వచన మాకర్ణ్య సంతుష్టా కన్యాపుర మగచ్ఛత్.

---

అని చదివి సాదరముగ నిట్లు పలికెను. "చెలీ ! నీడవలె నన్ననుసరించుచున్న పుష్పోద్భవుని ప్రియురాలవైన నీవే లేడి కన్నుల వంటి కన్నులుగల ఆమె బహిశ్చరములైన ప్రాణములవలె నున్నావు. నీ చాతుర్యము ఈ కర్తవ్యలతకు ఆలవాలమయ్యెను. ఏది నీకభిలషితమో, దేనిచే ప్రియురాలి మనోరథము ఫలింపగలదో దాని నంతయును చేయగలను. ఆ నతాంగిచే నామానసకాఠిన్యము చెప్పబడినది. ఎప్పుడు క్రీడావనమున ఆ కురంగాక్షి నేత్రపథమున పడితినో అప్పుడే యామె అపహరింపబడిన నా మానసము గలదై తన మందిరమునకు వెడలెను. ఆమె నామనస్సుయొక్క మాధుర్య కాఠిన్యములను స్వయముగ నెఱుగును. కన్యకలున్న అంతఃపురమున ప్రవేశించుట దుష్కరము. దాని కనురూపమైన యుపాయము నాలోచించి, రేపైనను, మరునటి దినమైనను ఆ యువతిని కలిసికొనగలను. నావృత్తాంతము నిట్లు చెప్పి శిరీష పుష్పము వలె సుకుమారియైన ఆమెకు ఏవిధముగ శరీరబాధ

రాజవాహనోఽపి యత్ర వల్లభావలోకనసుఖమలభత తదుద్యానం విరహవినోదాయ పుష్పోద్భవసమన్వితో జగామ. తత్ర చకోరలోచనాపచిత పల్లవ కుసుమ నికురుమ్బం మహీరుహసమూహం, శరదిన్దుముఖ్యా మన్మథారాధనస్థానం చ, నతాంగిపదపంక్తిచిహ్నితం శీతలం సైకతతలం చ, సుదతీ భుక్తముక్తం మాధవీలతామండపాన్తరస్థం పల్లవతల్పం చ, విలోకయన్, లలనాతల్పవిలోకనవేళాజనితాన్ విశేషాన్ స్మారం స్మారం, మన్దమారుతకమ్పితాన్యుపవననూతన పల్లవాని మదనాగ్నిశిఖా ఇవ చకితో దర్శం దర్శం, మనోజకర్ణజపానా మివ కోకిలకీరమధుకరాణాం క్వణితాని శ్రావంశ్రావం, మారవికారేణ క్వచిదవ్యవస్థాతుమసహిష్ణుః పరిబభ్రామ.

---

గలుగదో అట్టి యుపాయము నాచరింపుము." బాలచంద్రిక ఆతవి ప్రేమపూర్ణమైన వచనమును విని సంతసించినదై కన్యాంతఃపురమునకు బోయెను.

రాజవాహనుడును ఎచ్చట ప్రియురాలి దర్శన సౌఖ్యము దొరకెనో ఆయుద్యానవనమునకు విరహబాధను పోగొట్టుకొనుటకై పుష్పోద్భవ సమన్వితుడై వెడలెను. అచ్చట ఆ చకోరలోచనచే కోయబడిన పల్లవకుసుమ సముదాయముగల వృక్షసమూహమును, ఆ శరచ్చంద్రముఖిచే మదనపూజ చేయబడిన స్థానమును, ఆ నతాంగి పాదపంక్తులచే చిహ్నితమైన చల్లని ఇసుకతిన్నెను, ఆ సుదతిచే ననుభవింపబడి విడువబడిన మాధవీలతామంటపపు మధ్యనున్న చిగురుటాకుల శయ్యను చూచుచు, ఆ లలన పల్లవ తల్పమును చూచువేళ కలిగిన విశేషములను స్మరించి స్మరించి, పిల్లగాలులచే కదల్పబడిన యుపవనము నందలి క్రొంగ్రొత్త చిగురుటాకులను మన్మథాగ్ని శిఖలను వలె చకితుడై చూచి చూచి, మన్మథుని మంత్రులవలె నున్న కోకిల కీర మధుకరముల ధ్వనులను విని విని, మన్మథ వికారముచే నెచ్చటను నిలువ నోర్వనివాడై పరిభ్రమించెను.

తస్మి న్నవసరే ధరణీసుర ఏకః సూక్ష్మచిత్రనివసనః స్ఫురన్మణికుండలమణ్డితో ముణ్డితమ స్తకమాణవకసమేతః చతురవేష మనోరమో యదృచ్ఛయా సమాగతః సమ స్తతోఽభ్యుల్లస త్తేజో మణ్డలం రాజవాహన మాశీర్వాదపూర్వకం దదర్శ. రాజా సాదరం 'కో భవాన్? కస్యాం విద్యాయాం నిపుణః?' ఇతి తం పప్రచ్ఛ. స చ 'విద్యేశ్వరనామధేయోఽహ, మైన్ద్రజాలికవిద్యాకోవిదో, వివిధ దేశేషు రాజమనో రఞ్జనాయ భ్రమ న్నుజ్జయినీ మద్యాఽగతోఽస్మి.' ఇతి శశంస. పునరపి రాజవాహనం సమ్య గాలోక్య 'అస్యాం లీలావనౌ పాణ్డురతానిమి త్తం కిమ్?' ఇతి సాభిప్రాయం విహస్యా పృచ్ఛత్. పుష్పోద్భవ శ్చై న్ద్రజాలికే నిజకార్యకరణం తర్కయ న్నవమాదరేణ బభాషే: 'నను సతాం సఖ్యస్యాభాషణపూర్వతయా

---

అట్టి యవసరమున సన్నని రంగు రంగుల వస్త్రములు గలవాడును, ప్రకాశించు మణికుండలములచే నలంకృతుడై నవాడును, బోడితలలుగల బ్రహ్మచారులతో కూడినవాడును, సుందర వేషముచే మనోహరుడును నైన ఒక బ్రాహ్మణుడు దైవికముగా వచ్చి, అంతటను ప్రకాశించుచున్న తేజః పుంజముగల రాజవాహనుని ఆశీర్వాదపూర్వకముగ దర్శించెను. రాజును సాదరముగ "నీవెవ్వడవు? ఏ విద్యలో నిపుణుడవు?" అని అతని ప్రశ్నిం చెను. ఆ బ్రాహ్మణుడును "విద్యేశ్వరుడను పేరుగల నేను ఐంద్రజాలిక విద్యలో పండితుడను. వివిధ దేశములందలి రాజులను రంజింపజేయుటకై తిరుగుచు ఈ దినము ఉజ్జయినికి వచ్చితిని" అని చెప్పెను. రాజవాహనుని బాగుగ పరి శీలించి చూచి మరల "ఈ లీలావనమున తెల్లబారి యుండుటకు కారణ మేమి?" అని సాభిప్రాయముగ నవ్వి ప్రశ్నించెను. పుష్పోద్భవుడును ఐంద్రజాలి కుని వల్ల తమ కార్యము నెరవేరునేమోయని ఊహించుచు, ఆదరముతో నిట్లనెను. "సత్పురుషుల స్నేహము సంభాషణపూర్వకమగుటచే నింతసేపు

చిరం రుచిరభాషణో భవా నస్మాకం ప్రియవయస్యో జాతః. సుహృదా మకథనీయం కిమస్తి ? కేళివనే ఽస్మిన్ వసన్త మహోత్సవాయ సమాగతాయా మాళవేన్ద్రసుతాయా రాజనన్దనస్యాస్య చాఽకస్మికసందర్శనే ఽన్యోన్యానురాగాతిరేక స్సమజాయత. తతః సంతత సమ్భోగసిద్ధ్యుపాయా భావే నాసావీదృశీ మవస్థా మను భవతి.' ఇతి. విద్యేశ్వరో లజ్జాభిరామం రాజకుమారముఖ మభి వీక్ష్య విరచిత మన్దహాసో వ్యాజహార. 'దేవ ! భవదనుచరే మయి తిష్ఠతి, తవ కార్య మసాధ్యం కిమస్తి ? అహ మిన్ద్ర జాలవిద్యయా మాలవేన్ద్రం మోహయన్ పౌరజనసమక్ష మేవ తత్తనయాపరిణయం రచయిత్వా ·కన్యాన్తఃపురప్రవేశం కరిష్యామి. ఇతి వృత్తాన్త ఏష రాజకన్యాయై సఖీముఖేన పూర్వ మేవ

---

రుచిరముగ భాషించిన నీవు మాకు ప్రియసఖుడ వైతివి గదా. మిత్రులకు చెప్పరానిది ఏముండును ? ఈ క్రీడావనమునందు వసంత మహోత్సవము నకై వచ్చిన మాళవరాజు కుమార్తెకును, ఈ రాజకుమారునకును హఠాత్సం దర్శనమువలన పరస్పరము అనురాగాధిక్యము కలిగెను. అంతట నుండి నిరంతరమైన సంభోగము గలుగు నుపాయము లేకపోవుటచే ఈతడీ దురవస్థ ననుభవించుచున్నాడు.''

విద్యేశ్వరుడును సిగ్గుచే సుందరమైన రాజకుమారుని ముఖమును జూచి చిరునవ్వు నవ్వి యిట్లు పలికెను- ''దేవా ! నీయనుచరుడనైన నేనుండ మీ కసాధ్యమైన కార్యమేమున్నది. నేను ఐంద్రజాల విద్యచే మాళవేంద్రుని మోహింప జేయుచు, పురజనుల సమక్షముననే ఆతనికుమార్తె వివాహము గావించి, కన్యక యొక్క అంతఃపురమున ప్రవేశము కల్పింతును. ఇట్లని యీ వృత్తాంతము రాజకన్యకకు సఖీ ముఖమున ముందుగనే చెప్పబడదగినది.''

కథయితవ్యః' ఇతి. సంతుష్టమనా మహీపతి రనిమిత్తం మిత్రం ప్రకటీకృతకృత్రిమక్రియాపాటం విప్రలమ్భ కృత్రిమప్రేమ సహజ సౌహార్ద్రవేదినం తం విద్యేశ్వరం సబహుమానం విససర్జ.

అథ రాజవాహనో విద్యేశ్వరస్య క్రియాపాటవేన ఫలిత మివ మనోరథం మన్యమానః, పుష్పోద్భవేన సహ స్వ మన్దిర ముపేత్య, సాదరం బాలచన్ద్రికాముఖేన నిజవల్లభాయై మహీసుర క్రియమాణం సంగమోపాయం వేదయిత్వా, కౌతుకాకృష్ట హృదయః కథ మిమాం క్షపాం క్షపయా మీతి చిన్తయ న్నతిష్ఠత్. పరేద్యుః ప్రభాతే విద్యేశ్వరో రసభావగీతి రీతిగతిచతుర స్తావ్ర శేన మహతా నిజపరిజనేన సహ రాజభవనద్వారా న్తిక ముపేత్య దౌవారికనివేదిత నిజవృత్తా న్త స్సహ సోపగమ్య సప్రణామ 'మైన్ద్రి

---

సంతుష్టమానసుడైన మహారాజు అకారణమిత్రుడును, ప్రకటించబడిన కృత్రిమ ప్రణయమును, సహజ సౌహార్దము నెరిగినవాడుననగు ఆ విద్యేశ్వ రుని సబహుమానముగ పంపి వైచెను.

అంతట రాజవాహనుడు విద్యేశ్వరుని క్రియాపాటవముచే కోరికను ఫలించిన దానినిగా తలంచుచు పుష్పోద్భవునితో కూడి తన మందిరమును జేరి, సాదరముగ బాలచంద్రిక ముఖమున బ్రాహ్మణునిచే చేయబడు సంగమోపా యమును తన ప్రియురాలికి తెలియజెప్పి కుతూహలాయత్తమైన హృదయము గలవాడై "ఈరాత్రి నెట్లు గడుపుదు" నని చింతించుచుండెను. మరుసటి దినమున ఉషఃకాలమున రసభావ గీతి రీతి గతుల యందు చతురుడైన విద్యేశ్వరుడు అటువంటి గొప్పదైన తన పరివారముతో కూడి రాజభవన ద్వార సమీపము చేరి ద్వార పాలకులకు దెలుపబడిన నిజవృత్తాంతము గల వాడై, త్వరగా ప్రవేశించి నమస్కారపూర్వకముగా "ఐంద్రజాలికుడు

జాలికస్సమాగత' ఇతి దౌవారికై ర్విజ్ఞాపితేన తద్దర్శనకుతూహలావి ష్టేన సముత్సుకావరోధజన సహితేన మాలవేంద్రేణ సమాహూయమానః, కక్ష్యాంతరం ప్రవిశ్య, సవినయ మాశిషం దత్త్వా, తదనుజ్ఞాతః, పరిజనతాడ్యమానేషు వాద్యేషు నదత్సు, గాయ న్తీషు మదకలకోకిలా మఞ్జులధ్వనిషు సమధికరాగరంజిత సామాజిక మనోవృత్తిషు, పిఞ్ఛికాభ్రమణేన సపరివారం పరిబృఢం భ్రామయన్, ముకుళిత నయనః క్షణ మతిష్ఠత్. తదను విష మం విష ముల్బణం వమంతః ఫణాలంకరణరత్నరాజి నీరాజిత రాజమందిరాభోగా భోగినో భయం సంజనయన్తో నిశ్చేరుః. గృధ్రాశ్చ బహవ స్తైౖ రహిపతీ నాదాయ దివి సమచరన్. తతోఽ గ్రజన్మా నరసింహస్య హిరణ్యకశిపో ర్దైత్యేశ్వరస్య విదారణ మభి

---

వచ్చిన వాడని" ద్వారపాలురచే విజ్ఞాపన జేయబడి, ఐంద్రజాలిక దర్శన కుతూహలియై సముత్సుకమగు నంతఃపుర జనముతో గూడిన మాళవేంద్రునిచే నాహ్వానింపబడినవాడై, రాజభవనము ప్రవేశించి, సవినయముగ నాశీర్వచన మొసగి రాజుచే ననుజ్ఞాతుడై, పరిజనములచే తాడింపబడుచున్నవై వాద్యములు ధ్వనించుచుండగా, అతిశయమైన రాగముచే రంజింపజేయబడిన సామాజిక చిత్తవృత్తులు గలిగి, మదముచే అవ్యక్తమధురములైన కోకిలల కంఠము వంటి కంఠధ్వని గల స్త్రీలు గానము చేయుచుండగా, మయూరపించ భ్రమణముచే సపరిపరివారుడైన రాజును భ్రమింప జేయుచు, ముకుళితనేత్రుడై క్షణకాలముండెను. అనంతరము తీవ్రమగు విషమును మిక్కుటముగా వమనము జేయుచు, పడగలకు అలంకారములైన రత్నముల సమూహములచే నీరాజనము చేయబడిన రాజమందిర ప్రదేశముగల సర్పరాజములు భయము గలిగించునవై సంచరించినవి. పెక్కుగ్రద్దలును ముక్కులతో పాములను గరచుకొని యాకా

నీయ మహాశ్చర్యాన్వితం రాజాన మభాషత: 'రాజన్ ! అవసాన సమయే భవతా శుభసూచకం ద్రష్టు ముచితమ్. తతః కల్యాణ పరమ్పరావాప్తయే భవదాత్మజాకారాయా స్తరుణ్యా నిఖిలలక్షణో పేతస్య రాజనన్దనస్య వివాహః కార్యః' ఇతి. తదవలోకన కుతూహలేన మహీపాలేనానుజ్ఞాతః స సంకల్పితార్థసిద్ధి సంభావన సముత్ఫుల్లవదనః సకలమోహజనక మఞ్జనం లోచనయో ర్నిక్షిప్య పరితో వ్యలోకయత్. సర్వేషు త దైన్ద్రజాలిక మేవ కర్మేతి త దద్భుతం పశ్యత్సు, రాగపల్లవితహృదయేన రాజవాహనేన పూర్వ సంకేత సమాగతా మనేకభూషణ భూషితాఙ్గీ మవన్తిసున్దరీం వైవాహికమన్త్రతన్త్రనైపుణ్యే నాగ్నిం సాక్షీకృత్య సంయోజయా మాస. క్రియావసానే సతి 'ఇన్ద్రజాలపురుషా స్సర్వే గచ్ఛన్తు భవన్త'

---

శమున సంచరించెను. పిమ్మట బ్రాహ్మణుడు రాక్షసరాజైన హిరణ్య కశిపుని నరసింహుడు చీల్చుటను అభినయించి గొప్ప ఆశ్చర్యముతో గూడిన రాజుతో ఇట్లు పలికెను. ''రాజా ! ముగింపువేళ తమచే శుభ సూచకమైన సంఘటనము చూడబడుట ఉచితము. తరువాత కళ్యాణ పరంపరను పొందుటకై నీకుమార్తె ఆకారముగల యువతికిని, సమస్త శుభలక్షణములుగల రాజకుమారునకును వివాహము చేయదగి యున్నది." దానిని దిలకించుట యందు కుతూహలము గల మహారాజుచే ననుజ్ఞాతుడైన ఆతడు సంకల్పించబడిన ప్రయోజనము సిద్ధించుచున్నదను భావనచే వికసించిన వదనము గలవాడై, సమస్త జనులకు మోహము కలిగించు కాటుకను కన్నులలో నుంచి అంతటను జూచెను. సమస్త జనులును అది ఐంద్రజాలికమైన కర్మయని యీ యద్భుతమును జూచుచుండగా, అనురాగముచే చిగురించిన హృదయముగల రాజవాహనునితో, అనేక భూషణములచే అలంకృతాంగియై, పూర్వసంకేతానుసారముగ వచ్చిన అవంతీసుందరిని

ఇతి ద్విజన్మనోచ్చై రుచ్యమానే సర్వే మాయామానవా యథా యథ మన్తర్భావం గతాః. రాజవాహనోఽపి పూర్వసంకల్పితేన గూఢోపాయచాతుర్యే ణైన్ద్రజాలికపురుషవత్కన్యాపురం ప్రవివేశ. మాలవేన్ద్రోఽపి త దద్భుతం మన్యమాన స్తస్మై బాడబాయ ప్రచురతరం ధనం దత్త్వా, 'విద్యేశ్వర ? త్వ మిదానీం సాధ' యేతి తం విసృజ్య, స్వయ మన్తర్మన్దిరం జగామ. తతోఽవంతి సున్దరీ ప్రియసహచరీపరివారవల్లభోపేతా సున్దరీమన్దిరం యయౌ. ఏవం దైవమానుషబలేన మనోరథసాఫల్య ముపేతో రాజవాహనః సరసమధురచేష్టాభి శ్శనై శ్శనై ర్హరిణలోచనాయా లజ్జా మపన యన్ రహో విస్రమ్భముపజనయ న్సంలాపే తదనులాప పీయూష

---

మంత్రతంత్ర నైపుణ్యముచే అగ్నిని సాక్షిగా జేసి సంయోగింప జేసెను. పని పూర్తికాగానే "ఇంద్రజాలపురుషులగు మీరందరును వెళ్ళుదురు గాక" అని ఉచ్చైస్స్వరమున బ్రాహ్మణునిచే చెప్పబడగా, సమస్త మాయామానవులు నెప్పటియట్ల అంతర్భావము జెందిరి. రాజవాహనుడు పూర్వసంకల్పితమైన రహస్యోపాయచాతుర్యముచే ఐంద్రజాలిక పురుషుని వలె కన్యక యొక్క అంతఃపురమును ప్రవేశించెను. మాళవేంద్రుడును నది యద్భుతమని తలంచినవాడై ఆ బ్రాహ్మణునకు మిక్కుటముగా ధనము నిచ్చి "విద్యేశ్వరా ! నీవిక వెళ్ళుము" అని అతనిని పంపి, తానును అంతఃపురమును జేరెను.

అంతట అవంతిసుందరి ప్రియసఖితోడను, పరివారముతోడనుర ప్రియుని తోడను కూడినదై కన్యామందిరమును జేరెను. ఇట్లు దైవ మానుషబలముచే మనోరథ సఫలతను పొందిన రాజవాహనుడు సరస మధురములైన చేష్టలతో మెల్లమెల్లగా నామృగలోచన సిగ్గును పోగొట్టుచు, ఏకాంతము నందలి విశ్వాసమును కలిగించుచు, సంభాషణమునందు ఆమె ప్రతివచనములనెడి అమృతమును పానము చేయుటయందు బాసక్తుడై

పానలోలుప శ్చిత్రచిత్రం చిత్తహారిణం చతుర్దశభువనవృత్తాన్తం శ్రావయామాస.

ఇతి శ్రీమదాచార్య మహాకవి దణ్డినః కృతౌ దశకుమారచరితే
పూర్వపీఠికాయా మవంతిసుందరీపరిణయో నామ

పఞ్చమ ఉచ్ఛ్వాసః.

ఇతి పూర్వపీఠికా

---

చిత్ర విచిత్రమై మనోరంజకమైన పదునాల్గు భువనముల వృత్తాంతమును వినిపించెను.

ఇది శ్రీ మదాచార్య మహాకవి దండిచే విరచితమైన
దశకుమారచరిత మందలి పూర్వపీఠిక యందు అవంతీ
సుందరీ పరిణయమను పంచమోచ్ఛ్వాసము.

ఇది పూర్వపీఠిక

# కథాంశములు

## 1. వసుమతీ రాజహంసులు.

భూమండల మందలి నగరములకెల్ల గీటురాయి యనదగి, మగధదేశమునకు శిరోభూషణమైన పుష్పపురియను నగరముకలదు. అందలి యంగళ్లయందు ప్రదర్శింపబడు రత్నాదివస్తుసముదాయము సముద్రముయొక్క మహిమను ప్రకటించుచుండును. సకలశత్రు నగరములనెడి సముద్రములను మథించుట యందు మంధర పర్వతమగుచున్న భుజ దండములుగల రాజహంసుడను మహీపతి యానగరము నధిష్ఠించి మగధ రాజ్యము నేలుచుండెను. రత్నాకరములనెడు మొలనూలు ధరించిన వసుంధరకు ఏలికయైన ఆతని యచ్ఛమైన కీర్తిని స్వర్లోక మందలి యుద్యానవనముల విహరించు అచ్చరలు గానము చేయుచుందురు. ఆతడు నిరంతరములైన యాగములచే దేవతలను, భూదేవతలను సంతృప్తిపరచుచుండును. ఆతడు ప్రతాపమున మధ్యందిన మార్తాండుని, సౌందర్యమున మన్మథుని దిరస్కరించుచుండును.

ఆతనికి సుశీలయు, [illegible]రీకుల శిరోమణియునగు వసుమతి యను రమణి రాణియై యుండెను. పరమశివుని నేత్రాగ్నిచే మన్మథుడు భస్మీకృతుడు కాగా ఆశ్రయము గోల్పోయిన యాతని వస్తుజాలము ఆమెకు అవయవరూపమున ఇట్లు పరిణమించినట్లుండెను.

తుమ్మెదల బారు ఆమె కేశపాశముగను, ప్రేమాకరుడగు చంద్రుడు కమలములశోభను తిరస్కరించు ముఖముగను, జయధ్వజమగు మీనము నేత్రయుగళముగను, సమస్తసైన్యమున మేటియగు మలయసమీరుడు నిశ్వాసముగను, విరహతప్తుల మానసములకు ఖడ్గమైన చిగురుటాకు అధర

బింబముగను, విజయశంఖము సౌందర్యాతిశయముతోనొప్పు కంఠముగను, పూర్ణకుంభములు చక్రవాకానుకారియైన స్తనయుగళముగను, అల్లైరా దగుచున్న మెత్తని తామరతూండ్లు బాహువులుగను, ఇంచుక విప్పారిన కలువ మొగ్గ గంగానది సుడినిబోలు నాభిగను, యోగిజనుల కోరికలను దూరముచేయజాలిన చైత్రరథము విశాల జఘనభాగముగను, యతుల ప్రయత్నముల కడ్డుపడు రంభలు (అరటిబోదెలు) తొడలజంటగను, గొడుగైన సహస్రపత్రకమలము పాదద్వయముగను, అస్త్రములైన సుమములు ఆయా ఇతరావయవములుగను ఒప్పినవా యన్నట్లున్న యా వసుమతి, సౌందర్యమున అమరావతిని మించు పుష్పపురమున రాజహంసప్రభువుచే లాలింపబడుచు వసుమతివలె (భూదేవివలె) యథేష్టముగా అనుభవింపబడుచుండెను.

### 2. రాజహంస - మానసారులు.

ఇట్లు స్వర్గసీమను తలదన్ను భోగభాగ్యములుగల పుష్పపురమును రాజహంసుడు పరిపాలించుచు వివిధయుద్ధ ప్రయోగ చాకచక్యముచే రణరంగములందు శత్రురాజన్యుల శిరముల ఖండించుచు, యుద్ధములందు అరివీర భయంకరుడై యొప్పుచు అభిమానముగల మాళవనాధుడగు మానసారునిపై దాడి వెడలెను. మగధనాయకుని సైన్యముల ఘోష, భేరీభాంకారములను సముద్రఘోషను మించి యుండగా దిగ్గజములు భయగ్రస్తములయ్యెను. చతురంగబలముల పాదఘట్టనలచే భూమి క్రుంగగా సకల చరాచరమును మోయుచున్న యాదిశేషునిపడగలను పీడితముల జేయుచు, యుద్ధోత్సాహము పెల్లుబుకుచుండ చనుదెంచిన రోషావిష్టుడైన రాజహంసుని మానసారుడు పెక్కుగజసమూహములతో కూడినవాడై మూర్తిమంతమైన యుద్ధమాయన్నట్లు ఇనుమడించిన క్రోధముతో నెదుర్కొనెను. రథములచేతను గుఱ్ఱపు గిట్టల త్రొక్కుడుల చేతను పుట్టినధూళి యాకాశప్రదేశము నావరించగా మదపుటేనుగులచెక్కిళ్ళ నుండి స్రవించిన మదముచే మూలము కడుగబడినట్లుండ వీరస్వర్గ మలంకరించిన క్రొత్తప్రియులను వరింపవచ్చిన యప్సరఃకాంతలకు ఆధూళి తెరగుడ్డవలె దోచెను. శస్త్రాశస్త్రి, హస్తాహస్తి పరస్పరము సాగిన యా యుద్ధమున మ్రోగిన ఢక్కాధ్వని ఆకాశమున ఇతరధ్వనుల నణచి వేయుచు సమస్తదిగంత

రాళమును చెవిటిదిగా చేయుచుండెను. ఇట్టి యుద్ధమున క్షీణసైన్యుడైన మాలవ రాజును మగధరాజు ప్రాణములతో బంధించియు, దయాసత్వముచే నాతనిని మరల స్వరాజ్యమునందే ప్రతిష్ఠించెను.

ఇట్లు కొన్నిదినములు గడిచిన పిదప రాజహంసుడు మంత్రి మిత్ర పురోహితులతో కూడి సభలో సింహాసనాసీనుడై యుండగా ద్వారపాలకుడు సభలోని కేతెంచి, రాజునకు నమస్కరించి "దేవా! దేవరను దర్శింప కుతూహలపడు మనస్సుగల ఎవడో దేవరచే విశేషపూజకర్హుడైన యతిశ్రేష్ఠుడు ద్వారదేశము నందున్నాడు" అని విన్నవించెను. రాజుచే అనుజ్ఞాతుడైన ద్వారపాలకుడు ఆయోగిని రాజుకడకు గొనితెచ్చెను. యతివేషమును ధరించి వచ్చిన యాతనిని తన గూఢచారి యని గ్రహించిన మహారాజు అచ్చటినుండి అనుచరులను బంపివైచి, మంత్రివర్గముతో కూడి, తనకు ప్రణమిల్లిన యాతనితో మందహాసముగా నిట్లు పలికెను- 'ఓయీ! తాపసుడా! మిషతో దేశమున సంచరించుచు అచ్చటచ్చట నీచే తెలుసుకొనబడిన దానిని చెప్పుదువుగాక.' అంజలి ఘటించిన యాదేశసంచారి యిట్లు పలికెను దేవా! తమ యాజ్ఞను శిరసావహించి, నిష్కలంక వేషము దాల్చి మాళవనగరమును ప్రవేశించి మానసారుని వృత్తాంతమంతయును తెలిసికొని వచ్చితిని. అభిమానియగు మానసారుడు సమరాంగణమున తన సైన్యములను నాశనము గావించుకొని పరాభవతప్తమానసుడై, దైన్యముగలవాడై మహాకాళనివాసియగు కాశీనాథుడగు మహేశ్వరు నారాధించి యాదేవుని సంతుష్టిపరచెను. తపః ప్రభావ సంతుష్టుడైన యా పరమేశ్వరుడు శత్రుసంహారకమైన గదను ప్రసాదించెను. అందుచే నాతడు తన్ను ఎదురులేని వానినిగా దలంచుచు మిమ్ముల నెదిరించుటకు సిద్ధపడియున్నాడు. అటుపైన దేవర ప్రమాణము.

గూఢచారుని వలన విషయము గ్రహించి మంత్రులు రాజహంసునితో "దేవా! శత్రువు తిరుగులేని దైవసహాయముతో వచ్చుచుండుట వలన ప్రస్తుతము సమరము మేలుకాదు. వెంటనే బలిష్ఠమైన కోట నాశ్రయింప వలయును" అని విన్నవించిరి. ఇట్లు మంత్రులెన్ని విధములచెప్పినను వినక యారాజన్యుడు

మొక్కవోనిధైర్యముగలవాడై మానసారునితో ఎదిర్చి పోరాడుటకే నిశ్చయించెను. పరమేశ్వరవరప్రసాదలబ్ధ మహా బలసమన్వితుడైన మానసారుడును యుద్ధసామగ్రిని వెంటనిడుకొని అక్రమముగా మగధ దేశము జేరెను. మంత్రులావార్తవిని దేవేంద్ర సముడైన మగధరాజు నెట్లో ఒప్పించి శత్రు దుర్గమమైన వింధ్యారణ్య మధ్య భాగమున అంతఃపురజనమును మూలబలములతో సురక్షితముగా నుంచిరి.

రాజహంసుడు మాత్రము ధైర్యసహితమైన ప్రశస్తతరమైన సైన్యమును వెంట నిడుకొని త్వరితగతితో శత్రువు నడ్డగించెను. దృఢశత్రుత్వము గల్గిన యాశూరుల యుద్ధమును గగనచారులుసైతము వచ్చి ఆశ్చర్యముతో చూచిరి. జయకాంక్ష గల్గిన మాలవనాథుడు నేర్పుతో వివిధాయుధ ప్రయోగనైపుణ్యముగల అసురేంద్రసమానుడగు మగధరాజుపై త్రిపురాంతకదత్తమగు గదను ప్రయోగించెను. రాజహంసుని పదునైన బాణపరంపరలచే ముక్కలుచేయబడిన దయ్యును పరమేశ్వరుని శాసనము వ్యర్థముకానిదగుట వలన ఆ గద సారథిని చంపి, రథము నందున్న రాజును మూర్ఛితుని గావించెను. అంతట కళ్ళెములు వదిలిన అశ్వములు రథమును తీసుకొని దైవ వశమున అంతఃపుర స్త్రీలకు నిలయమైన మహారణ్యమును ప్రవేశించెను. జయలక్ష్మీ సమన్వితుడైన మాలవేశ్వరుడు సమృద్ధమగు మగధరాజ్యమును ఆక్రమించి పుష్పపురము నధిష్ఠించెను.

### 3. రాజవాహన జన్మవృత్తాంతము.

మగధదేశాధిపతియగు రాజహంసునకు అతని ధర్మపత్ని వసుమతీ దేవికిని రాజ్యమున సమస్తభోగభాగ్యములున్నను సంతానములేకపోవుటచే పరితప్తహృదయుడై శ్రీ మన్నారాయణ ధ్యానాసక్తుడై యుండెను. అంతనొకప్పుడాతని పట్టపురాణికి ప్రభాత స్వప్నమున నారాయణుడు కన్పించి "కల్పవృక్షఫలమును పొందుము" అని వరమొసంగెను. ఆటుతరువాత ఆమె ప్రియుని మనోరథఫలమునకు పుష్పభూతమైన గర్భమును ధరించెను. దేవేంద్రుని ఐశ్వర్య

మునే తిరస్కరింప జాలిన యారాజన్యుడు మిత్రరాజుల నాహ్వానించి నిజసం పదకు మనోరథమునకు అనురూపమైనరీతిగా సీమంతోత్సవము జరిపెను. తదుపరి మాలవనగరాధిపతియగు మానసారుడు పరమేశ్వరలబ్ధ గదాయుధ యుక్తుడై రాజహంసునిపైకి దండువెడలి యుద్ధమున గదాసహాయమున మొదట సూతుని సంహరించి పిమ్మట రథస్థుడైన రాజహంసుని మూర్ఛితుని గావిం చెను. అంతట దైవప్రేరితములైన రథాశ్వములు మూర్ఛితుడైన యారాజును రాణివాసమున్న చెంతకు గొని పోయినవి.

ఇక యుద్ధమున క్షతగాత్రులైన మంత్రులు విధివశమున ప్రాణములు విడువకయుండి వేకువ జామున వీచినగాలులచే తెలివి జెంది, ఎట్లో ఊరడిల్లి రాజుకొరకు వెదకి ఎచ్చటను కానక రాణియున్న అరణ్యముజేరిరి. వసుమతి యును సర్వసైన్యముల వినాశమును, రాజు కనబడకుండుటయును విని, కలత జెంది, శోకసాగరమున మునిగి పతిననుగమింప నిశ్చయించెను. కాని మంత్రి పురోహితులు "రాజుమరణము అనిశ్చతము. అదియునుగాక నీగర్భమందు సార్వభౌముడు సుందరుడు సుకుమారుడునునైన కుమారుడు గలడని దైవ జ్ఞులు నిర్ణయించిరి". అని ఓదార్చి అనుగమన ప్రయత్నమునుండి రాణిని విరమింప జేసిరి. అట్లయ్యును రాణి నిలువజాలక పరిజనము నిద్రలో మున్గి యున్నప్పుడు నిర్జనమైన యర్ధరాత్రమున అపారమైన శోకసాగరము దాట నశక్తురాలై సేనాప్రదేశమును దాటి, తగులొ్కన్నరథమును లాగలేక అల సిన రాజు రథాశ్వములున్న మార్గమునకు చేరువనున్న వటవృక్షముజేరి, మరణ రేఖవంటి వృక్షశాఖయందు ఉరిత్రాటిని ఏర్పరచి మరణింప గోరిన రాణి వచో మాధుర్యముచే కోకిలలతిరస్కరించుచు అశ్రుపూర్ణకంఠముతో నిట్లని విలపించెను_ 'సౌందర్యమున మదనుని బోలినవాడా నేలఱేడా ! రాబోవుజన్మము నందును నీవే నాకు భర్తవగుదువుగాక".

వసుమతి వేదనాపూరిత వాక్యములను చంద్రకిరణ సంస్పర్శతో మూర్ఛ దేరిన రాజహంసుడు విని రాణిగా నెఱింగి ప్రియవచనముల నామెన్ను చేరబిలి

చెను. రాణియును తెప్పపాటులేని కన్నులతో రాజును చూచి హృదయానంద
ముచే వికసించిన ముఖారవిందముగలదై, సంతసమున పురోహితామాత్య
జనమును పిలిచి రాజును వారికి చూపెను. వారునుమహారాజునకు ప్రణమిల్లి దైవ
మహిమను గొనియాడుచు "దేవా ! సారథి మరణించినంతనే రథాశ్వములు
రథమును వేగముగా నరణ్యమున కీడ్చుకొనిపోయినవి"_ అని పలికిరి. రాజును
"సమరమున సైనికులు మరణింపగా మానసారునియొక్క పరమేశ్వరప్రసాద
లబ్ధగదచే తాడితుడనై మూర్ఛనొంది ఇచ్చటి ప్రాతఃకాలపు వాయువులచే
మేల్కొల్పబడితిని" అని చెప్పెను. రాణియు మంత్రిబృందమును ఆనందము
జెంది, రాజును శిబిరమునకు గొనివచ్చి, శరీరమునకు గుచ్చుకొన్న బాణపుములు
కులను తీసి, గాయములను మాన్పించిరి.

తమపరి రాజహంసుడు యుద్ధమున గల్గిన పరాజయమును, సైన్యనాశ
మును తలచుకొని బాధచెందుచుండగా వసుమతి రాజుజేరి ఇట్లు పల్కెను_
"దేవా ! సర్వరాజన్యులలో శ్రేష్ఠుడవు, గరిష్ఠుడవునైన నీవు వింధ్యాటవిలో
నుండుటచే సంపద జలబుద్బుదప్రాయమని తేలినది. సర్వకార్యములును దైవా
ధీనములే. పూర్వము హరిశ్చంద్రాది చక్రవర్తులును బాధలజెంది, పిదప
రాజ్యముల బొందిరి. నీవును అట్లే కాగలవు. దైవధ్యానము చేయుము".

అంతట రాజహంసుడు తన యభిలాషను ఫలింపజేయగల తపోధను
డగు వామదేవుని కడకేగెను ఆ ఋషిసత్తమునకు ప్రణమిల్లి, ఆయనచే నాతి
థ్యముపొంది, కొంతకాలము విశ్రాంతిగైకొని, రాజ్యాభిలాషగలవాడై చంద్ర
వంశమునకు అలంకారప్రాయుడైన యా రాజహంసుడు మునివరేణ్యునితో
నిట్లనెను_ "పూజ్యుడా ! ప్రబలదైవబలముచే మానసారుడు నారాజ్యమును
గైకొని అనుభవించుచున్నాడు. మీ ఆశ్రయమున నేనును అట్టి ఉగ్రమైన తప
మాచరించెదను." అంతట త్రికాలజ్ఞుడైన తపోధనుడు 'దేహమును కృశింపజేయు
తపస్సు వలదు. వసుమతీదేవి గర్భమున సకల శత్రుజనమర్దనుడగు రాజ
కుమారుడు నిశ్చయముగా జన్మింపగలడు" అని పలికెను. తోడనే ఆకాశవాణి

యును "ఇది సత్యము" అని పలుకగా రాజును అట్లేయని అంగీకరించి ఊరకుండెను.

పిమ్మట గర్భదివసములు నిండగనే వసుమతి ఒకశుభముహూర్తమున సమస్తరాజలక్షణలక్షితుడైన కుమారుని గనెను. పిదప మహారాజు పురోహితుని సలహాప్రకారము ఆబాలునకు జాతకర్మాది సంస్కారము గావించి రాజవాహనుడను పేరుపెట్టెను. రాజవాహనుడు ఆత్మమిత్రులగు మంత్రికుమారులతో పాటు బాల్యక్రీడల ననుభవించుచు వర్ధిల్లుచుండెను.

## 4. మంత్రికుమారుల జన్మవృత్తాంతము.

మగధదేశము నేలిన రాజహంసునకు ధర్మపాల, పద్మోద్భవ, సితవర్మ లను ముగ్గురు అమాత్యులుండిరి. వారు కార్యపర్యాలోచనమునందు బృహస్పతిని తిరస్కరింపజాలిన బుద్ధిగలవారు, రాజునకు అత్యంతవిధేయులు. వారిలో సితవర్మకు సుమతి సత్యవర్మలనువారును, ధర్మపాలునకు సుమంత్ర, సుమిత్ర, కామపాలులనువారును, పద్మోద్భవునకు సుశ్రుత, రత్నోద్భవులను వారును జన్మించిరి. వారిలో ధర్మశీలుడగు సత్యవర్మ సంసారము సారరహితమని ఎఱిగి తీర్థయాత్రాగమనాభిలాషగలవాడై దేశాంతరవాసమున కరిగెను. ఇక కామపాలుడనువాడు విటనట వేశ్యాలోలుడై తండ్రిగారి, అన్నగారి ఆజ్ఞలను ఉల్లంఘించి దేశద్రిమ్మరియయ్యెను. ఇక రత్నోద్భవుడు విదేశవాణిజ్యము నందభిలాషగలవాడై అందలి నేర్పుచే సముద్రముల దాటి వెడలెను. వీరిలో మిగిలినవారు సుమతి, సుమంత్ర, సుమిత్ర, సుశ్రుతులనువారు. వీరు రాజహంసునకు విధేయులై రాజకార్య నిర్వహణమున నిమగ్నులైరి.

రాజహంసుడు మాళవనాథుడైన మానసారునిచే పరాభూతుడై వింధ్యారణ్యమధ్యభాగమున మంత్రి, మిత్ర, అంతఃపురజన సహితముగా కాలక్షేపము జేయుచుండెను. అట్టి సమయమున శత్రుసంహారకుడైన రాజవాహనుడను కుమారుని రాజు వడసెను. ఆసమయమునందే రాజహంసుని అమాత్యులైన సుమతి,

సుమంత్ర, సుమిత్ర, సుశ్రుతులకు ప్రమతి, మిత్రగుప్త, మంత్రగుప్త, విశ్రుతు లను పుత్రులు జన్మించిరి. వారు నవోదయ చంద్రకాంతి గలవారై చిరాయు ష్యము గలవారై రాజకుమారుడగు రాజవాహనునితో కూడి బాల్యక్రీడల తేలి యాడుచుండిరి.

5. ఉపహారవర్మ వృత్తాంతము.

అనంతరము రాజహంసుని కడకు ఒకానొక తాపసి రాజలక్షణ లక్షితు డైన ఒకానొక కుమారుని దెచ్చి రాజునకు సమర్పించి యిట్లుపల్కెను– "ఓ మహారాజా! కుశలను, దర్భలను తెచ్చుటకై నేను అడవికేగినప్పుడు దిక్కులేక దైన్యముగల్గి కన్నీరుగార్చు ఒకయువతి కనబడెను. "ఈ నిర్జనారణ్యమున నే కారణమున నేడ్చు చుంటివని" యడుగగా ఆమె గోళ్ళతో కన్నీళ్ళుతుడిచికొని గద్గదస్వనముతో నిట్లు పల్కెను.

"ఓ మహర్షీ! లావణ్యముచే జయింపబడిన మన్మథుడు గలిగినవాడును, దేవసభలో కీర్తింపబడినవాడును ఐన మిథిలానగరాధిపతియగు ప్రహారవర్మ మగధరాజు ధర్మపత్ని సీమంతోత్సవమునకై పుత్రదార సహితముగా పుష్పపుర మునకు విచ్చేసి కొంతకాలమచ్చట వసించెను. ఆసమయమున పరమేశ్వరాను గ్రహ పాత్రుడైన మాలవనగరాధిపతి మగధరాజుపై దండెత్తి వచ్చి ఘోర సంగ్రామము సల్పెను. ఆయుద్ధమున మిథిల నాయకుడు తన మిత్రుడైన మగధరాజునకు సహాయము చేసి సైన్యముల పోగొట్టుకొని శత్రువు చేజిక్కి కారుణ్యవశమున విడువబడెను. హతశేషులైన వారితో పాటు విదేహరాజు తన పురమునకు వెళ్ళుచుండగా దుర్గమవనమార్గమున శబరసైన్యముచే ముట్టడింప బడి మూలబలముతో అంతఃపుర జనమును రక్షించుకొని పాఱెను. ఆతని కవల పిల్లలకు దాదినైన నేను, నాకూతురును వేగముగ వెళ్ళ మహారాజు ననుసరించ లేకపోయితిమి. అంతనొక భయంకరమైన వ్యాఘ్రము నన్ను భ్రమింగరాగా నేను భయపడి చేతులపైకెత్తితిని. నాచేతినుండిజారిన బాలుడు ఒక కపిల గోశ

వము మాటున జేరెను. అంతలోనే కొందఱు బోయలచ్చటకు వచ్చి వ్యాఘ్రము
మును చంపి, బాలునెత్తికొని చనిరి. మరియొక కుమారు నెత్తుకొనివచ్చు నాకూతు
రెచ్చటి కేగెనో నాకు తెలియదు. అట్టిస్థితిలో మూర్ఛపొందిన నన్ను ఒక
గోపాలకుడు రక్షించి, తనయింటికి చేర్చి గాయముల మాన్పెను. అసహాయు
రాలనగుటచే నాపుత్రిక వార్త తెలియక వ్యాకులత జెందుచుంటిని. ఒంటరి
దాననై ప్రభువును చేరగలను''. ఇట్లని యాదాది బయలుదేరిపోయెను.

''దాది చెప్పినది మొదలు నేను కూడ మీమిత్రుడైన విదేహరాజునకు
కలిగిన యాపదను తలచుకొని దుఃఖించుచు ఒక సుందరమగు కాళికాలయము
చేరితిని. అచ్చట ఈబాలుని దేవతోపహారముగా చేయుటకై బోయవాండ్రు
ఉరితీయుదమా ? ఖడ్గముచే కంఠము ఖండించెదమా ? లేక ఇసుకలో పూడ్చి
బాణములచే గురిపెట్టవలయునా ?'' యని తగవులాడుకొనుచుండిరి. అప్పుడు
బోయలవద్ద కేగి ''నేను ముసలి బ్రాహ్మణుడను. నాకుమారుడు తప్పిపోయి
నాడు. అతనిని ఎవడపహరించెనో ఏమో ! ఎంతవెదకినను కనబడుటలేదు ?
ఆతని ముఖముజూచి అనేక దినములు గడచినవి. మీ రాతనిని చూడలేదా.''
యనిపల్కితిని. అంతబోయలు కరుణించి ''ఇతడు నీపుత్రుడైనచో స్వీకరింపు''
మని నుడివి నాకొసంగిరి. పిదప నీబాలునితో మీసన్నిధి జేరితిని. ఆయుష్మం
తుడైన యాబాలుని పితృరూపులైన మీరు రక్షింతురుగాక.

మహారాజు మిత్రుని ఆపదయే నిమిత్తముగా గల దుఃఖమును ఆతని
కుమారుని చూచుట ద్వారా కొంచెము తగ్గించుకొని ఆబాలునకు ఉపహారవర్మ
యని పేరిడి రాజువాహనునివలె పోషించెను.

## 6. అపహారవర్మవృత్తాంతము.

మహారాజు ఒకానొక పుణ్య దినమునందు తీర్థస్నాననిమిత్తమై పట్టణ
సమీపమార్గమున వెళ్ళుచు ఒక శబర స్త్రీ చేత లాలింపబడు, సుందరాకారుడైన,
సాటిలేని శరీరముగల ఒక బాలకుని జూచి కుతూహలముతో నామెను ఇట్లు

ప్రశ్నించెను- "ఓ అబలా ! సుందరాకారముతో రాజగుణములచే సంపూర్ణు డైన ఈ బాలుడు ఏవంశమున జన్మించినవాడు ? ఇతడు నీవంశమున పుట్టిన వాడు మాత్రముకాదు. కనుక నీబాలుడు ఏకారణముచే నీయధీనమునందున్నాడు? ఉన్నదున్నట్లు చెప్పుము." రాజుమాటలు విని శబరస్త్రీ ప్రణామముచేసి ఇట్లు విన్నవించెను. "ఓరాజా ! మాపల్లెకు సమీపమున వెళ్ళుచున్న మిథిలానగరాధి పతి సర్వస్వమును శబరసైన్యములు అపహరించుచుండగా నాప్రియుడు ఈ కుమారుని అపహరించి నాకర్పించెను. నేనీతనిని ప్రేమతో పెంచుచుంటిని." ఆమె మాటలను రాజువిని మునిచే చెప్పబడిన మిథిలేశుని రెండవకుమారుడని నిశ్చయించి, సామదానోపాయములచే నామెను ఒప్పించి, తన దేవియగు వసు మతి చేతనుంచి యాబాలునకు అపహారవర్మయను నామకరణ మొనర్చెను.

7. పుష్పోద్భవ వృత్తాంతము.

ఒకానొక సందర్భమున వామదేవుని శిష్యుడగు సోమదేవశర్మ యను వాడు ఒకానొకబాలకుని రాజహంసుని కడకుదెచ్చి, ఆతనికర్పించి యిట్లు పల్కెను.

"మహారాజా ! రామతీర్థమున స్నానము ముగించుకొని వెనుదిరిగివచ్చు చుండగా ఒకానొక వనిత సుందరాకారుడైన ఒక బాలకుని ఎత్తుకొని యుం డుట జూచి యిట్లంటిని. 'ఓ ముసలిదానా ! నీవెవ్వతెవు ? ఈ అరణ్యమధ్య మున బాలకునెత్తుకొని ఎందులకు సంచరించుచుంటివి ?' అప్పుడావృద్ధురాలు ఇట్లు సమాధానము జెప్పెను.

'ఓమునీశ్వరా ! కాలయవనద్వీపమున కాలగుప్తుడను ఒకానొక ధనవం తుడైన వైశ్యుడు కలడు. ఆతనికి సువృత్తయను పుత్రిక కలదు. అపురూప సౌందర్యవతియగు నామెను ఈ ద్వీపమునుండి వచ్చిన వాడును, మగధరాజు మంత్రికుమారుడును, సుగుణఖనియును, భూమండలమును చుట్టినవాడును, సుందరుడును, వ్యవహారము తెలిసిన వాడునైన రత్నోద్భవుడను వాడు వివా హము చేసికొని, మామగారి సన్మానముల బడసెను. కాలక్రమమున నామె గర్భిణి

యయ్యెను. తదుపరి సోదరులను చూడవలెనని మామగారికి నచ్చజెప్పి, భార్యను వెంటనిడుకొని, ఓడనెక్కి పుష్పపురమునకు ప్రయాణమయ్యెను. ఉత్తుంగ సముద్ర తరంగములలో జిక్కి ఓడ మునుగగా గర్భిణియైన ఆమెయు దాదినైన నేనును ఒక ఫలకముపై నెక్కి తీరముచేరితిమి. ఇక రత్నోద్భవుడు తీరముజేరెనో, అందేమునిగెనో తెలియదు. కాని గర్భిణియైన సువృత్త ప్రసవ వేదనగలదై అడవిలోని వృక్షమూలమున ప్రసవించెను. సమీపమున ఏదైనను జనపదమును వెదకుచు పసిబాలుని ఎత్తుకొని బయలుదేరితిని. ఇంతలో ఒక యేనుగు సమీపమునకు రాగా ఆమె భయపడి చేతనున్న బాలుని పాఱవైచి పరుగెత్తెను. ఆపసి బాలుని ఏనుగు గ్రహింపబోగా దానిపై ఒక సింహము పడగా భయముతో ఏనుగు ఆపసికూనను ఆకాశములోనికి ఎగురవేసెను. ఆ సమయముననే ఒక ఎత్తైన వృక్షముపై కూర్చున్న వానరము క్రిందపడు బాలకుని పండుగా భావించి పట్టుకొని, పండుకాదని చెట్టుకొమ్మపై ఉంచి వెడలి పోయెను. ఏనుగును చంపిన సింహము వెడలిపోగా పొదలమధ్యన నక్కిన నేను చెట్టుకొమ్మపైనున్న యా బాలునిగైకొని, ఆ స్త్రీనిగానక సంచరించుచు గురువగు వామదేవుని కడకు గొనివచ్చితిని. వారి ఆజ్ఞానుసారము బాలుని మీ వద్దకు దెచ్చితిని". అని సోమశర్మ రాజునకు దాదిద్వారా తెలిసిన వృత్తాంతము చెప్పెను.

మహారాజు అతని మాటలువిని "మిత్రులందరకును ఒకేసారి ఆపద కల్గెను. ఏమి విధివైపరీత్యము" అని చింతించుచు ఆ బాలునకు పుష్పోద్భవుడని పేరుపెట్టి జరిగిన వృత్తాంతమంతయు సుశ్రుతునకు తెలియ జెప్పి ఆ బాల కుని సుశ్రుతున కప్పగించెను.

## ౪. అర్థపాల వృత్తాంతము.

రాజహంసుని భార్య వసుమతీదేవి ఒకనాడు ఒకబాలు నెత్తుకొని రాజు కడకువచ్చి రాత్రి స్వప్నమున ఒకదివ్యవనిత ప్రత్యక్షమై తనకు సమర్పించె నని తెలుపుచు ఆ దివ్యస్త్రీ చెప్పిన వృత్తాంతమునే రాణి యిట్లు చెప్పెను.

"రాజహంసుని మంత్రియైన ధర్మపాలుని కుమారుడు కామపాలుడుం డెనుగదా ? అతని భార్యనే నేను. 'తారావళి' యనుపేరుగల యక్షకాంతను. నాతండ్రి మణిభద్రుడు. యక్షరాజుయొక్క ఆజ్ఞానుసారము చతుస్సముద్ర యుక్తభూమండలమున కాధిపత్యము వహించు రాజవాహనునకు పరిచర్యానిమిత్తమై ఈ బాలుని దెచ్చితిని. మన్మథసమానుడగు నీతనిని పెంచుము". అని పల్కి నాచేత నీబాలకుని పెట్టి అదృశ్యమయ్యెను.

రాజహంసుడును రాణి చెప్పిన వృత్తాంతమును సవివరముగా విని కామపాలునకు యక్షకాంతాసంగమమును గూర్చి యాలోచించుచు, ఆశ్చర్యపడుచు మంత్రియగు సుమిత్రుని పిలచి "ఈ బాలకుడు నీసోదరుని పుత్రుడ"ని చెప్పి అప్పగించెను. ఆ బాలునకు అర్థపాలుడని నామకరణముజేసిరి.

9. సోమదత్త వృత్తాంతము.

అంతట నొకనాడు వామదేవుని శిష్యుడొకడు మన్మథస్వరూపము గల్గిన సుందరుడైన బాలకునిదెచ్చి రాజహంసున కర్పించి జరిగిన వృత్తాంతమిట్లు పూసగ్రుచ్చిన యట్లు చెప్పెను.

మహారాజా ! నేను తీర్థయాత్రలజేయుచు కావేరీతీరమునుజేరి, అచ్చట ఒక బాలునెత్తుకొని ఏడ్చు వృద్ధ స్త్రీని గాంచి యిట్లు పల్కితిని. "ఓముదుసలిదానా ! నీవెవ్వతెవు ? ఈ బాలుని తండ్రిపేరేమి ? నీవు ఈ యడవికి ఎందులకు వచ్చితివి ? ఎందుల కేడ్చుచుంటివి ?" అవృద్ధ స్త్రీ కన్నీటిని తుడుచుకొని తనదుఃఖమునకు కారణమువిట్లు చెప్పెను.

ఓ బ్రాహ్మణకుమారా ! రాజహంసుని అమాత్యుడైన సితవర్మ పుత్రుడు సత్యవర్మ తీర్థయాత్రాభిలాషచే నీదేశమునకు వచ్చి, కాళియను పేరుగల ఒక బ్రాహ్మణకన్యను వివాహమాడెను. కాళికి సంతానము కలుగనందున కొంత

కాలమునకు గౌరియను నామెచెల్లెలిని వివాహమాడి సత్యవర్మ ఒక కుమారుని బొందెను. అంత కాళి మిక్కిలి అసూయగలదై దాదినైన నాతో పాటు కుమారుని వెంటనిడుకొని నదిలోవైచెను. ఒక చేతితో బాలుని ఎత్తిపట్టి, రెండవ చేత నీదుచువెళ్ళుచు ఒక వృక్షశాఖను పట్టుకొనగా దానికి వ్రేలాడు ఒక సర్పము నన్ను కరచెను. తదుపరి యా తరుశాఖ అలల తాకిడిచే తీరముజేరినది. విషతీవ్రతచే నేను అరణ్యమున చనిపోయినచో ఈ బాలునకు రక్షకుడెవ్వడని తలంచుచుంటిని.

అనంతరము విషము శరీరమంతటను ప్రాకగా ఆవనిత భూమిపై విల విల దన్నుకొనుచు ప్రాణముల విడిచెను. తదుపరి ఆమె శవమునకు అగ్నిసంస్కారాదుల నిర్వర్తించి బాలుని తండ్రియైన సత్యవర్మ నివాసస్థానము తెలియకపోవుటచే మీమంత్రికుమారుని మీకే అప్పగించుటకు తెచ్చితిని-అని వామదేవుని శిష్యుడు విన్నవించెను.

మహారాజు అనిశ్చితమైన సత్యవర్మ వృత్తాంతము దలచుకొనుచు దుఃఖితుడై యాకుమారునకు సోమదత్తుడని నామకరణమొనర్చి తన మంత్రియగు సుమతికి సమర్పించెను.

### 10. మాతంగుని వృత్తాంతము.

మగధదేశాధిపతియగు రాజహంసుని కుమారుడైన రాజవాహనుడు వింధ్యారణ్య మధ్యమున మంత్రికుమారులతో గూడి, సమస్తవిద్యల నభ్యసించి, పెరిగి పెద్దవాడయ్యెను. అంతట నొకనాడు వామదేవుడు అచ్చట కేతెంచి, మన్మథ సౌందర్యముతో నొప్పారు రాజకుమారుని, మంత్రి కుమారులను చూచెను. రాజుచే సత్కారము బొందిన వామదేవుడు 'రాజవాహనునకు దిగ్విజయ యాత్రకై ఏర్పాట్లు చేయుము. నీశత్రువులు నశించెదరు' అని విన్నవించెను. అంత మహారాజు మంత్రికుమారులను సహాయముగనిచ్చి రాజవాహనునకు తగిన రీతిగా నుపదేశించి ఒక శుభముహూర్తమున విజయ ప్రాప్తికై సపరివారముగ పంపెను,

అంత రాజవాహనుడు విజయ యాత్రకై వెడలి వింధ్యారణ్య మధ్య భాగమును ప్రవేశించి అచ్చట యజ్ఞోపవీతము ధరించిన బోయవానివలె నున్న ఇనుము వంటి కర్కశ శరీరము గల ఒక పురుషుని జూచెను. 'బ్రాహ్మణోచితమైన యజ్ఞోపవీత ధారణము, కిరాతోచితమైన శస్త్రధారణమును, పరస్పర విరుద్ధము. ఏకాకివై ఈ వింధ్యారణ్యమున ఏల నివసించుచుంటివి,' అని రాజవాహనుడు ఆ పురుషుని ప్రశ్నించెను. అంతట రాజకుమారునితో బోయవాడిట్లు పలికెను.

'రాజకుమార ! ఈ యడవిలో వేదాభ్యాసముమాని కులాచారము వదలిన యెందరో బ్రాహ్మణులు బోయవారితో కలిసి నివసించుచున్నారు. మాతంగుడను పేరుగల నేను కూడ ఆ కోవలోని వాడనే. బోయవారితో కలిసి, పల్లెలలో ప్రవేశించి, ధనికులను కొల్లగొట్టి, ధనముల నపహరించి, దయలేని వాడనై తిరిగితిని. అంతట ఒకనాడు నామిత్రులు ఒక బ్రాహ్మణుని చంపబోవుచుండగ 'ఓ పాపులారా ! బ్రాహ్మణుడు చంపదగినవాడు కాడ'ని వారితో చెప్పితిని. చివరకు ఆబోయలతో జగడమాడి, యుద్ధము చేసి చనిపోయితిని. పిమ్మట యమలోకమునకు వెళ్ళి, యమునకు నమస్కరించగా ఆతడు నన్ను చూచి చిత్రగుప్తునితో నిట్లనెను. 'ఇతనికి మృత్యుసమయముకాదు. ఇతని చరిత్ర నింద్యమైనను బ్రాహ్మణుని రక్షించుటకై ప్రాణముల కోల్పోయెను. కనుక ఇతడు పూర్వశరీరమునే పొందునుగాక'. చిత్రగుప్తుడును యమలోకమునందలి భయంకరదృశ్యములను చూపించి నన్ను పంపించివైచెను. అంతట నేను మరల పూర్వశరీరమునే పొందితిని. నాచే రక్షింపబడిన బ్రాహ్మణుడు నాప్రక్కనే యుండెను. ఆతని వలన అక్షరజ్ఞానమును, సదాచారమును శివపూజావిధానమును నేర్చుకొంటిని. ఓ రాజవాహనా ! నీకు చెప్పవలసిన రహస్యముకూడ కలదు'.

పిదప మాతంగుడు రాజకుమారుని దూరముగా కొనిపోయి యిట్లు చెప్పెను. 'ఓ రాజ ! గడచిన రాత్రి శివుడు నాస్వప్నమున గన్పించి, దండకారణ్య మధ్యమునందు సిద్ధులచే పూజింపబడు స్ఫటిక లింగము వెనుక

నొక రంధ్రము కలదు. అందు ఒక తామ్ర శాసనము కలదు. దానిపై నిర్దేశింప బడిన విధానము ననుసరించినచో పాతాళము నేలగలవు. నీకు సాయముచేయ గల రాజకుమారుడు నేడో రేపో రాగలడు'. అని చెప్పెను. కనుక ఓ రాకు మారా! నాకు సహాయము చేయుమని మాతంగుడు కోరెను. అతని కోరిక ననుసరించి మాతంగునితో పాటు బిలద్వారమున రాజవాహనుడు రసాతలము చేరెను. అచ్చట మాతంగుడు శాసన నిర్దిష్టమైన విధానముచే హోమము గావించి, అగ్నిహోత్రమున మంత్రపూర్వకముగా తన దేహమును ఆహుతి గావించి, పిమ్మట ప్రకాశించు దివ్యదేహమును పొందెను. తదుపరి మణిమయభూషితయైన ఒక కన్యక హంసనడకలతో నేతెంచి మాతంగునకు ఒక మణిని కానుకగా నిచ్చెను. మాతంగుడును నీవెవ్వతవని ఆమె నడుగగా అంజలి ఘటించి ఆమెయిట్లు పలికెను. 'ఓ బ్రాహ్మణోత్తమా! ఈ రసాతలాధిపతియగు ఒక రాక్షసుడు నాతండ్రి. దేవతలనే మించిన నా తండ్రిని జూచి, విష్ణువు సహింప జాలక అతనిని చంపెను. నాపేరు కాళింది. తండ్రిమరణమునకు దుఃఖపడుచుండగ, ఒక దయగల సిద్ధ తాపసుడు నా చెంత కేతెంచి, ఒక దివ్యదేహధారియైన మనుష్యుడు నీకు భర్తయై రసాతలము పాలింప గలడని చెప్పెను'.

మాతంగుడు కాళిందివృత్తాంతము విని, ఆమెను చేపట్టి రసాతలమున కధిపతియై శోభిల్లి రాజవాహనునకు తన కృతజ్ఞతను దెలిపెను. తదుపరి రాజకుమారుడు భూలోకమునకు పోగోరి, మాతంగుని వలన ఆకలిదప్పులను పోగొట్టు మణిని పొంది పూర్వ బిల మార్గమున భూలోకమునకు వచ్చి, ఒక యుద్యానవనమున మిత్రుడైన సోమదత్తుని కలుసుకొనెను.

## 11. వామలోచన వృత్తాంతము.

రసాతలాధిపతియగు మాతంగుని వద్ద సెలవుగైకొని రాజవాహనుడు భూలోకమునకు రాగా, అచ్చట మిత్రులగు మంత్రికుమారులను గానక ఉద్యాన వనమున ప్రవేశించెను. అచ్చట తన మిత్రుడగు సోమదత్తుని గాంచి,

అతనిద్వారా వామలోచనను సోమదత్తుడు వివాహమాడిన వృత్తాంతము నిట్లు తెలుసుకొనెను.

మాతంగునితో రాజవాహనుడు రసాతలమునకు వెళ్ళగా అతనిని వెదకుచు అతని మిత్రులును బయలుదేరిరి. ఒక్కొక్కరొకమార్గమున వెళ్ళగా సోమదత్తుడును ఒక మార్గము ననుసరించి వెళ్ళజొచ్చెను. ఆకలిని తీర్చుకొనదలచిన సోమదత్తుడు మార్గము నందలి నదమున దిగి అచట ఒకమణిని పొందెను. ఇక ఎండవేడిమికి అచ్చట నిలువజాలక మణినిగైకొని ఆయడవిలోనున్న ఒక దేవళమును జేరి అందు ఒక బహుపుత్రులు గల బ్రాహ్మణుని జూచెను. కుశలమడుగగా సోమదత్తునకా బ్రాహ్మణుడిట్లు బదులు పల్కెను. "తల్లిలేని ఈ పిల్లలను భిక్షమెత్తి రక్షించుటకై ఈ శివాలయమున నున్నాను". సోమదత్తుడు ఆదేశమునేలు రాజు వృత్తాంతము చెప్పుమనగా ఆ బ్రాహ్మణుడిట్లు చెప్పదొడగెను.

'లాటదేశపు రాజు మత్తకాలుడు ఈదేశపురాజగు వీరకేతుని కుమార్తె వామలోచనను వివాహమాడదలచెను. కాని వీరకేతుడు కూతురు నిచ్చుట కొప్పుకొననందున మత్తకాలుడు పాటలీనగరమును ముట్టడించెను. అప్పుడు వీరకేతుడు భయపడి తన కూతురును మత్తకాలున కర్పించెను. మత్తకాలుడు వామలోచన లభించుటచే సంతసించి ఆమెను వెంటబెట్టుకొని వెళ్ళుచు వేటకై ఇచట శిబిరమును వేయించెను. ఈ అడవిలోనే వీరకేతుని మంత్రి మానపాలుడనువాడు చతురంగబలములతో మరియొక శిబిరమున నుండి తన ప్రభువునకు కల్గిన అవమానమునకు ప్రతిక్రియల నాలోచించెను'.

బ్రాహ్మణుని వలన వృత్తాంతమంతయును తెలుసుకొని సోమదత్తుడు బ్రాహ్మణుని దారిద్ర్యమునకు చింతించి తనకు దొరికిన రత్నమును అతని కిచ్చెను. రత్నమును గైకొని బ్రాహ్మణు డెచ్చటికోవెళ్ళి కొందరు ఖడ్గధారులచే బంధింపబడి మరల సోమదత్తుని కడకేతెంచి రత్నము నిచ్చిన జీతడేయని వారికి చూపించెను. ఆ భటులును బ్రాహ్మణుని విడచి సోమదత్తుని బంధించి

కారాగారము వద్దకు గొనిపోయి, "వీరే నీ మిత్రు"లని, కొందరిని చూపించి కారాగారమున బడద్రోసిరి. సోమదత్తుడును బంధింపబడిన వారిని మానపాలుని భటులని తెలిసికొని, రత్నమును దొంగిలించుటచే బంధింపబడిరని ఎరిగి వారితో స్నేహముగ నుండెను. పిదప అర్ధరాత్రమునలేచి, గొలుసులను త్రెంచి, ఎదురైన రక్షక భటులను చంపి మానపాలుని భటులను వెంటబెట్టుకొని సోమదత్తుడు మానపాలుని సన్నిధిజేరెను. సేవకులవలన మానపాలుడు సోమదత్తుని వృత్తాంతమరసి, అతనిని గౌరవించెను.

మరుసటి దినమున మత్తకాలుని భటులు మానపాలుని కడకేతెంచి "ధనముల నపహరించితెచ్చిన దొంగలను అప్పగింపుమ" ని బెదరించిరి. మానపాలుడు జంకక మత్తకాలుని గూర్చి నోటికి వచ్చినట్లుగా నిందించెను. భటుల వలన మానపాలుని వరుసనెఱిగిన లాటపతి కోపించి ససైన్యుడై యుద్ధమునకు తలపడెను. మానపాలుడు మొదలే యుద్ధమునకు సన్నద్ధుడై యుండుట వలన ముందుకునడచి ససైన్యముగా మత్తకాలు నెదుర్కొనెను. సోమదత్తుడును ఆ యుద్ధమున మానపాలునకు శత్రువులను సంహరించుటలో సహాయ మొనర్చి చివరకు మత్తకాలుని శిరస్సును ఖండించెను. విజయము మానపాలునకే దక్కెను. సోమదత్తు డొనర్చిన సహాయమునకు మానపాలుడు మిక్కిలి సంతసించెను. మత్తకాలుని మరణవార్తను విన్న వీరకేతుడును సంతోషముతో వచ్చి సోమదత్తుని పరాక్రమమును విని, తనకూతురగు వామలోచన నిచ్చి వివాహము గావించెను. పిదప యౌవరాజ్యపట్టాభిషిక్తుడైన సోమదత్తుడు సతీ సమేతముగ సుఖముల ననుభవించుచు మిత్రదర్శనమునకై బయలుదేరెను. ఒకసిద్ధుని ఆజ్ఞానుసారము మహాకాళమునకు వచ్చుచుండగా సోమదత్తునకు రాజవాహనుని దర్శనమయ్యెను.

## 12. పుష్పోద్భవుడు తల్లిదండ్రులతో కలియుట.

రాజవాహనుడు మాతంగునితోపాటు రసాతలమునకు వెళ్ళిన మార్గమును కనుగొన జాలక మంత్రికుమారుడైన పుష్పోద్భవుడు సంచరించుచు ఒక పర్వత

సమీపమునందలి చెట్టునీడలో కూర్చుండెను. ఇంతలో ఒక మనుష్యుడు పర్వతముపై నుండి క్రిందికి పడుచుండుట గమనించిన పుష్పోద్భవుడు ఆతనిని మధ్యలోనే పట్టుకొని భూతలమునందుంచెను. అతిదూరము నుండి క్రిందపడుటచే స్పృహ గోల్పోయిన యాపురుషుని శీతలోపచారముచే మేల్కొలిపి, యాతనిని పర్వతమునుండి క్రింద పడుటకు గల కారణమేమియని పుష్పోద్భవుడు ప్రశ్నించెను. అంతనాపురుషుడు కన్నీరును వ్రేళ్ళతో తుడుచుకొనుచు ఇట్లు పలికెను– "నేను మగధరాజు మంత్రియైన పద్మోద్భవుని కుమారుడను. పేరు రత్నోద్భవుడు. వ్యాపారనిమిత్తమై కాలయవనద్వీపము చేరి అచ్చట ఒక వర్తకుని కుమార్తెను వివాహమాడి సముద్ర మార్గమున వచ్చుచుండగా నావ నీటిలో మునిగినది. దైవానుగ్రహము వలన నేను తీరము చేరితిని. ఇంత వరకు నాభార్యా వియోగముచే అనవరతము బాధపడుచు ఒక సిద్ధతాపసుని ఆదేశాదరములతో పదునారు సంవత్సరముల గడిపితిని. ఇక ప్రియురాలి విరహమును సహింప జాలక ఇట్లు పర్వతముపైనుండి దూకితిని".

ఆసమయమునందే ఒక స్త్రీ ఆర్తనాదము జేయుచు 'సిద్ధుల ఆదేశానుసారము పతి పుత్రుల సమాగమము జరుగగలదు. అగ్నిప్రవేశము కూడదు' అన్నమాటలను పుష్పోద్భవుడు విని స్త్రీ రక్షణమునకై బయలుదేరెను. అట్లు కొంత దూరమువెళ్ళగా భయంకర పావక జ్వాలలో పడుటకు సాహసించు వనితను అచ్చటినుండి తొలగించి ఆమె దాదితో పాటు పుష్పోద్భవుడు రత్నోద్భవుని కడకు గొనివచ్చెను. ఆ వనిత అగ్నిలో పడుటకు కారణమేమిటని దాది నడుగగా ఆమె యిట్లు పల్కెను–

"కాలయవనద్వీపము నందలి కాలగుప్తుని కూతురైన ఈమెపేరు సువృత్త. భర్తయగు రత్నోద్భవునితో కలసి సముద్ర ప్రయాణమున వచ్చుచుండగా ఓడమునిగెను. దాదినైన నాతోగూడ ఒక ఫలకము నూతగొని ఒడ్డుజేరి గర్భవతియగుటచే ఆయడవిలోని ఒక చెట్టుక్రింద ప్రసవించెను. కాని దౌర్భాగ్యవశమున ఆ బాలుని ఒక మదగజము అపహరించెను. పదునారు సంవత్సరములకు పతి పుత్రసమాగమము జరుగ గలదను సిద్ధాదేశము ప్రకారము ఒక

పుణ్యాశ్రమమున నుండి, నిరాశ జెంది అగ్నిప్రవేశమునకు పాల్పడినది". అప్పుడా పుష్పోద్భవుడు వారిని తన తల్లిదండ్రులుగా గుర్తించి దండప్రణామము లాచరించెను. వారును పుష్పోద్భవుని తమ పుత్రునిగా నెఱింగి మహదానందము పొందిరి. ఉభయకుశలోపరి తల్లిదండ్రు లిద్దరిని ఒక ఆశ్రమమునందుంచి రాజవాహనుని వెదకుచు పుష్పోద్భవుడు బయలుదేరెను. మార్గమధ్యమున పుష్పోద్భవుడు శిష్యగణములను సంపాదించి, భూమిలో నిక్షిప్తమైన ధనరాసులను సిద్ధాంజనముతో తెలుసుకొని, వెలికితీసి వైశ్యకుమారుడగు చంద్రపాలునితో కూడి ఉజ్జయినీనగరము జేరెను.

## 13. బాలచంద్రికా వృత్తాంతము.

పుష్పోద్భవుడు అపారధనరాసులను వెంట నిడుకొని చంద్రపాలుడను వైశ్యకుమారునితో పాటు ఉజ్జయినీ నగరమును ప్రవేశించెను. అచ్చట ఆతడు చంద్రపాలుని తండ్రి బంధుపాలునితో గూడి మాళవమహారాజు కడకేగెను. రాజు అనుమతితో రహస్యముగా నుండి రాజవాహనుని కొరకు ఆతడు అరణ్యభూములలో వెదకుచుండెను. అట్టి సమయమున బంధుపాలుడు పుష్పోద్భవునితో "మీ ప్రభువును దర్శించుటకు తగిన సమయము చెప్పెదను. మానసిక బాధను వదలి ఊరకుండుము" అని విన్నవించెను.

పుష్పోద్భవుడు బంధుపాలునిచే ఆశ్వాసింపబడియుండ బాలచంద్రికయను పేరు గల ఒక వైశ్యయువతి పరిచయము అతనికి ఏర్పడెను. ఆమె గొప్ప సౌందర్యవతి. వైశ్యమందిరమున ఆమె లక్ష్మీవలె నుండెను. పుష్పోద్భవుడు ఆమె లావణ్యమునకు లోబడై, మన్మథావిష్టహృదయుడై యుండెను. బాలచంద్రికయును వాలుగన్నులతో, రహస్యచేష్టలతో పుష్పోద్భవునకు తన మానసికావస్థను తెలిపెను. అందువలన ఆమెను ఏకాంతముగా కలుసుకొన వలెనను తలంపుతో అతడు ఒక ఉద్యానము జేరగా అచ్చటికి బాలచంద్రికయును ఏతెంచెను.

విహారవనమున చింతాక్రాంతయై దీనవదనము గల బాలచంద్రికను చూచి పుష్పోద్భవుడు బాధ జెందుటకు కారణమేమిటని ప్రశ్నించెను. అంత నా బాలచంద్రిక యిట్లు చెప్పదొడగెను-

"ఈ దేశమునకు రాజు మానసారుడు. ఆతడు వృద్ధాప్యమున రాజ్యము చేయనొల్లక రాజ్యభారమును తన కుమారుడైన దర్పసారుని యందుంచి, ఆతనికి సహాయులుగా చండవర్మ దారువర్మలను రాజ్యతంత్రమున నియోగించి, తపశ్చర్యా నిమిత్తమై కైలాసనగమునకేగెను. అందు చండవర్మ శత్రు భయంకరుడై నిల్చి రాజ్యమును పాలించెను. కాని దారువర్మ మాత్రము అట్లుగాక దారుణ కృత్యములను జేయుచు పరధనములను పర స్త్రీల నపహరించుచు పాప కృత్యములను చేయసాగెను. అట్టి దారువర్మ నాపై మరులు గొని యున్నాడు. ఆ క్రూరుని బారినుండి ఎట్లు తప్పించుకొనవలయునని బాధ చెందుచున్నాను".

పుష్పోద్భవు డామె మాటలను విని "ఓ బాలచంద్రికా! దారువర్మవలని భయమును చెందకుము. 'నిన్నొకయక్షుడు ఆవరించియున్నటుల, శోభన గృహమున నాయక్షుని ఎవడు పరిహరించునో అతడే భర్తగాగలడని' సిద్ధాదేశమైనటుల ప్రచారము చేయుము. ఈ విషయము తెలిసికొని దారువర్మ నీపై ఆశవదలుకొన్నను మంచిదే. అట్లయ్యును నిన్నుబొంద ప్రయత్నించినచో నచ్చటికి నేను నీసఖివేషమున వచ్చి దారువర్మను సంహరించెదను". అని వక్కాణించెను. అంత నాబాలచంద్రిక పుష్పోద్భవుని పల్కులను విని, చింత వదలి, అనురాగముతో నాతనిని మరలి మరలి వెనుదిరిగి చూచుచు వెళ్ళిపోయెను. బంధుపాలుడును పుష్పోద్భవుని సమీపించి, పక్షిశకునము ననుసరించి మాసము గడచిన పిదప రాజవాహనుని దర్శనము జరుగగలదని విన్నవించెను.

పుష్పోద్భవుని ఆలోచన ననుసరించి బాలచంద్రిక "తనపై నొక యక్షుడు ఆవరించి యున్నాడ" ని ప్రచారము చేసెను. దారువర్మ యా వార్త విని బాలచంద్రికపై నావరించిన యక్షుని పారద్రోలుటకే నిశ్చయించి శోభన గృహమున ప్రవేశించెను. మొదట అనుకున్న ప్రకారము పుష్పోద్భవుడు స్త్రీ వేషమును దాల్చి శోభన మందిరమున కూర్చొనియుండెను. లోపల ప్రవేశించిన దారువర్మ సఖీవేషధారణమున నున్న పుష్పోద్భవునకు అనేకములయిన కానుకల నర్పించి పైని బడబోయెను. పుష్పోద్భవుడును సమయము జూచి ఆతనిని పిడికిలితో గ్రుద్ది, కాళ్ళతో తన్ని, చంపివైచి, బాలచంద్రిక

నోదార్చి, తనవేషమును సవరించుకొని మందిరము వెలుపలికి వచ్చి దారువర్మ మరణవార్త వినిపించెను. పురజనులా వార్తవిని, నమ్మి వెళ్ళిపోయిరి.

అంత కొంతకాలమునకు పుష్పోద్భవుడు బాలచంద్రికను శోభన మందిరమున కలుసుకొని సిద్ధాదేశము ననుసరించి యక్షుని బారద్రోలితినని అందరకు తెలియపరచి యామెను వివాహమాడెను. ఈ వృత్తాంతమునే పుష్పోద్భవుడు నగర బాహ్యోద్యాన ప్రదేశమున కన్పించిన రాజవాహనున కెరింగించెను.

## 14. అవంతిసుందరీ పరిణయ వృత్తాంతము.

బాలచంద్రికను వివాహమాడి పుష్పోద్భవుడు రాజవాహనునితో కలసి అవంతికానగరమును ప్రవేశించెను. పుష్పోద్భవుడు తన మామయగు బంధుపాలునితో రాజవాహనునకు పరిచయము గావించి తనయింటనే ఆతనిని ఉంచుకొనెను.

ఇట్లు కొన్నిదినములు గడచిన పిదప వసంత ఋతువు ప్రవేశించెను. ఉద్యానవనములు పుష్ప సంభరితములై మనోజ్ఞములై యుండెను. చూత శాఖలపై నెక్కిన పరభృతములు కలకంఠములతో నాదములచేయుచుండెను. అట్టి మనోహరమైన వేళలో మాళవరాజు కూతురైన అవంతి సుందరి మన్మథ పూజ చేయుటకై బాలచంద్రికాది సఖీజనముతో కూడి నగరము వెలుపలనున్న ఉద్యానవనమున ప్రవేశించెను. అవంతి సుందరి యొక్క రూపసంపదను గూర్చి ఇదివరకే వినియున్న రాజవాహనుడు మిత్రుడైన పుష్పోద్భవుని వెంట నిడుకొని ఆ ఉద్యానవనమునందే ప్రవేశించెను. పుష్పోద్భవుని ప్రియురాలైన బాలచంద్రిక సలహా ననుసరించి రాజవాహన పుష్పోద్భవులు అవంతి సుందరి చెంతకు జేరిరి.

మన్మథ పూజా సమయమున విచ్చేసిన రాజవాహనుని చూచిన అవంతి సుందరి ఆతనిని సాక్షాత్తు మదనునిగా భావించి, ఆతని మనోజ్ఞసౌందర్యము

నకు ముగ్ధురాలయ్యెను. అతనిని చూడగనే అవంతిసుందరి హృదయమున ప్రణయాంకురములు మొలకలెత్తెను. వెంటనే ఆమెలో లజ్జా భావము నిలు వెల్ల వ్యాపించెను. తోడనే రాజవాహనుని ముందు ఆమె నిలువజాలక చెలి కత్తెలమాటు జేరెను. రాజవాహనుడును ఆమె ముగ్ధమోహన సౌందర్యమును గ్రోలుచు, ప్రణయమగ్న మానసుడయ్యెను. అట్టి సమయమున బాలచంద్రిక కల్పించుకొని అవంతిసుందరిని జేరి ''ఇతడు విప్రకుమారుడు. ఇతనిని సత్కరించవలయు''నని చెప్పెను. బాలచంద్రిక చెప్పగానే అవంతిసుందరి ఇంచుక సిగ్గును వదలి రాజవాహనునకు సకల మర్యాదలను హృదయ పూర్వ కముగా నొనరించెను.

రాజవాహనుడును అవంతిసుందరిని గాంచి ''ఈమె నా పూర్వజన్మ మున యజ్ఞవతి యను పేరుతో నున్న స్త్రీయే కావచ్చును" అని వితర్కించి అట్లయినచో ఈమెకు తప్పక పూర్వజన్మ జ్ఞానముండవలయును. ఆ స్మృతులను జ్ఞప్తికి దెచ్చెదనని తలంచెను. ఇంతలో గగనవిహారము జేయుచు ఒక రాజ హంస అచ్చట కేతెంచెను. అవంతిసుందరి ఆ రాజమరాళమును చూచి పట్టి తెమ్మని బాలచంద్రికను పంపెను. అదే మంచిసమయమని తలంచిన రాజ వాహనుడు అవంతిసుందరికి పూర్వజన్మ పరిజ్ఞానము కలిగించు తలంపుతో నిట్లు చెప్పదొడగెను–

"ఓ సుందరీ ! పూర్వము శాంబుడను మహారాజు తన ప్రియురాలితో కూడి సరోవరప్రాంతమునకు విహారమునకై వెడలెను. అచ్చట నిద్రించుచున్న ఒక రాజహంసను చూచి, పట్టుకొని, తామరతూడులతో బంధించి తనప్రియ తమకు చూపించుచు, ఇది ఎట్లెగురగలదో చూడవలయునని పల్కెను. అంత నా రాజమరాళము ఋషి రూపముదాల్చి 'ఓరీ పాపీ ! అర్చనాపరుడనై అను ష్ఠానవిధి యందున్న నన్ను నిష్కారణముగ బంధించి పరాభవించితివి. కనుక నీకు ప్రియావియోగము సంభవింప గలద"ని శపించెను. అంత నారాజు రాజహంస స్వరూపమును దాల్చియున్న ఆ ఋషిశ్రేష్ఠునకు నమస్కరించి ''నా ప్రియురాలి ఎడబాటును సహింప జాలను. నన్ను మన్నించి కాపాడి శాప విముక్తి కల్పించుము''ని ప్రార్థించెను.

అంతట నామునిశ్రేష్ఠుడు దయాపరీత మానసుడై రాజుతో యిట్లు పల్కెను- "రాజా ! నా పల్కులు మృషగావు. కనుక భవిష్యజ్జన్మమున నీకాంత నూతన శరీరము దాల్చి నిన్ను వివాహమాడగలదు. రెండు క్షణములు నా పాదములను బంధించి నందులకు రెండు మాసముల కాలము వెండి సంకెలలతో బంధింపబడి ప్రియురాలి విరహముచే బాధజెందెదవు. కాని నీకు ఎల్ల వేళల పూర్వజన్మజ్ఞాన" ముండగలదు.

కనుక ఓ అవంతి సుందరీ ! శాంబుడు హంసను బంధించి ఆపదను పొందెను. కావున నీవును హంసను బంధించ వలద"ని రాజవాహనుడనెను. అవంతిసుందరియును ఆతని పల్కులను విని, ఆతనిని తన భర్తగా నెఱిగి సానురాగముగా రాజవాహనుని చూడసాగెను.

ఆ సమయముననే మాళవరాజు దేవేరి తన కుమార్తె చేయు మదనోత్సవమును చూడదలంచి ఉద్యానవనమున కేతెంచెను. మహారాణి రాకను దూరమునుండియే గమనించిన బాలచంద్రిక రాజవాహన పుష్పోద్భవులను పొదల మాటున దాగియుండుడని సైగజేసెను. బాలచంద్రిక సూచించినట్లుగా వారు పొదరిళ్ళ మాటున అట్లే దాగియుండిరి. తదుపరి అవంతిసుందరి కొలది క్షణములు చెలికత్తెలతో క్రీడించి మహారాణితోపాటు అంతఃపురమునకు బోవనెంచి మరాళముతో యిట్లనెను- "ఓ రాజహంసా ! నేను వెళ్ళుచుంటినని నాపై ప్రేమ వీడకుము" అని.

ధ్వని గర్భితములయిన రాకుమారి మాటలను విన్న రాజవాహనుడు విరహతప్తహృదయుడై భవనమున కరిగెను. అవంతిసుందరియు రాజవాహనుని చూచినది మొదలు విరహము ననుభవించుచు అన్యాక్రాంత మనస్కయై యుండెను. రాజకుమారి ప్రియసఖియయిన బాలచంద్రిక "ఈమె విరహ బాధను పోగొట్టగలవాడు రాజవాను డొక్కడే" యని తలంచి రాజకుమార్తె ఇచ్చినలేఖను గైకొని రాజవాహనుని కడకేగి ఆతనికా లేఖ నందించెను. ప్రియు

రాలి లేఖను జదివిన రాజవాహనుడు బాలచంద్రికతో "నేనును ఆమెను చూచి నది మొదలు విరహమున బాధ పడుచుంటిని. కావున నన్ను గాఢముగా ప్రేమించిన యవంతి సుందరిని ఎట్లయినను కలువ గలను. అంతఃపురము ప్రవేశించుట కష్టసాధ్యము. ఉపాయము నాలోచించి వచ్చి కలసెద"నని తెలుపుము అని పల్కెను. బాలచంద్రికయు నట్లేయొనర్చెను.

తదుపరి రాజవాహనుడు పుష్పోద్భవునితో పాటు పురబాహ్యోద్యాన వనమునకు జేరి అచ్చట తన ప్రియురాలిని గూర్చి తలంచుచు విరహ బాధనను భవించు చుండెను. అట్టి సమయమున మణిమయ కుండలములను ధరించిన ఒక బ్రాహ్మణుడు బోడితలలుగల బ్రహ్మచారులతో కూడి రాజవాహనుని చెంత కేతెంచి ఆశీర్వదించెను. రాజవాహనుడును ఆ బ్రాహ్మణోత్తముని జూచి "తమ రే విద్యలో నిపుణులు ? ఎందుల కేతెంచితిరి" అని పల్కెను. ఆబ్రాహ్మణుడు "విద్యేశ్వరుడను పేరుగల ఇంద్రజాలికుడ"నని తెలిపెను. ఎందరో రాజశ్రేష్ఠుల దర్శించి, ఇంద్రజాల విద్యలో వారి మెప్పులను బొందితినని రాజవాహనున కెరింగించెను. పిదప పుష్పోద్భవుని ద్వారా రాజవాహనుని ప్రణయవృత్తాంతమును తెలుసుకొని "నేను ఇంద్రజాల విద్యతో మాళవరాజును భ్రమింపజేసి అందరి సమక్షమున అవంతిసుందరీ రాజవాహనుల వివాహము గావించెద"నని బాసచేసెను. రాజవాహనుడును ఆతని పల్కులను విని, సంతుష్టహృదయుడై ఈ విషయమును బాలచంద్రికద్వారా అవంతిసుందరికి తెలియజేసెను.

అంతట నొకనాడు ఇంద్రజాలికుడు మాళవరాజాస్థానమునకేగి ఇంద్రజాలవిద్యను ప్రదర్శించి "నరసింహావతారఘట్ట ప్రదర్శనము"న మాళవ రాజును ఆశ్చర్య సముద్రమున ముంచెను. అనంతరము ఇంద్రజాలికుడు రాజుతో "రాజా ! సంప్రదాయానుసారముగ అంత్యమున శుభసూచకమైన ఒక ప్రదర్శన చూపించెదను. నీకూతురు వంటి స్త్రీని ఒక దానిని

కల్పించి ఆమెను ఒక సార్వభౌముడు వివాహము చేసికొనినట్లు మీకు చూపించెదను" అని పల్కెను. ఆసమయమున అందరును ఉత్సాహ పూరితులై యుండిరి. పూర్వసంకేతానుసారముగ అవంతిసుందరీ రాజవాహను లచ్చట కేతెంచిరి. ఐంద్రజాలికుడు సభాసమక్షమున శాస్త్రోక్తరీతిగా వారిద్దరికి వివాహము గావించెను. తరువాత ఐంద్రజాలికుని ఆజ్ఞానుసారముగ ఇంద్ర జాల పురుషులందరును అదృశ్యులైరి. రాజవాహనుడును పూర్వ సంకేతాను సారముగ ఒక రహస్య మార్గమున అంతఃపురమున ప్రవేశించి రాజ కన్యతో గడుపుచు ఆనంద సాగరమున మునిగి యుండెను. ఈ విషయము లేమియు తెలియని మాళవరాజు ఐంద్రజాలికుని ఘనముగా సత్కరించి పంపెను.



# లఘుటీక

## ప్రథమోల్లాసము

పుట 1. శ్లో. శతధృతిః = బ్రహ్మ; 'శతానందశ్శతధృతి ర్విరిఞ్చోఽజో విరిఞ్చనః' అని అమరము; అంభోరుట్ = పద్మము; కూపదఘ్నః = తెఱచాప కొయ్య; అక్షదండః = ఇరుసుకొయ్య; త్రైవిక్రమః = త్రివిక్రమునికి సంబంధించినది. త్రివిక్రముఁడనఁగా మూఁడైన పాదన్యాసములు గలవాఁడని యర్థము. విష్ణువు బలిని మర్దించుటకై మూఁడడుగులతో భూమ్యాకాశములు నావరించెనని యైతిహ్యము;

పుట 2. నికషః = గీటురాయి; కటకమ్ = నగరము: పురన్దరః = ఇంద్రుఁడు, (వి) 'వృద్ధశ్రవాస్సునాసీరః పురుహూతః పురందరః'; అఙ్గణం = చత్వరము; (వి) 'అంగణం చత్వరాజిరే'; ఘనసారః = కర్పూరము; అభితః = అన్నివైపులను; సురభితః = అందమైనవాడు; అరాతిః = శత్రువు; హంసః = సూర్యుఁడు (వి) 'భానుర్హంసస్సహస్రాంశు స్తపనస్సవితారవిః'; సౌదర్యమ్ = సదృశము; నిరవద్యమ్ = నిర్దోషము;

పుట 3. నిటలాక్షః = ఫాలమున నేత్రములు గలవాఁడు (శివుఁడు); అనవద్యా = దోషములులేనిది; రోలంబః = తుమ్మెద; వి. ఇందిందిరశ్చఞ్చరీకో రోలమ్బోబమ్భరశ్చసః; అగ్రవీరః = ప్రధానయోధుఁడు; బంధురా = అందమైన; రమ్భా = అరఁటి చెట్టు; అనంత భోగలాలితా = అంతులేని భోగముల చేత లాలింపఁబడినది (రాణి-వసుమతి); అనంతుని-శేషుని పడగలచే లాలింపఁబడినది (భూమి - వసుమతి);

పుట 4. ధిషణా = బుద్ధి;

పుట 5. జన్యమ్ = యుద్ధము; వి. యుద్ధమాయోధనం జన్యమ్; ప్రత్యగ్రః = క్రొత్తది; వి. ప్రత్యగ్రోఽభినవో నవ్యో నవీనో నూతనో నవః;

సహేలమ్ = విలాసముగా; హఠికా = బలాత్కారముగా; ఆయిస్తం = పీడింపఁబడినది; విగ్రహః = యుద్ధము; ని. సమాసీకరణాః కలహ విగ్రహౌ;

పుట 6. జవనికా = తెర; ని. ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరిణీచసా; శస్త్రాశస్త్రి = శస్త్రములతో శస్త్రములను గొట్టు విధమున సాగు యుద్ధము; హస్తాహస్తి = హస్తములతో హస్తములను గొట్టు విధమున సాగు యుద్ధము; జీవగ్రాహః = ప్రాణములతో పట్టుబడినవాఁడు; అగ్రమహిషి = పట్టపురాణి; సీమంతోత్సవః = గర్భవతులగు స్త్రీలకు చేయు వేడుక;

పుట 7. వ్యజ్ఞాపి = విన్నవింపఁబడెను; అనాయి = తీసికొనిరాఁబడెను; సాపదేశమ్ = మిషతో;

పుట 8. ఉదంతః = వృత్తాంతము; ని. వార్తా ప్రవృత్తి ర్వృత్తాంత ఉదన్తః స్యాత్; సంపరాయః = యుద్ధము; ని. యుద్ధాయత్యోః సంపరాయః; వైలక్ష్యమ్ = సిగ్గరితనము; అనశ్వరః = నాశనములేనివాఁడు; ఏకవీర + అరాతిఘ్ని = మిక్కిలి వీరుఁడైన శత్రువును జంపునది; అప్రతిభటః = ఎదురులేనివాఁడు; అరాతిః = శత్రువు; సాంప్రతమ్ = ప్రస్తుతమునకు; అసాంప్రతమ్ = అయుక్తము; అఖర్వః = గొప్పది;

పుట 9. శితకణ్ఠః = శివుఁడు; ని. 'ఉగ్రః కపర్దీ శ్రీకణ్ఠశ్శితకణ్ఠః కపాలభృత్'; అవరోధః = అంతఃపురము, ఇచట లక్షణచే అవరోధాన్ అనగా అంతఃపురజనమును అని యర్థము; ని. శుద్ధాన్తశ్చావరోధశ్చ; జయ + ఆకాంక్షీ = జయమునుగోరువాఁడైన;

పుట 10. ప్రాహిణోత్ = విసరెను, వైచెను; సూతః = రథసారథి, ని. నియన్తా ప్రాజితాయన్తా సూతః క్షత్తాచ సారధిః; ప్రగ్రహాః = పగ్గములు, కళ్ళెములు; ని. తులాసూత్రేఽశ్వాదిరశ్మౌ ప్రగ్రాహః ప్రగ్రహోఽపిచ. వాహః = గుఱ్ఱము; ప్రాజ్యమ్ = సమృద్ధము; హేతిః = ఖడ్గము; నిశాన్తః = తెలవాఱుసమయము;

పుట 11. క్షణహీనా = సంతోషములేనిది; నివేశః = శిబిరము; రథ్యాః = గుఱ్ఱములు; మర్తు కామా = మరణింపఁగోరినది; వాక్ + మాధురీ = మాటల తీయఁదనము; కలకణ్ఠః = కోకిల;

పుట 12. నీహారకరః = చంద్రుఁడు; మాగధః = మగధ దేశపు రాజు; తన్వానః = విస్తరింపఁజేయుచున్నవాఁడై; శనైః = మెల్లగా; ఉపోషితమ్ = ఆఁకలి గొన్నది (పస్తున్నది); వికస్వరః = అధికమైన; అభాణి = పలుకఁబడెను; సారథి + అపగమః = సారథియొక్క మరణము; రభసాత్ = వేగముతో; ప్రహితా = ప్రయోగింపఁబడిన; విరచితమహాః = చేయఁబడిన ఉత్సవముగల; ని. మహ ఉద్ధవ ఉత్సవః; అకారి = చేయఁబడెను.

పుట 13. అధిక + ఆధిః = మిక్కుటమగు మానసిక వ్యథకలవాఁడు; ని. పుంస్యాధిర్మానసీవ్యథా; తటిత్ + లతా = మెఱపుతీగ; దైవత స్తమ్ = దైవముచేఁజేయఁబడిన;

పుట 14. కథితకథ్యః = చెప్పఁబడవలసిన విషయములను జెప్పినవాఁడు; ఉషిత్వా = నివసించి; కార్శ్యమ్ = కృశత్వము; నూనమ్ = తప్పక; అవోచి = పలుకఁబడెను;

పుట 15. తులిత వేధాః = పోల్పఁబడిన బ్రహ్మకలవాఁడు (బ్రహ్మతో సమానుఁడు); పురోధాః = పురోహితుఁడు; ని. పురోధాస్తు పురోహితః; మహా + అభిఖ్యాః = గొప్ప శోభకలవారు; ని. అభిఖ్యానామశోభయోః; నవ, ఉద్యత్, ఇన్దు, రుచయః = క్రొత్తగానుదయించుచున్న చంద్రుని కాంతి వంటి కాంతిగలవారు; రసేన = ప్రీతితో;

పుట 16. కార్పణ్యమ్ = దైన్యము; కరరుహాః = గోళ్ళు; ని. పునర్భవః కరరుహో నఖోఽస్త్రీ నఖరోఽస్త్రియామ్; సగద్గదం = డగ్గుత్తికతో;

సుధర్మా = దేవేంద్రుని సభ; ని. స్యాత్సుధర్మా దేవసభా; దారాః = భార్య; ని. భార్యా జాయాథ పుం భూమ్ని దారాః. (ఇవి పుంలింగము నిత్య బహువచనాంతము); సంఖ్యమ్ = యుద్ధము; ని. యుద్ధమాయోధనం జన్యం ప్రధనం ప్రవిదారణమ్. మృధమాస్కన్దనంసంఖ్యమ్.

పుట 17. యమళౌ = కవలలు; ధాత్రీ = దాది; కపిలా = గోవు; క్రోడమ్ = ఒడి రేక రొమ్ము ప్రదేశము ని. నవాక్రోడం భుజాన్తరమ్; బాణాసనయష్టిః = విల్లు; అన్తికమ్ = సమీపము; నిరగాత్ = వెడలిపోయెను;

పుట 18. తత్ + అన్వయ + అఙ్కురః = ఆతని వంశము యొక్క మొలక; ఉపహారః = కానుక. ని. ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపధా (ఇచట బలియని యర్థము); కుక్కురబాలకాః = కుక్కపిల్లలు; దంశయిత్వా = కఱపించి; స్ఖలిత మతిః = దారి తప్పినవాఁడు;

పుట 19. ఆదర్శి = చూడఁబడెను; వ్యతరన్ = ఇచ్చిరి; దత్త + ఆశీః = ఒసగఁబడిన ఆశీస్సు కలవాఁడు (ఆశీర్వదించినవాఁడు); భవత్ + అఙ్కమ్ = నీసమీపమునకు; అధరీకృత్య = క్రిందుచేసి; పక్కణః = ఆటవికుల నెలవు. ని. పక్కణః శబరాలయః; ఉపలాలితః = బుజ్జగింపఁబడినవాఁడు;

పుట 20. అర్భకః = పిల్లవాఁడు; యాథాతథ్యేన = ఉన్నది ఉన్నట్లుగా; అలాపి = పలుకఁబడెను; పదవీ = మార్గము, బాట; ని. అయనం వర్త్మమార్గాధ్వపన్థానః పదవీసృతిః; అవధార్య = విని; అభాణి = పలుకఁబడెను; స్థవిరా = ముసలిది; అభాషి = పలుకఁబడెను;

పుట 21. ధన + ఆఢ్యః = ధనముచేఁ బేరందిన వాఁడు; నన్దినీ = పుత్త్రిక; వ్యవహారీ = వర్తకుఁడు; ఉపయమ్య = పెండ్లియాడి; శ్వశురః =

మాను; ప్రవహణమ్ = నావ; ని. కర్ణీరథః ప్రవహణం డయనం చ సమం త్రయమ్ (నిఘంటువు ననుసరించి మనుష్యులు మోయు వాహన విశేషమని చెప్పవలసియున్నాను. సందర్భము ననుసరించి నావయను నర్థము సంభావింపఁ బడెను); పోతః = పడవ; ని. యానపాత్రంతు పోతః; అమజ్జత్ = మునిఁగెను;

పుట 22. ఆనాయి = తీసికొని రాబడెను; వన్యః వారణః = అడవి యేనుఁగు; నిపాత్య = పడవైచి; ప్రాద్రవత్ = పాఱిపోయెను; గుల్మః = పొద, ని. అప్రకాణ్డే స్తమ్బగుల్మౌ; పల్లవకబళా = చిగురాకుల ముద్ద; కణ్ఠీరవః = సింహము; ని. కణ్ఠీరవో గజరిపుః పిఙ్గదృష్టిర్మృగాధిపః; దంతావళః = ఏనుఁగు; ఝటితి = అకస్మాత్తుగా;

పుట 23. మనీషా = బుద్ధి; ఫలేతరతయా = పండుకాక మఱియొకటి యగుటచేత; శనైః = మెల్లగా; నిదేశః = ఆజ్ఞ; సమర్పితవాన్ = ఇచ్చినవాఁడాయెను; అన్యేద్యుః = మఱునాఁడు; కుత్రత్యః = ఎక్కడి వాఁడు; వల్లభా = ప్రియురాలు (భార్య);

పుట 24. స్వక్షి = మంచి నేత్రములు కలది; ఆయాసీత్ = పొందెను; భ్రాతృపుత్త్రః = సోదరుని కుమారుఁడు; అదాత్ = ఇచ్చెను.

పుట 25. అన్తేవాసీ = శిష్యుఁడు; ని. ఛాత్త్రాన్తేవాసినౌ శిష్యే; అవగమయ్య = తెచ్చి; అవాదీత్ = పలికెను; ఉత్పన్నః = ఒసి; స్థవిరా = ముసలిది; బాష్పజలమ్ = కన్నీరు; శోకశఙ్కు + ఉత్పాటనక్షమః = శోకమనెడు శల్యమును బెకలింపఁజాలిన వాఁడు; కనీయాన్ = చివఱివాఁడు;

పుట 26. అనపత్యతా = సంతానము లేకుండుట; భగినీ = సోదరి; ని. భగినీ స్వసా; తటినీ = నది; అక్షిపత్ = పడవైచెను; ప్లవమానా = ఈఁదుచున్నది; కాలభోగి = నల్లని త్రాఁచుపాము, ని. ఉరగః పన్నగోభోగీ

జిహ్మగః పవనాశనః; శరణ్యః = శరణము (రక్షణము) నొసగువాఁడు; జ్వాల + అవలీఢ + అవయవా = మంటలతో కమరిన అవయవములు గలది; అపనేతుమ్ = తొలఁగించుటకు; వ్యుత్క్రాన్తజీవితా = పోయిన ప్రాణములు గలది; తదను = పిమ్మట; పావక సంస్కారః = అగ్నిలో దహించుట;

పుట 27. రక్షితా = రక్షకుఁడు; మిళితమ్ = కూడినది; అనుక్రమేణ = వరుసగా; చౌలమ్ = కేశఖండనము; షడఙ్గాని = వేదములకు సంబంధించిన యాఱు అంగములు; అవి-శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనునవి. శిక్షావ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా కల్పశ్చేతి షడఙ్గాని వేదస్యాహుర్మనీషిణః; ఆఖ్యానకమ్ = చిన్నకథ; ఆఖ్యాయికా = పెద్దకథ; ఇతిహాసః = ప్రాచీన చరిత్రతోఁగూడిన కావ్యవిశేషము (భారతము వంటిది) ని. ఇతిహాసః పురావృత్తమ్;

పుట 28. దాక్షమ్ = సామర్థ్యము; మాయాప్రపఞ్చ చఞ్చుత్వమ్ = కపటశాస్త్రములకు సంబంధించిన నైపుణ్యము; ప్రయోగచణత్వమ్ = ప్రయోగించు నేర్పు; దురోదరమ్ = ద్యూతము; ని. ద్యూతే దురోదరమ్; అనలసః = ఉత్సాహము కలవాఁడు (అలసత లేని వాఁడు); అవిన్దత = పొందెను.

ఇది ప్రథమోచ్ఛ్వాసము

———

## ద్వితీయోచ్ఛ్వాసము

పుట 29. సమ్మితమ్ = వంటిది; ఆతపవారణమ్ = గొడుగు; కాకపక్షః = కూకటులు. ని. కాకపక్షశ్శిఖణ్డకః.; విదలిష్యమాణాః = త్రోలివేయఁబడువారు; తారుణ్యమ్ = యౌవనము;

పుట 30. మార + అభిరామాః = మన్మథుని వలె మనోహరులు; రామ + ఆద్య, పౌరుషాః = రాముఁడు మున్నగువారి పౌరుషము వంటి పౌరుషము గలవారు; రుషా = (రుట్) కోపముచేత; సాచివ్యమ్ = మంత్రిత్వము (సచివుని భావము); హేతి, హతి, కిణ + అఙ్కాః = కత్తి దెబ్బల వలన నేర్పడిన కాయలగుర్తులు గలవాఁడు; కాల + ఆయసమ్ = ఇనుము;

పుట 31. యజ్ఞోపవీతమ్ = జన్నిదము; ఏకాకీ = ఒంటరివాఁడు (డవు); అంసః = భుజము; వయస్యః = చెలికాఁడు; అపహాయ = వదలి; కిల్బిషమ్ = పాపము; పుళిన్దాః = అటవికులు; ఉపభుఞ్జానాః = తినుచున్నవారు; బ్రాహ్మణబ్రువాః = బ్రాహ్మణాధములు; జనపదః = కొన్నిగ్రామముల సముదాయము;

పుట 32. జిఘాంస్యమానః = చంపుటకుగోరఁబడుచున్న వాఁడు; నిర భర్త్సయన్ = బెదరించిరి (తర్జించిరి); భాషణపారుష్యమ్ = మాటలో కఠినత; ప్రేతపురీ = యముని నగరము; శమనః = యముఁడు. ని. శమనో . యమరాడ్యమః;

పుట 33. ఉదేష్యతి = పుట్టఁగలదు; యాతనా విశేషః = ఒకానొక కాఁటియ; అయస్ స్తమ్భాః = ఇనుప కంబములు; వితతశరావః = పెద్ద మూకుడు; క్షిప్యమానాః = పడవేయఁబడుచున్నారు; లగుడాః = దుడ్డుకఱ్ఱలు; జర్జరీకృత, అవయవాః = నుగ్గుగాఁజేయఁబడిన యవయవములు గలవారు; నిశితటఙ్కాః = వాడియైన ఉలులు; ని. టఙ్కః పాషాణదారణః; తదను = అంతట; ద్విజన్మా = బ్రాహ్మణుఁడు; అక్షరశిక్షా = అక్షరములను నేర్పుట; ఇన్దుకలా + అవతంసః = చంద్రరేఖ శిరోభూషణముగాఁ గలవాఁడు (పరమేశ్వరుఁడు);

పుట 34. విజ్ఞాపనీయమ్ = విన్నవింపఁదగినది; ప్రశ్రయ + అవ నతః = వినయముతో నమ్రుఁడు; తటినీ = నది; అద్రిపతిః = హిమవం

తుఁడు; అశ్మా = పాషాణము; దిష్టవిజయః = అదృష్టము యొక్క విజయము; ని. దైవందిష్టం భాగధేయమ్.

పుట 35. అద్య - శ్వః - వా = నేఁడో, రేపో; అవాప = పొందెను; సాకల్యేన = సంపూర్ణముగా; చరిష్ణవః = తిరుగఁగోరిన వారు (చరిష్ణు - ఉకారాంత పుంలింగము); వియుజ్య = వీడ్కొని;

పుట 36. రసాతలమ్ = పాతాళము; ని. అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్; కేళీకానన కాసారః = ఉద్యానవనము నందలి కొలను; వికత సారసః = అధికమైన పద్మములు గలది; ప్రత్యూహః = విఘ్నము; ని. విఘ్నో భరాయః ప్రత్యూహః; జ్వలనః = అగ్ని ని. కృపీటయోని ర్జ్వలనో జాతవేదా సనూన పాత్; పుణ్యగేహమ్ = పుణ్యములకు నెలవయినది; తటిత్ = మెఱపు; మణ్డనమ్ = అలంకారము; ఉపాయనీకృత్య = కానుకగాఁజేసి; సోత్కణ్ఠా = కుతూహలముతోఁగూడినదియై; ఉత్ + అఞ్జలిః = చేతులు మోడ్చినది; శాసితా = శాసకుఁడు, ప్రభువు;

పుట 37. అసహిష్ణుః = సహింపని వాఁడు; కారుణికః = దయగలవాఁడు; ఘన + ఉన్ముఖీ = మేఘమునకై యెదురు తెన్నలు చూచు; సపత్నీ = సవతి; ఉరరీకృత్య = అంగీకరించి; ఆససాద = పొందెను.

పుట 38. గమిష్ణుః = పోఁగోరిన వాఁడు; క్షుత్, పిపాసా + ఆదిక్లేశ, నాశనః = ఆఁకలి, దప్పి మున్నగు కష్టములను నశింపఁజేయునది; నిర్యయౌ = బయలువెడలెను; బభ్రామ = తిరిగెను; విశాలా + ఉపశల్యమ్ = ఉజ్జయినీ గ్రామసమీపము; ని. గ్రామాన్త ముపశల్యం స్యాత్; ఆక్రీడః = ఉద్యానవనము; ని. పుమానా క్రీడ ఉద్యానం రాజ్ఞ స్సాధారణం వనమ్; విశిశ్రమిషుః = విశ్రమింపఁగోరిన వాఁడు; అందోళికా = పల్లకీ; పల్లవితచేతాః = చిగురించిన మనస్సు కలవాఁడు; అకాణ్డే = అకస్మాత్తుగా; సంప్రతి = ఇప్పుడు; సరభస, పద, విన్యాస, విలాస, హర్ష + ఉత్కర్ష,

భరితః = పడిపడిగా పదు నడుగుల విలాసము యొక్కయు సంతోషము యొక్కయు నాధిక్యముతో కూడిన వాఁడు; త్రిచతుః పదాని = మూఁడు నాలుగు అడుగులు;

పుట 39. పస్పర్శ = స్పృశించెను; వ్యాజహార = పలికెను; ప్రచ్ఛాయ శీతలమ్ = మంచినీడచేఁజల్లనిది; వ్యతికరః = ఒకరినొకరు కలియుట, లేక, వ్యాపారము;

ఇది ద్వితీయోచ్ఛ్వాసము

---

## తృతీయోచ్ఛ్వాసము

పుట 40. వన + అవనిః = అడవిభూమి; పిపాసా + ఆకులః = దప్పికచేఁ గలఁతనొందిన వాఁడు; అద్రాక్షమ్ = చూచితిని; అమ్బరమణిః = సూర్యుఁడు; దేవ + ఆయతనమ్ = గుడి; స్థవిరః = ముదుసలి; వి. ప్రయవాస్థ్సవిరో వృద్ధో జీనో జీర్ణో జరన్నపి; కార్పణ్యమ్ = దైన్యము;

పుట 41. కటక + అధిపతిః = సేనానివేశము యొక్క ప్రభువు; శ్రావంశ్రావమ్ = వినివిని; అశాత్సీత్ = నిరోధించెను; అదాత్ = ఇచ్చెను; పరిణీయా = పెండ్లియాడఁదగినది; అకారయత్ = చేయించెను; కన్యాసారః = కన్యయనెడు ధనము. వి. సారో బలే స్థిరాంశేచ మజ్జిపుంసిజలే ధనే (మేదినీకోశము):

పుట 42. బహుతనయః = పెక్కురు పుత్త్రులుగలవాఁడు; అదామ్ = ఇచ్చితిని; అభిహిత + అనేక + ఆశీః = అనేకములగు ఆశీర్వాక్యములు పలికిన వాఁడు; అధ్వ, శ్రమ, ఖిన్నః = మార్గశ్రమముచే నలసిన వాఁడు; నిగళిత బాహుయుగళః = సంకెళ్ళువేయఁబడిన చేతులు గలవాఁడు; కశా +

ఆఘాత, చిహ్నిత, గాత్రః=కొఱడా దెబ్బల గుర్తులుగల దేహముగల వాఁడు; నైస్త్రింశకాః = ఖడ్గధారులు; దస్యుః = దొంగ, ని. చోరైకాగారిక స్తేన దస్యు తస్కర మోషకాః; అకార్షుః = చేసిరి; వీర్యపరుషాః = శక్తిచేత కఠినులు; నిర్విశథ = అనుభవించుచున్నారు; (మీరు); దుస్తరమ్ = దాట శక్యము కానిది;

పుట 43. అవోచన్ = పలికిరి; సురఙ్గాద్వారేణ = సొరంగపుదారి నుండి; విషణ్ణాః = దుఃఖితులు; ప్రావిశామ = ప్రవేశించితిమి; అపరేద్యుః = మఱునాఁడు; అభ్యేత్య = సమీపించి; పరివృత్య = చుట్టుముట్టి; పరితః = అన్నివైపుల; అశృఙ్ఖలయన్ = సంకెళ్లువైచిరి; ఆదానమ్ = తెచ్చుట;

పుట 44. నిర్భిద్య = పగులఁగొట్టి; ద్వాస్థగణః = ద్వారపాలకుల సముదాయము; అభిద్రావ్య = పాఱఁద్రోలి; ఆర్చయిత్ = పూజించెను; పరేద్యుః = మఱునాఁడు; అనర్థః = కీడు; నోచేత్ = లేని యెడల; క్రూరతరమ్ = మిక్కిలి పరుషమైన; వరాకః = నీచుఁడు; విప్రలాపః = పొగరుమాట;

పుట 45. అభ్యగాత్ = ఎదుర్కొనెను; నిరగాత్ = బయలు వెడలెను; తూణీరద్వయమ్ = అంపపొదుల జంట; రిపు + ఉద్ధరణ + ఉద్యుక్తః = శత్రువును నాశనము చేయుటకు సిద్ధపడినవాఁడు; తుముల సఙ్గరకరమ్ = దొమ్మి యుద్ధము చేయునట్టి; అరాతీన్ = శత్రువులను; శిరః కర్తనమ్ = తలను దెగ నఱకుట; అకార్షమ్ = చేసితిని;

పుట 46. సన్తుష్టమనాః = సంతోషము నొందిన చిత్తముగల; విస్మయమానః = ఆచ్చెరువొందుచున్నవాఁడు; అదాత్ = ఇచ్చెను; వైకల్యహృదయః = కలతఁజెందిన మనస్సుగలవాఁడు (దను); ఆనన్దసన్దోహః = ఆనందముల సముదాయము; ని. సమూహనివహవ్యూహ సందోహ విసర వ్రజాః; నన్దితా పరాక్రమః = కొనియాడఁబడిన పరాక్రమము గలవాఁడు; కథయామాస = చెప్పెను;

పుట 47. నిటలః = ఫాలము; సంఫుల్లలోచనః = వికసించిన కనులు గలవాఁడు; ఉత్సృజ్య = విడచి; అన్వభూతామ్ = అనుభవించిరి (ద్వివచనము); కరిష్ణుః = చేయునిచ్ఛగలవాఁడు; ప్రబుద్ధః = మేల్కొనిన; గన్తా= పోవుదువు; సముత్పపాత = పలికెను.

ఇది తృతీయోచ్ఛ్వాసము

---

## చతుర్థోచ్ఛ్వాసము

పుట 48. గతవాన్ = వెళ్ళినవాఁడు; గన్తవ్యమ్ = పోఁదగినది; నిర్ణేతుమ్ = నిర్ణయించుటకు; అశక్నువానః = చాలనిది; అన్వేష్టుమ్ = వెదకుటకు; అటన్ = తిరుగుచు; అంబర - మణిః = సూర్యుఁడు; అసహిష్ణుః = సహింపఁజాలనివాఁడు; ప్రచ్ఛాయశీతలమ్ = అధికముగు నీడచేఁ జల్లనైనది; ఉపావిశమ్ = కూర్చుంటిని; శూర్ప + ఆకృతిః = చేట వంటి ఆకారము గలది; ని. ప్రస్ఫోటనం శూర్పమస్త్రీ;

పుట 49. దూర + అపాత, పీత, సంజ్ఞః = దూరమునుండి పడుటచేఁ గోల్పోయిన చేతన గలవాఁడు; ని. సంజ్ఞాస్యాచ్చేతనా నామ హస్తాద్యైశ్చార్థసూచనా; భృగుపతనమ్ = (మరణింపఁగోరి) కొండ చఱియపైనుండి పడుట. ని. ప్రపాతస్తు తటో భృగుః; అపనయన్ = తొలఁగించుచు (తుడుచుకొనుచు); ఉపేత్య = చేరి; వణిక్ + కన్యకా = వర్తకుని బిడ్డ; ప్రవహణమ్ = యానపాత్రము; షోడశ = పదునాఱు; హాయనాని = సంవత్సరములు; ని. సంవత్సరో వత్సరోఽబ్దో హాయనోఽస్త్రీ శరత్సమాః; నీత్వా= గడపి; నారీకూజితమ్ = స్త్రీరోదనము; అశ్రావి = వినఁబడెను; పతితనయ మిళనమ్ = భర్తయొక్కయు, కుమారుని యొక్కయు కలయిక;

పుట 50. వైశ్వానరః = అగ్ని. ని. అగ్నిర్వైశ్వానరో వహ్ని ర్వీతిహోత్రో ధనఞ్జయః అవాదిషమ్ = పలికితిని; పశ్చాత్ = తరువాత; అధునా = ఇప్పుడు; స్థీయతామ్ = ఉండవలయును (ఉండఁబడుఁగాక); హుతభుక్ = అగ్ని; ని. హిరణ్యరేతా హుతభు గ్దహనో హవ్యవాహనః; అవగాహనసాహసికా = ప్రవేశించుటకుఁ ద్వరపడుచున్నది; ససంభ్రమమ్ = త్వరత్వరగా; కూజన్తీ = ఏడ్చుచున్న; కుత్రత్యే = ఎక్కడి వారు (స్త్రీ; వి. ద్వి. వ); కథ్యతామ్ = చెప్పఁబడుఁగాక; సగద్గదమ్ = డగ్గుత్తికతో; అవాదీత్ = పలికెను; వణిజః = వర్తకుని యొక్క;

పుట 51. నిజధాత్రీ = తనయొక్కదాది; ఫలకః = చెక్క; ఆసన్న, ప్రసవ సమయా = సమీపించిన కానుపురోజులు గలది; అసూత = కనినది; సోఢుమ్ = సహించుటకు; అక్షమా = చాలనిది; ఆఖ్యాయ = చెప్పి; పితరౌ = తలిదండ్రులు; ని. మాతాపితరౌ పితరౌ మాతరపితరౌ ప్రసూ జనయితారౌ; ముదిత + అన్తరాత్మానౌ = పరితోషము నొందిన అంతరాత్మలు గలవారై; అమన్ద + అశ్రువర్షః = అధికమైన ఆనందబాష్పముల వర్షము; అభిషిచ్య = అభిషేకించి; ఉపాఘ్రాయ = మూర్కొని; ఉపావిశతామ్ = కూర్చుండిరి (ద్వి);

పుట 52. అనుయానమ్ = అనుసరించి పోవుట; అభ్యధామ్ = చెప్పితిని; అస్థాపయమ్ = ఉంచితిని; సాధకత్వమ్ = సాధించువాని భావము; దక్షః = సమర్థుఁడు; నిష్పాద్య = సిద్ధపఱచి; వసుపూర్ణాః = ధనముతో నిండినవి; సిద్ధ + అఞ్జనమ్ = సిద్ధునిచేనొసఁగఁబడిన కాటుక (అట్టి దానితోఁ జూచిన భూగర్భమునవున్న నిధులు మున్నగునవి కన్పట్టునని ప్రసిద్ధి); రక్షిణః = సంరక్షకులు; పరితః = అన్నివైపులను; ని. సమంతతస్తు పరిత స్సర్వతో విష్వగిత్యపి; ఖననసాధనాని = త్రవ్వెడు పరికరములు; బలీ వర్దాః = ఎద్దులు; ని. ఉక్షా భద్రో బలీవర్ద ఋషభో వృషభోవృషః; గోణీః = గోనెలు; క్రీత్వా = కొని; వసు = ధనము;

పుట 53. ఉహ్యమానమ్ = మోయఁబడుచున్న; వికచిత సౌహృదః = చేయఁబడిన మైత్రి గలవాఁడు; అధిగమయ్య = రప్పించి; గాఢ వసతిః = గట్టిగా నివసించుట; అకరవమ్ = చేసితిని; అపారః = అంతు లేనిది; మనో గ్లానిః = మనస్సునకుఁగలిగిన క్లేశము; తూష్ణీమ్ = ఊరక; లపితమ్ = భాషణము; ని. వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః; ఉపకణ్ఠవర్తీ = సమీపమున మెలఁగు వాఁడు: ని. ఉపకణ్ఠాన్తికాభ్యర్ణాభ్యగ్రా అప్యభితోఽవ్యయమ్; వణిక్ + మన్దిర, లక్ష్మీ = వర్తకుని భవనము యొక్క శోభ లేక సంపద;

పుట 54. లతాన్తబాణః = పుష్పబాణుఁడు, మన్మథుఁడు; ఆయాసిషమ్ = పొందితిని; చకిత, బాల, కురఙ్గ, లోచనా = బెదరిన లేడి పిల్ల కన్నుల వంటి కన్నులుగలది; సాయకాయమానమ్ = బాణమువలెనైనది; కటాక్ష వీక్షణమ్ = కడకంటి చూపు; అసకృత్ = చాలమాఱులు; సమాకృష్టాః = వెనుకకు లాగఁబడినవి; రాగ, లజ్జా + అన్తరాల, వర్తినః = అనురాగమునకు, సిగ్గునకును నడుమ నూగిసలాడుచున్నవి; సమ్యక్ = బాగుగా; ప్రేక్షిష్యమాణః = చూడఁగలవాఁడగుచు; శృణ్వన్ = వినుచున్నవాఁడై; ఉత్కలికా = ఉత్కంఠ (ఇష్టవస్తు ప్రాప్తియందలి కాలవిలంబము నోర్వఁజాలక తహతహ లాడుట) ని. ఉత్కంఠోత్కలికే సమే;

పుట 55. వ్యలోకయమ్ = చూచితిని; సుదతీ = మంచిదంతములు గలది (స్త్రీ); మదన కదన ఖేద + అనుభూతః = మన్మథుని పీడ వలన అనుభవింపఁబడినది; జ్ఞాస్యన్ = తెలియఁగోరిన వాఁడు; రహస్యమ్ = ఏకాంతము; విస్రమ్భః = నమ్మకము; ని. సమౌ విస్రమ్భ విశ్వాసౌ; వార్ధకమ్ = ముసలితనము; అభ్యషిఞ్చత్ = అభిషేకించెను; పాలయిష్యన్ = పాలింపఁగోరిన వాఁడు; పైతృష్వస్రీయౌ = మేనత్త కొడుకులు; ని. పైతృష్వసేయి స్స్యా త్పైతృష్వస్రీయశ్చ పితృష్వసుః సుతః; రాజరాజః = కుబేరుఁడు; ని. మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః; రాజరాజగిరిః = కైలాసము; అసపత్నమ్ = శత్రువులు లేనిది; మాతులః = మేనమామ; పారదార్యమ్ = ఇతరుల భార్యలను గైకొనుట;

పుట 56. లావణ్యమ్=శరీరముపైనుండు మెఱుఁగు; దూరీకృత్య = దూరముచేసి; అన్తరాయః = ఆటంకము; ఆశ్వాస్య=ఊఁఱడించి; వల్లభా = ప్రియ; నిహన్తుమ్ = చంపుటకు; ఆశా, శృఙ్ఖలిత, హృదయః = ఆశచే బంధింపఁబడిన మనస్సు గలవాఁడు; నిర్జిత్య = గెలిచి; చక్రవాక, సంశయ, కర, పయోధరా = జక్కవలనెడు సంశయమును గలిగించు స్తనములు గలది; అవాది = పలుకఁబడెను:

పుట 57. శ్రావం శ్రావమ్ = విని విని; సాహస, కరణమ్ = సాహసమొనరించుట; నిర్విశ = పొందుము; ముష్టి, జాను, పద + ఆఘాతాః = పిడికిలి యొక్కయు, మోకాళ్ళయొక్కయు, కాళ్ళ యొక్కయు పోట్లు; వయస్యామిషః = చెలియను నెపము; నిర్గమిష్యామి = వెలువడుదుసు; సాధ్వసమ్ = భయము; ని. దరత్రాసౌ భీతిర్భీ స్సాధ్వసం భయమ్;

పుట 58. అనునయేః = అనునయింపుము; ఆఢ్యః = సంపన్నుఁడు, గొప్పవాఁడు; దాస్యన్తి = ఈఁగలరు; అగారమ్ = భవనము. ని. నిశాన్త వస్త్యసదనం భవనాగార మన్దిరమ్; శకునజ్ఞః = శకునమెఱిఁగినవాఁడు; త్రింశత్ = ముప్పది; అశృణవమ్ = వింటిని; నిలయః = ఇల్లు; ని. నికాయ్యనిలయాలయాః.

పుట 59. వాగురా = వల (మృగములను బట్టునది) ని. వాగురా మృగబన్ధనీ; రన్తుమ్ = క్రీడించుటకు; నూపురః =కాలి అందె; మేఖలా= మొలనూలు; కంకణమ్ = వలయము; తాటంకః = చెవికమ్మ; క్షౌమమ్= తెల్లనిపట్టుచీర, ని. క్షౌమం దుకూలం స్యాత్; కజ్జలమ్=కాటుక; ద్వాస్థః= ద్వారపాలకుఁడు; అభ్యుద్గతిః = ప్రీతితో నెదురుగా వచ్చుట; ప్రతీహార, భూమిః = ద్వారప్రాంతభూమి; ని. స్త్రీ ద్వా ర్ద్వారం ప్రతీహారః; రత్నఖచిత హేమ పర్యఙ్కః = రత్నములు చెక్కఁబడిన బంగారు మంచము;

పుట 60. చామీకరమ్ = సువర్ణము; ని. చామీకరం జాతరూపం మహారజత కాఞ్చనే; నిపాత్య = పడవైచి; నియుద్ధమ్ = పెనఁగులాట; ని. నియుద్ధం బాహుయుద్ధేస్యాత్; మేళయిత్వా = కూర్చి; అహూజమ్ = అఱచితిని;

పుట 61. బధిరయన్తః = చెవుడుపడఁజేయుచున్నవారై; మద + అన్ధః = పొగరుచేఁ గనుగానని వాఁడు; మిథః = పరస్పరము; ని. మిథోఽ న్యోన్యం రహస్యపి; పౌరజన సమక్షమ్ = పురజనులయెదుట; అన్వభవమ్ = అనుభవించితిని; నేత్ర + ఉత్సవకారి = కన్నుల పండువు చేయునది; అమ్లానమానసః = వాడనిమనస్సుగలవాఁడు; ప్రాపయ్య = చేర్చి;

పుట 62. నియుజ్య = నియోగించి; భూస్వర్గాయ మానమ్ = భూమియందు స్వర్గము వలెనైనది; కుశలః = నిపుణుఁడు; కారయామాస = చేయించెను.

ఇది చతుర్థోచ్ఛ్వాసము

---

## పంచమోచ్ఛ్వాసము

పుట 63. మీనకేతనః = మన్మథుఁడు; ని. మదనో మన్మథోమారః ప్రద్యుమ్నో మీనకేతనః; భుజఙ్గమః = సర్పము; హరిచన్దనమ్ = మంచి గంధము; సహకారః = తీయమామిడి చెట్టు; కిసలయమ్ = చిగురు; ని. పల్లవోఽ స్త్రీ కిసలయమ్; రక్తకణ్ఠాః = రాగముతోఁగూడిన కంఠముకలవి; కలకణ్ఠాః = కోకిలలు; కాకలీ = మధురము, అస్ఫుటమునైన సూక్ష్మమైన ధ్వని; ని. కాకలీతు కలే సూక్ష్మే; ఉపనయన్ = చేకూర్చుచు; మాకన్దః = మామిడిచెట్టు; సిన్దువారః = వావిలిచెట్టు; కింశుకః = మోదుగు చెట్టు;

పుట 64. తిలకః = బొట్టుగుచెట్టు; కలికా = మొగ్గ; ని. కలికా కోరకోఽ స్త్రియామ్; సమాజగామ = విచ్చేసెను; విహార + ఉత్కంఠా = వాహ్యాళియందలి వేడుక; సమవాయః = సముదాయము; ని. సముదాయ స్సముదయ స్సమవాయశ్చయోగణ; చూతపోతకః = గున్నమామిడి; ని. పోతః పాకోఽర్భకోడిమ్భః పృథుకః శాబకశ్శిశుః. (ఇచట పోతకశబ్దమునకు చిన్నది యను నర్థము గ్రాహ్యము); హరిద్రా = పసుపు. ని. నిశాఖ్యా కాఞ్చనీ పీతా హరిద్రా వరవర్ణినీ; రేమే = క్రీడించెను; రతి ప్రతికృతిః = రతిదేవి యొక్క ప్రతిమ (ఇచట రతిని బోలినదియని యర్థము) ద్రష్టుకామః = చూడఁ గోరినవాఁడు; ఆన్దోళిత శాఖాః = ఊపఁబడిన కొమ్మలు; రసాలతరవః = మామిడి చెట్లు; కీరాః = చిలుకలు;

పుట 65. ఇన్దీవరమ్ = నల్లకలువ; కల్హారమ్ = ఎఱ్ఱకలువ, ని. సౌగన్ధికంతు కల్హారమ్; కైరవమ్ = తెల్లకలువ, ని. సితేకుముదకైరవే; రాజీవమ్ = పద్మము. ని. బిసప్రసూన రాజీవ పుష్కరామ్భోరుహాణిచ; సారసః = బెగ్గురుపక్షి; కారణ్డవః = కన్నెలేడు పిట్ట; చక్రవాళమ్ = మండలము; ని. చక్రవాళంతు మణ్డలమ్; దర్శందర్శమ్ = చూచిచూచి; అవాప = చేరెను; హస్తసంజ్ఞా = చేసన్న; జిత పురుహూతః = గెలువఁబడిన యింద్రుఁడు కలవాఁడు; ని. పురుహూతః పురన్దరః; అన్తికమ్ = సమీపము; సాలభంజికా = బొమ్మ; విభ్రమ = చేరవలెనను కోరిక; కాసారః = కొలను; శారద + అరవిన్దమ్ = శరత్కాలము నందలి పద్మము; దీర్ఘికా = దిగుడు బావి; మత్తమరాళికా = మదించిన ఆడు హంస; అలసగతిః = మెల్లని నడక; తూణీరః = అమ్ములపొది; జఙ్ఘే = పిక్కలు; లాలిత్యమ్ = సౌకుమార్యము;

పుట 66. కోరక, కోటర, అనువృత్తిః = మొగ్గయొక్క లోపలి భాగము వంటి చుట్టు; ఆవర్త సనాభిః = సుడితో సమానమైనది; ఆరోహణ పరిపాటీ = మెట్లవరుస; మౌర్వీ = అల్లెత్రాడు; అభిఖ్యా = శోభ, ని. అభిఖ్యానామ శోభయోః; బిమ్బః = దొండపండు; రదనచ్ఛదః = పెదవి;

ని. ఓష్ఠాధరౌతు రదనచ్ఛదౌ దశనవాససీ; బాణాయమానమ్ = బాణముగా నైనది; స్మితమ్ = చిఱునగవు; అగ్రిమాతిక = ప్రధానమైనది; కల కణ్ఠికా = ఆడుకోకిల; కల + ఆలాపః = అవ్యక్తమధురమైన వాక్కు; సౌరభ్యమ్ = సువాసన; చాపయష్టిః = ధనస్సు యొక్క దండము; భ్రూలతే = లతలవంటి కనుబొమలు; బర్హిః = పింఛము; కేశపాశః = కేశముల సము దాయము (జడ) ని. పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే; (కచ శబ్దములకుఁ బరముగాఁ బ్రయోగింపఁబడిన పాశ, పక్ష, హస్త శబ్దములు కలా పము అను నర్థము కలవి యగును); మలయజరసః = మంచి గంధపు రసము; ప్రపశ్య = కడిగి;

పుట 67. సమ్మృజ్య = పూసి; రరాజ = విరాజిల్లెను; మదన + ఆవేశవతీ = మన్మథోద్రేకము కలది; చకమ్పే = వణకెను; క్రీడా, విశ్ర మ్భః = అతియంచు లీనమైన స్థితి; ఘుణాక్షరన్యాయః = పురుగు వలన నేర్పడిన అక్షరము వంటి పద్ధతి (పురుగు ఇసుకయందు తిరుగుచుండఁగా దాని నడచిన గుర్తు అక్షరాకారముగా నప్రయత్నముగా పడిన విధము. అనఁగా దాని కక్షరములు తెలియుట జరుగదు కాని దాని కాలిగుర్తు తనప్రయత్నము లేకయే, తెలియకయే యక్షరాకృతిని బొందినది. ఒకవ్యక్తి వాని కభ్యస్తము కాని విషయమున నేర్పు ప్రదర్శించుట నీన్యాయము వ్యక్తము చేయును); అబ్జభూః = బ్రహ్మ; సమక్షమ్ = ఎదురుగా; నఖీ, జన, అన్తరిత, గాత్రి = చెలుల మాటున నుంచఁబడిన శరీరముగలది; ఆకుఞ్చితాని = ముడువఁబడినవి; అపాఙ్గ వీక్షితాని = కడకంటిచూపులు; మనః కురఙ్గః = మనస్సనెడు లేడి; ఆనాయాయమాన లావణ్యః = వలవలెనైన శరీరకాంతి కలవాఁడు;

పుట 68. శరవ్యాయమాన మానసః = లక్ష్యమగుచున్న మనసు గలవాఁడు; విషమ శరః = మన్మథుఁడు, (బేసిసంఖ్య గల బాణములు గలవాఁడు); లోచన + ఉత్సవః = కనుల పండుగ; క్రియతే = చేయఁ బడుచున్నది; పురంధ్రీ = ఇల్లాలు, ని. స్యాత్తు కుటుమ్బినీ పురంధ్రీ; సీమ న్తినీ = స్త్రీ, ని. స్త్రీ యోషి దబలా యోషా నారీ సీమన్తినీ వధూః; సీమన్త

మౌక్తికీ క్రియతే = పాపటయందలి ముత్తెముగాఁ జేయఁబడుచున్నది; మధ్నన్ = మథించుచున్న వాఁడు; జ్ఞాతవ్యః = తెలియఁబడఁదగిన వాఁడు; ఇతర + ఇతర, రాగవృత్తిః = ఒకరిపై నొకరికిఁగల అనురాగ ప్రవర్తనము; ఆఖ్యానమ్ = చెప్పుట;

పుట 69. ఆహవ, నిపుణః = యుద్ధమున నేర్పరి; సంకల్పజః = మన్మథుఁడు; జితమారః = జయింపఁబడిన మన్మథుఁడు కలవాఁడు; ఘన సారః = కర్పూరము; కారయామాస = చేయించెను. జాయా = భార్య; ని. భార్యా జాయాథ పుం భూమ్ని దారాః; నోచేత్ = కానియెడల;

పుట 70. జాతిస్మరత్వమ్ = పూర్వజన్మజ్ఞానమును గుర్తించుట; ఉత్పాదయిష్యామి = పుట్టింతును; కేళీవిధిత్సా=ఆటాడుకోరిక; ఉపకణ్ఠమ్ = సమీపము; సలీలమ్ = విలాసముగా; అలపత్ = పలికెను; కశ్చిత్ = ఒకానొక; కమలాకరః = సరస్సు; కోకనద కదమ్బః = ఎఱ్ఱ కలువల సముదాయము; బిసగుణః = తామరతూడుల త్రాడు; చరణ యుగళమ్ = కాలిజంట; నిగడయిత్వా=బంధించి; సానురాగమ్=సప్రేమముగా; మరాళః= హంస;

పుట 71. మునివత్ = మునివంటిది; అశపత్=శపించెను; షణ్డః= తామరలు మున్నగువాని సముదాయము; ని. అబ్జాది కదమ్బే షణ్డ మస్త్రియామ్; అనుష్ఠాన పరాయణతా = జపము మున్నగుదాని యందలి శ్రద్ధ; నైష్ఠికః = నిష్ఠతో వర్తించువాఁడు; పాప్మా = పాపము, ని. అస్త్రీ పఙ్కం పుమాన్; పాప్మాపాపకిల్బిష కల్మషమ్; అకరవమ్ = చేసితిని;రసః= అనురాగము.

పుట 72. శృఙ్ఖలా, నిగళిత చరణః = సంకెళ్ళచే బంధింపఁబడిన పాదములు గలవాఁడు; భర్తృదారికా = రాజ పుత్త్రి; జానతీ = తెలియు చున్నది; రాగ, పల్లవిత, మానసా= అనురాగముచేఁ జిగురించిన మనస్సు గలది; అకార్షీత్ = చేసెను; దాక్షిణ్యమ్ = మొగమోటము; సాభిజ్ఞమ్=గుర్తుగా;

పుట 73. అవసరః = సమయము; దుహితా = కూఁతురు; ససంభ్రమమ్ = వడివడిగా; మహిషీ = పట్టపురాణి; ని. కృతాభిషేకా మహిషీ; కేళీవనమ్ = ఉద్యానము; ఆలాపసలాపః = వాక్కులసముదాయము;

పుట 74. పరివృత్త్య = వెనుదిరిగి; క్షామక్షామా = మిక్కిలి కృశించినది; పరిహృత్య = పరిహరించి; తల్ప, తల, ఆయత్త, తనులతా = పాన్పునకు వశమైన తీగవంటి శరీరముగలది; ఖిన్నః = దుఃఖపడినది; సంచితాని = సంపాదింపఁబడినది; ఉశీరః = వట్టివేరు; వాసాంసి=వస్త్రములు; తాల వృన్తాని = వీవనలు;

పుట 75. అశిశిరయత్ = చల్లఁబఱచిరి; ఆవిశ్చకార = పుట్టించెను; ఈషత్ + ఉన్మీలితమ్ = కొంచెము తెఱవఁబడినది; గ్లపితః = వాడినది; వ్యాలాపి = పలుకఁబడినది; ఇషవః = బాణములు; హన్యే =కొట్టఁబడుచున్నాను; తాపకరః = తాపమును గలిగించు వాఁడు; శుష్యతి = ఎండుచున్నది; పారావారః = సముద్రము; పద్మాలయా = లక్ష్మీదేవి, ని. లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీర్హరి ప్రియా; గేహభూతమ్ = ఇల్లుగానైనది; నూనమ్ = నిశ్చయముగా;

పుట 76. ఉష్ణీకృతః = వేడెక్కినది; తల్పమ్ = పాన్పు; శిఖాపటలమ్ = జ్వాలల సముదాయము; ని. వహ్నేర్ద్వయో ర్జ్వాలకీలా వర్చిర్హేతి శ్శిఖా స్త్రియామ్; తనోతి = విస్తరించుచున్నది; విజ, యష్టి, సంశ్లేషవత్, ఉరగ, రదన, లిప్త + ఉల్బణ, గరళ, సంకలితమ్ = తనయొక్క కఱ్ఱతో కూడిక గల పాముల దంతములయందుఁ బూయఁబడిన తీవ్రమైన విషముతోఁ గూడినది; అలమ్, అలమ్ = చాలుఁజాలును; అగదఙ్కారః = వైద్యుఁడు; ని. రోగహార్యగదఙ్కారో భిషగ్వైద్యశ్చికిత్సకే; లబ్ధుమ్ = పొందుటకు; పరమకాష్ఠా = మిక్కిలి అధికమైనస్థితి (చివరిమెట్టు); ఆనేతవ్యః = తేఁబడఁదగిన వాఁడు; నేష్యతి = చేర్చును;

పుట 77. అసమసాయకః = మన్మథుఁడు (బేసిసంఖ్య బాణములు గలవాఁడు); కరణీయమ్ = చేయఁదగినది; తూణీరాయమాణమానసః = అమ్ముల పొదివలెనైన మనస్సుగలవాఁడు; పరిమ్లానమ్ = మిక్కిలి వాడినది; అన్వేషణీయా = వెదుకఁదగినది; మణ్డనీభవత్ = అలంకారముగా నగుచున్న; అమ్బుజకోరకః = పద్మపుమొగ్గ; లసత్ + అఞ్జలిపుటా = ఒప్పుచున్న దోసిలి పుటము గలది; నిషీద = కూర్చుండుము; కాన్తావృత్తాంతః = కడచిన సంగతి; అభాణి = పలుకఁబడెను;

పుట 78. అలబ్ధవతీ = పొందనిది; స్మర + అన్ధతా = కామము చేఁగనుగానకుండుట; లిప్సుః = పొందఁగోరినది; నియుక్తవతీ = నియోగించినది;

శ్లో. సుభగ = అందగాఁడా !; కుసుమసుకుమారమ్ = పూవువలె మృదువైనదియు; జగత్ + అనవద్యమ్ = లోకమునకెల్ల దోషరహితమైనదియు నగు; తే = నీయొక్క; రూపమ్ = రూపమును; మమ = నాయొక్క; మానసమ్ = మనస్సు; అభిలషతి = కోరుచున్నది; త్వమ్ = నీవు; చిత్తమ్ = హృదయము; తథా = అట్లు; మృదులమ్ = మెత్తనిదిగా; కురు = చేయుము;

పుట 79. ఛాయావత్ = నీడ వలె; అనువర్తమానః = అనుసరించి తిరుగువాఁడు; వల్లభా = ప్రియ; మృగీదృక్ = ఆడులేడి చూపులవంటి చూపులు గలది; బహిశ్చరాః = వెలుపల తిరుగుచున్న; ఆలవాలమ్ = కుదురు (పాదు); ని. స్యాదాలవాల మావాల మావాపః; అపతమ్ = పడితిని; జానాతి = తెలియును; శ్వః = రేపు; పరశ్వః = ఎల్లుండి; సఙ్గమిష్యే = కలియుదును; శిరీషః = దిరిసెనము; ఆచర = చేయుము;

పుట 80. చకోరలోచనా = చకోరపక్షుల కన్నుల వంటి కన్నులు గలది; అపచితాని = కోయఁబడినవి; నికురుమ్బమ్ = సమూహము; ని. స్త్రియాంతు సంహతి ర్బృన్దం నికురుమ్బం కదమ్బకమ్; సైకతతలమ్=ఇసుక తిన్నె; సుదతీ = మంచిదంతములు గలది (స్త్రీ); భుక్త ముక్తమ్= అనుభవింపఁబడి వదలఁబడినది; స్మారంస్మారమ్ = తలచి తలచి; ఉపవన, నూతన, పల్లవాని = ఉద్యానములోని క్రొంజిగురులు; చకితః = భీతుఁడు; కర్ణేజపాః = కొండెములు చెప్పువారు, ని. కర్ణేజపః సూచక స్స్యాత్; క్వణితాని = కూతలు; అవస్థాతుమ్ = నిలుచుటకు; పరిబభ్రామ = అంతటను దిరిగెను.

పుట 81. సూక్ష్మచిత్ర నివసనః = సన్నని చిత్రమైన వస్త్రముగలవాఁడు; ముణ్డిత, మస్తక, మాణవక, సమేతః = నున్నగా గొఱుగఁబడిన తలలుగల బాలురతోఁ గూడిన వాఁడు; ని. బాలస్తు స్యాన్మాణవకః; యదృచ్ఛా= ఇచ్ఛ చొప్పున; సమన్తతః = అన్నివైపుల; దదర్శ=చూచెను; పప్రచ్ఛ= అడిగెను; కోవిదః = పండితుఁడు; భ్రమన్ = తిరుగుచు; శశంస = చెప్పెను; పాండురతా = తెల్లఁదనము (పాలిపోవుట); సాభిప్రాయమ్ = అభిప్రాయగర్భితముగా; విహస్య = నవ్వి;

పుట 82. రుచిరభాషణః=ఇష్టమైన మాటలు గలవాఁడు; సుహృదః= మిత్రులు; సంభోగ, సిద్ధి + ఉపాయ + అభావః =కలయిక నెఱవేఱుటకుఁ దగిన యుపాయము లేకుండుట; లజ్జా + అభిరామమ్ = సిగ్గుతో మనోహరముగానున్నది; వ్యాజహార = పలికెను;

పుట 83. కథయితవ్యః = చెప్పఁబడఁదగును; విప్రలమ్భః = ఎడబాటు; సౌహార్దమ్ =మంచితనము; విససర్జ = వదలెను (వీడ్కొనెను); క్రియా పాటవమ్ = పనియందలి నేర్పు; మన్యమానః = తలఁచుచున్నవాఁడు; వేదయిత్వా = తెలియునట్లుచేసి; కౌతుక + ఆకృష్ట, హృదయః=

ఉత్కంఠచే లాగఁబడిన మనస్సుగలవాఁడు; క్షపా = రాత్రి: ని. నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా; క్షపయామి = గడపుదును; పరేద్యుః = మఱునాఁడు; రసాః = శృంగారము మొ.; భావః = అభిప్రాయమును సూచించుట; రీతిః = పద్ధతి (ఇచట నటనాపద్ధతి యను నర్థము సముచితము): దౌవారికః = ద్వారపాలకుఁడు; ఉపగమ్య = సమీపించి; సప్రణామమ్ = వందన పూర్వకముగా;

పుట 84. అవరోధజనః = అంతఃపురజనము; సమాహూయమానః = పిలువఁబడు చున్నవాఁడు; కక్ష్యాంతరమ్ = లోపలి గృహభాగము; ని. కక్ష్యా ప్రకోష్ఠే హర్మ్యాదేః కాఞ్చ్యాం మధ్యేభ బన్ధనే; తాడ్యమానాని = మ్రోగింపఁ బడుచున్నవి; మఞ్జుల ధ్వనయః = చెవికింపైన నాదములు; సామాజికః = సభాసదుఁడు; ని. సభాసద స్సభాస్తారా స్సభ్యా స్సామాజికాశ్చతే; పిఞ్ఛికా = నెమలి యీకల కుంచె; పరిబృఢః = ప్రభువు; ని. ప్రభుః పరివృఢోఽధిపః; భ్రామయన్ = భ్రమింపఁజేయుచు; ముకుళిత నయనః = మూయఁబడిన కన్నులుగలవాఁడు; ఉల్బణమ్ = తీవ్రముగా; వమన్తః = క్రక్కుచున్నవి; నీరాజితాః = నివాళియొసగఁబడినవి; రాజ, మన్దిర, ఆభోగాః = రాజభవనపు ప్రదేశములు గలవి; భోగినః = సర్పములు; నిశ్చేరుః = బాగుగాఁ దిరిగినవి; తుణ్డాః = ముక్కులు (పక్షులకు సంబంధించినవి); అహిపతిః = శ్రేష్ఠములైన సర్పములు; సమచరన్ = తిరిగినవి; విదారణమ్ = చీల్చుట;

పుట 85. అభినీయ = అభినయించి; అవాప్తిః = పొందిక; సముత్ఫుల్ల, వదనః = వికసించిన ముఖము గలవాఁడు; అఞ్జనమ్ = కాటుక; నిక్షిప్య = పెట్టి; భూషితాంగీ = అలంకరింపఁబడిన శరీరము గలది; సాక్షీకృత్య = సాక్షిగాఁజేసి; సంయోజయామాస = కూర్చెను; అవసానమ్ = అంతము;

పుట 86. ద్విజన్మా = బ్రాహ్మణుఁడు; యథాయథమ్ = చెల్లా చెదరుగా; గూఢ + ఉపాయ + చాతుర్యమ్ = గూఢమైన ఉపాయము నందలి నేర్పు; బాడబః = బ్రాహ్మణుఁడు; ని. ద్విజాత్యగ్రజన్మ భూదేవ బాడబాః; ప్రచురతరమ్ = మిక్కిలి అధికమైన; సాధయ = వెళ్ళుము; అన్తర్మన్దిరమ్ = లోపలి భవనము; యయౌ = ఏగెను; రహః = ఏకాంతము; విస్రమ్భః = నమ్మకము;

పుట 87. పీయూషమ్ = అమృతము; ని. పీయూష మమృతం సుధా; శ్రావయామాస = వినిపించెను.

ఇది పంచమోచ్ఛ్వాసము

———

# సందర్భ వాక్యములు

1. జలబుద్బుద సమానా విరాజమానా సంపత్తటిల్లతేవ సహసైవోదయతి నశ్యతిచ. పు 9.
2. నిఖిలం దైవాయత్తమేవ అవధార్యం కార్యమ్. పు 9.
3. ననుపాపా, నహన్తవ్యో బ్రాహ్మణః. పు 20.
4. సంప్రతి మహాన్నయనోత్సవో జాతః. పు 25.
5. ఇదం తదేవ భూదేవదానం మాణిక్యమ్. పు 28.
6. నోచేన్మహానర్థ స్సమ్భవిష్యతి. పు 28.
7. షోడశవర్షానంతరం భర్త్రా పుత్త్రీసంగమోభవిష్యతి. పు 33.
8. వంశ సంపల్లావణ్యాద్యాయ ఉనేమహ్యాంత్వాందాస్యన్త్యేవ. పు 37.
9. తదసౌ స్వకీయేన కర్మణా నిహతః. పు 38.
10. లలనా జనం సృజతా విధాత్రా నూన మేషా ఘుణాక్షర న్యాయేననిర్మితా. పు 42.
11. అబ్జభూ రేవం విధ నిర్మాణనిపుణో యదిస్యాత్, తర్హి తత్సమానలావణ్యా మన్యాం తరుణీం కిం న కరోతి. పు 42.
12. మన్మథో మా మపహసిత నిజలావణ్యమేనం విలోకయన్తీ మసూయయేవ శిమాత్రం మన్నిజనామ సాన్వయంకరోతి. పు 42.
13. తస్మాన్మమాగబ్రనం నకరణీయమ్. పు 44.
14. లోకే పండితా అపి దాక్షిణ్యేనా కార్యం కుర్వన్తి. పు 44.
15. యదస్మిన్నన్తః ప్రవిశతి శుష్యతి పారావారః, సతినిర్గతే తద్దైవవర్ధతే. పు 46.
16. దోషాకరస్య దుష్కర్మ కింవర్ణ్యతే మయా. పు 46.
17. సా స్వచేతసో మాధుర్య కాఠిన్యే స్వయమేవ జానాతి. పు 48.
18. అస్యాం లీలావనౌ పాణ్డురతానిమిత్తం కిమ్ ? పు 49.
19. సుహృదా మకథనీయం కిమస్తి ? పు 49.

---